


# *Sri Sai Sadan* (Meda's Guest House)

SBI- Hanuman Temple, Main Road, Pu rthi - 515 134
Ananthapur Dist. (A.P.) India

Phones : 08555 - 87890, 87891, 87892, 87507; Fax : 08555 - 87508, Grams : "MEDA"

1. **Every suit is provided with Pantry, Drawing cum Dining Hall, Bedroom, sitout and attached Toilet.**
2. **Every suit is equipped with Fridege, Telephone, Geyser.**
3. **Spacious Bhajan/Meditation Hall on the top floor is provided for devotees.**
4. **Air-conditioned suits are also available.**
5. **A pure Vegetarian Restaurant with South Indian, North Indian & Continental Dishes.**
6. **S.T.D., I.S.T.D., FAX facilities.**
7. **A Doctor on call**
8. **Safety Lockers.**
9. **Ample Parking space.**
10. **Prompt service and best facilities at affordable Tariff.**

## Registered Office:

6-3-609/161, Anandnagar Colony, Hyderabad - 500 004.
Phones : Off:3394320, 3313796, Res:3313796 (STD:040) Fax:040-3394320

నవంబరు 1998

సంపుటి 14 సంచిక 11





సాంస్కృతిక మాసపత్రిక


సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు



మేనేజర్

**కొమరగిరి చంద్రశేఖర్**

24-52, రామానాయుడుపేట,

మచిలీపట్నం - 521 001.

© 22818, 21137



Cheques & Drafts should be drawn in favour of *"SREEVANI"* Monthly Machilipatnam

Edited, Printed and Published by

***Komaragiri Krishna Mohan Rao***


| | | |
|---|---|---|
| ప్రత్యేక సంచిక | : | 10-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |


*Printed at*

**SREEVANI OFFSET PRINTERS**

MACHILIPATNAM

*Despatched on*

**12 - 11 -1998**


## విషయసూచిక



ముఖచిత్రం : **భగవాన్ శ్రీ సత్యసాయిబాబా**

- - సంపాదకీయము - -

# చట్ట సభలు - ప్రజా ప్రతినిధులు

స్వతంత్ర భారతికి స్వర్ణోత్సవ హారతి పట్టి వీడ్కోలు పలికిన సమయంలో శాసనసభ్యుల నైతిక విలువల కమిటీ ఏర్పడి రాష్ట్రమంతా పర్యటించి ప్రముఖుల సలహాలను సేకరించే కార్యక్రమాన్ని చేబట్టటం అత్యంత శోచనీయం. మనకు స్వాతంత్ర్యం వచ్చి 50 సంవత్సరాల తరువాత చట్ట సభలకు ఎన్నికైన ప్రజాప్రతినిధుల నైతిక విలువలు దిగజారిపోయినాయని, మరల దిగజారిన ఆ నైతిక విలువలను పెంపొందించేందుకు అవసరమైన సూచనలు చేయమని ప్రజలను అర్థించడం నిజంగా ప్రజాస్వామ్యమునకే ఇది అవమానకరమైన విషయం.

ఈ మధ్య శాసనసభ, లోక్‌సభ కార్యక్రమాలు టి.విలో ప్రత్యక్ష ప్రసారం చేయడం వలన శాసనసభ్యులు, లోక్‌సభ సభ్యుల స్థాయి దిగజారినట్లుగా సామాన్య ప్రజలు సహితం గమనించారు. ఇంకా ఇదే విధమైన పరిస్థితులు గనుక శాసనసభ, లోక్‌సభలలో కొనసాగుతే ప్రజాస్వామ్య వ్యవస్థ మీదనే ప్రజలకు విశ్వాసం సన్నగిల్లే ప్రమాదం ఉన్నదని గ్రహించడం వలన ఈ నైతిక విలువల కమిటీ ఏర్పడింది. ఆలస్యం అయినప్పటికీ ప్రజా ప్రతినిధులకు కూడా ఒక ప్రవర్తనా నియమావళి ఉండటం సముచితమైనదిగా భావించటం హర్షణీయం.

ఈనాడు ప్రభుత్వ ప్రతిపక్ష సభ్యుల మధ్య వాగ్వివాదములు జరగటం, అసభ్యకరమైన పదజాలంతో స్థాయి దిగజారిన మాటలతో దూషించుకోవటం, ముష్టిఘాతాలతోనే సంతృప్తిపడక, చెప్పలు విసురుకోవడం, అంతటిలో ఆగక మైకులు విరుగగొట్టి, వాటిని ఆయుధాలుగా చేసుకొని ఒకరిపై మరొకరు ప్రయోగించుకోవటం, తత్ఫలితంగా చిరిగిన బట్టలు, పగిలిన తలలు, రక్తసిక్తమైన దేహములతో ఆసుపత్రులకు తరలించటంలాంటి దుస్సంఘటనలు తరచుగా చట్ట సభలలో ప్రత్యక్షమవుతున్నాయి. అట్టి దుస్సంఘటనలను టి.విలో చూచి మనం ఎన్నుకున్న ప్రతినిధులు వీరేనా? అని ఆశ్చర్యపడుతున్నారు, విచారిస్తున్నారు సామాన్య ప్రజలు. దీనికి కారణం? చట్టసభల బయట సామాన్య ప్రజలు కొట్టుకుంటే శిక్ష విధించబడుతుంది. కాని ఎన్నికైన ప్రజాప్రతినిధులు చట్ట సభలలో కొట్టుకుంటే మాత్రం శిక్ష లేదు. "కనుక మనల్ని ఎవరూ శిక్షించరు" అనే ధీమాతో ప్రజా ప్రతినిధులు చట్ట సభలలో విచ్చలవిడిగా, అసభ్యకరంగా, స్థాయి దిగజారి కొట్టుకుంటున్నారు. ఇది మారాలి. చట్ట సభలలో కొట్టుకొనేవారికి కూడా తగిన శిక్ష విధించేట్లుగా ప్రజా ప్రతినిధుల నైతిక ప్రవర్తనా నియమావళి రూపొందించబడాలి.

ఇకపోతే తరచుగా స్పీకర్ వద్దకు పరుగెత్తటం, స్పీకర్ చేతులలో నున్న బిల్లు కాగితములను లాక్కొని చించి ఎగుర వేయటం, స్పీకర్ ముందు బైఠాయించడం, అసభ్యకరమైన పదజాలంతో ఒకరినొకరు నిందించుకోవటం, గందర గోళాన్ని సృష్టించి చట్టసభల కార్యకలాపాలు సాఫీగా కొనసాగకుండా అడ్డు తగలడంలాంటి అవాంఛనీయమైన సంఘటనలు తరచుగా జరుగుతున్నాయి. అట్టి సంఘటనలను టి.వి.లో చూచిన సామాన్య ప్రజలకు ప్రజాప్రతినిధుల మీద గౌరవం సన్నగిల్లుతున్నది. ప్రజాస్వామ్యంలో ఇది అత్యంత ప్రమాదకరమైన విషయం.

కనుక "ప్రజాప్రతినిధుల నైతిక ప్రవర్తనా నియమావళిని కట్టుదిట్టంగా తయారుచేసి దానికి చట్టబద్ధతను కలుగ జేయాలి. ఫలానా తప్పుకు ఫలానా శిక్ష" అని స్పష్టంగా ఆ నియమావళిలో పేర్కొనాలి. ఎట్టి మొహమాటాలకు తావివ్వకుండా తప్పుచేసిన వారందరినీ (ప్రభుత్వ ప్రతిపక్షసభ్యులు) సమానంగా శిక్షించాలి.

ఇకపోతే చట్ట సభలలో గౌరవనీయులైన సభ్యులు అడుగుతున్న ప్రశ్నలకు మంత్రుల నుండి సరియైన సమాధానములు తరచుగా రావటం లేదు. సభ్యులు లేవనెత్తిన ప్రశ్నలకు మంత్రులు "పరిశీలిస్తాం, పరిష్కరిస్తాం, చూస్తాం, చేస్తాం" అని అస్పష్టమైన, అసంపూర్ణమైన సమాధానములు చెబుతున్నారు. దీనితో సంతృప్తి చెందని సభ్యులు గందరగోళాన్ని సృష్టించి సభ నుంచి వెళ్లిపోతున్నారు. ఇటువంటి పరిస్థితులలో 'స్పీకర్' పాత్ర అత్యంత ప్రధానమైనది. సభ్యులు అడిగిన ప్రశ్నలకు మంత్రులు నిర్దుష్టమైన సమాధానములు యివ్వాలని స్పీకర్ ఆదేశించాలి. ఒక వేళ వెంటనే యివ్వలేని యెడల, ఇంత సమయంలో సరియైన సమాధానం యివ్వాలని మంత్రులను స్పీకర్ ఆదేశించాలి. నిర్ణయించబడిన సమయంలో సరియైన సమాధానం మంత్రులు యివ్వని యెడల, అట్టివారి మీద చర్యలను గైకొనాలి.

ప్రజా ప్రతినిధుల నైతిక ప్రవర్తనా నియమావళిని వెంటనే తయారుచేసి, దానికి చట్ట స్వరూపాన్ని యిచ్చి సక్రమంగా దానిని అమలు పరచినప్పుడే ప్రజలకు ప్రజాస్వామ్య వ్యవస్థమీద విశ్వాసం పెంపొందుతుంది. ప్రజాస్వామ్యం వర్ధిల్లుతుంది.

(కొమరగిరి కృష్ణమోహనరావు)

నవరాత్రుల సందేశం - 1

# లోకభాషాలకు అందడు లోకేశ్వరుడు

## భగవాన్ సాయి ఉద్బోధ

"సత్యం మాతా పితాజ్ఞానం
ధర్మోభ్రాత దయాసఖా
శాంతః పత్నీ క్షమాపుత్రా
షడేతే జన బాంధవః"

ప్రేమ స్వరూపులారా!

ప్రపంచంలో ప్రతి వ్యక్తికి కూడా ఒక్కొక్క తల్లి ఉంటుంది. కాని జగత్తులోగల సర్వ మానవులకు ఒకే తల్లి. ఆ తల్లిని మనం గుర్తించాలి. భౌతికమైన జగత్తునకు, లౌకికమైన జీవితమునకు, పారమార్థికమైన తత్త్వమును అర్థం చేసుకోవటం చాలా కష్టం. ప్రవృత్తి మార్గమున ప్రయాణం చేసే ప్రతి వ్యక్తికి దివ్యత్వం అర్థం కావటం చాలా అవసరం. కాని ప్రతి మానవునకు ఒక మాతృదేవి ఉంటున్నది. ఆ దేవిని అనుసరించినటువంటి వారికి ఎట్టి ఇబ్బందులూ కలుగవు. ఆ తల్లి త్రికాలబాధ్యమైనటువంటిది, త్రిలోకములకు మూలమైనటువంటిది, త్రిగుణములకు అతీతమైనటువంటిది. అదే సత్యం. ప్రాకృతమైన తల్లులు మరణించవచ్చు, మార్పు చెందవచ్చును. ప్రదేశమును మార్చవచ్చును. కాని 'సత్యం' అనేటటువంటి తల్లి ఏ దేశమునకైనా, ఏకాలమునకైనా, ఏ వ్యక్తికైనా, ఏనాటికినీ ఒకే తల్లి. ఇట్టి దివ్యమైన, నవ్యమైన, భవ్యమైన, సమంజసమైన, సారభూతమైనటువంటి తల్లి సత్యం. ఈ సత్యాన్ని ప్రతి వ్యక్తి తల్లిగా భావించి, విశ్వసించి, అనుసరించటం అత్యవసరం. సత్యమునకు మార్పు లేదు. త్రికాలములయందునూ ఏక స్వరూపమును ధరించేటటువంటిది సత్యం.

తండ్రి ఎవరు? జ్ఞానం. జ్ఞానము అనగా లౌకిక జ్ఞానము, భౌతిక జ్ఞానము, ప్రజ్ఞానజ్ఞానము. ఈ జ్ఞానములు అనేక రకములైనవిగా వుంటున్నాయి. కాని ఇది కాదు అసలు జ్ఞానం. "అద్వైత దర్శనం జ్ఞానం" ఏకాత్మ భావమును విశ్వసించినట్టిదే జ్ఞానం. ఆ జ్ఞానమే సత్య స్వరూపము. దీనినే వేదం "సత్యం, జ్ఞానం అనంతం బ్రహ్మ" అన్నది. సత్యమే ప్రతి మానవునికి మాతృ స్వరూపిణి. జ్ఞానమే తండ్రి.

ధర్మము ఒక్కొక్క దేశమునకు, ఒక్కొక్క మతమునకు, ఒక్కొక్క సంప్రదాయమునకు, ఒక్కొక్క ధర్మముగా రూపొందుతూ వస్తున్నది. కాని సర్వ మానవులకు, సర్వ దేశములకు, సర్వకాలములయందు కూడనూ ఏకత్వంతో ప్రేమించేటటువంటి సోదరుడు ఈ యొక్క ధర్మము. ప్రేమ స్వరూపుడైనటువంటివాడు ఈ సోదరుడు. దీనిని పురస్కరించుకొనియే వేదములు "సత్యం వద, ధర్మం చర" అని బోధించాయి. సోదరునికి మించిన తండ్రి మరొకరు లేరు. రామలక్ష్మణులు సోదరులుగా చక్కటి ఆదర్శమును లోకమునకు అందించారు. ఒకానొక సమయంలో లక్ష్మణుడు మూర్ఛిల్లినప్పుడు రాముడు ఎంతో బాధపడుతూ "సీతవంటి భార్యను ఎక్కడైనా వెదికి పొందవచ్చు. కౌసల్యవంటి తల్లిని కూడా వెదికి సాధించవచ్చు. కాని లక్ష్మణుని వంటి సోదరుని మాత్రం తిరిగి నేను పొందలేను" అని ఏడుస్తాడు. ఇలాంటి సోదరుడు ఉండటం చేతనే రామతత్త్వం ప్రకాశిస్తూ వచ్చింది. కనుక ధర్మమే సోదరుడు.

ఇక మిత్రుడు. ఈనాటి మిత్రులు రేపు శత్రువులుగా మారవచ్చును. ఈవిధమైన అనుభవములు మనకు ఎన్నో కనిపిస్తున్నాయి. కాని దయకు మించిన మిత్రుడు మాత్రం మనకు కానరాడు. నిజమైన మిత్రుడు దయాస్వరూపుడు.

పత్ని ఎవరు? శాంతియే పత్ని. నిరంతరమూ, అన్ని మార్గముల యందునూ, అన్ని జీవరాసుల యందునూ, ఏకత్వాన్నివహించి, అనేకత్వంలో వున్నటువంటి ఏకత్వమును గురించి చింతించేటటువంటిది ఈ శాంతం. ఈ శాంతి మహర్షులకు ఆభరణం. ఋషులకు కిరీటం, ఆధ్యాత్మిక మార్గమునందు రాజమార్గము ఇలాంటి శాంతియే సర్వులకూ పత్ని.

పుత్రుడెవరు? క్షమయే పుత్రుడు. ఈ క్షమకు మించిన సుపుత్రుడు మరొకడు లేడు. ఈ క్షమయే సత్యము, క్షమయే వేదము, క్షమయే ధర్మము, క్షమయే అహింస, క్షమయే శౌర్యము - ఈ జగత్తునందు క్షమకు మించిన శక్తి మరొకటిలేదు.

కనుక సత్యము, జ్ఞానము, ధర్మము, దయ, శాంతము, క్షమ - ఈ ఆరు ప్రతి మానవునికి నిజమైన బంధువులు. ఈనాడు ఇట్టి మాతృదేవిని, ఇట్టి పితృ దేవుడిని, ఇట్టి సోదరుడిని, ఇట్టి సఖుడ్ని, ఇట్టి పత్నిని, ఇట్టి పుత్రుడను కోల్పోవటంచేతనే జగత్తు అనేక విధములైన అల్ల కల్లోలములకు గురియైపోతున్నది.

ప్రేమ స్వరూపులారా!

తల్లిదండ్రులను మనం గుర్తుంచుకోవాలి. తల్లి తండ్రి లేక నీవు లేవు. సత్యమనే తల్లి నీకు, నాకు, సర్వులకూ ఆమె తల్లియే.

> "సత్యంబు నందుండె సర్వంబు సృష్టించె
> సత్యంబు నందణిగె సర్వ సృష్టి
> సత్యమహిమలేని స్థలమేది కనుగొన్న
> శుద్ధ సత్యమిదియె చూడరయ్యా !"

కనుక సత్యమునందుండియే సర్వమూ సృష్టించ బడుతున్నది. సర్వమునకూ మాతయైనటువంటి ఈ సత్యము నీకు మాత్రం మాతృమూర్తి కాదా? ఆమె నీకు శాశ్వతమైనటువంటి మాతృమూర్తి, అమృతమయమైనటు వంటి మాతృమూర్తి. ఇటువంటి అమరత్వమైనటువంటి మాతృమూర్తిని పొందటం మానవుని మహ ద్భాగ్యం. కాని ఈనాడు ఇటువంటి పవిత్రమైన సత్య మాతృమూర్తిని కోల్పోయినారు మానవులు. ఈనాడు సత్యమనేది ఎక్కడనూ కనిపించటం లేదు. సత్యమును వెతుకవలసి వచ్చింది. ఒకప్పుడు సర్వత్రా ఉండినటువంటి సత్యమును ఈనాడు మనం కోల్పోయినాం. సత్యమును ఆరాధించడం అంటే మాతృ మూర్తిని ఆరాధించడమే. అదే ఈనాటి ఆరాధన యొక్క విశిష్ఠత.

ఇవి దేవీ నవరాత్రులు. దేవి అనగా మాతృమూర్తి అని మనం భావిస్తున్నాం. దేవి అనగా ఏమిటి? సత్యమే దేవి. ఆ దేవి యొక్క పేరు సత్య స్వరూపిణి. ప్రతి మానవుడు సత్యమును గుర్తించి, వర్తించాలి. సత్యమును ఎటువంటి పరిస్థితులలోను విడనాడ కూడదు. మాతృ వియోగం భరింపరానిది. సత్యమును విడువక, అనుసరించి నప్పుడు సర్వమునూ సాధించవచ్చును. ఈ సత్యాన్వేషణ నిమిత్తమై అనేక మంది మహర్షులు సాధనలు సల్పుతూ వచ్చారు.

ఈ నవరాత్రులయందు దేవీ భాగవతము మొదలగు పురాణాలు చదువుతుంటారు. లక్ష్మి, పార్వతి, సరస్వతి - త్రిమూర్తులను ఆరాధిస్తుంటారు. అసలు ఈ త్రిమూర్తులంటే ఎవరు? ఈ త్రిమూర్తులూ ఒక్క సత్యంలోనే ఇమిడివున్నారు. గాయత్రికి మూడు శిరస్సులు ఉన్నాయి. అవి గాయత్రి, సావిత్రి, సరస్వతి. మన ఇంద్రియములకు అధిపతి (Master) గాయత్రి. ప్రాణమునకు అధిపతి (Master) సావిత్రి. వాక్కునకు (Master) అధిపతి సరస్వతి. కనుక వాగ్దేవతా స్వరూపిణి సరస్వతి.

ఎక్కడ చూచినా శక్తి తప్ప మరో పదార్థమే కనిపించటంలేదు. కనుక ఈనాడు నవరాత్రి మహోత్సవ సందర్భములో శక్తి పూజలు జరుపుకుంటున్నాం. శక్తి ఎక్కడ నుంచి వచ్చేటటువంటిది? సత్యం ఒక శక్తి, ధర్మం ఒక శక్తి, శాంతి ఒక శక్తి, క్షమ ఒక శక్తి - ఇవన్నీ కూడా శక్తి యొక్క ఆరాధనలే. అన్నింటికీ సత్యమే మూలము. సత్యమునకు మించినది మరొకటి లేదు. సర్వశక్తులూ సత్యమునందు అంతర్భూతములై ఉన్నవి. కనుక అట్టి సత్యమును మనం తల్లిగా భావించాలి. తల్లితో సమానమైన ఈ సత్యమును మనం ఏనాటికి మరవకూడదు. తల్లిని పూజించటమంటే సత్యమును పూజించటం, సత్యమును అనుసరించటమే. కనుక మనం సత్యమును అనుసరించాలి, సత్యమును పలకాలి. దురదృష్టవశాత్తు ఈనాడు 'సత్యంవద' బదులు 'సత్యంవధ' చేస్తున్నారు. ధర్మాన్ని అనుసరించడానికి (ధర్మం చర) బదులు ధర్మాన్ని చెరసాల (ధర్మంచెర)లో పెడుతున్నాం. సర్వులనూ రక్షించేవి ఈ రెండే (సత్యం, ధర్మం). అలాంటి సత్య ధర్మములను మనం ఈనాడు విస్మరిస్తున్నాం.

అసత్యమును, అధర్మమును విశ్వసిస్తున్నాము. కనుకనే ఎన్నడు అనుభవించని అవస్థలు ఈనాడు ఈ దేశము అనుభవిస్తున్నది.

మన ప్రాచీనులు ఇది సత్యమా? ఇది అసత్యమా? ఇది ధర్మమా? లేక ఇది అధర్మమా? అని విచారించి ముందుకు నడిచేవారు. ఈనాడు ఆ విచారణే లేదు. దైవాన్వేషణ జరుపుతున్నామని చెబుతుంటారు. ఇది ఈనాటిది కాదు, అనాది కాలం నుంచి దైవాన్వేషణ జరుపుతూ వస్తూనేవున్నారు. సత్యాన్వేషణ సరియైన మార్గంలో సలిపినప్పుడు సర్వమూ దైవ స్వరూపకంగానే రూపొందుతుంది. సత్యమే దైవము గదా? (Truth is God) తల్లిని, భార్యను, బిడ్డను, చెల్లెల్ని ఈ నల్గురిని చూచేవి ఒకే కన్నులే. ఒకే దృష్టేకాని ఎవరిని ఏవిధంగా చూడాలో ఆవిధంగా చూడటమే సత్యాన్వేషణ, తల్లిని మాతృదేవిగా చూడాలి. అదే సత్యాన్వేషణ అన్నారు. కేవలం భౌతికమైన రూప నామములు మనం విచారించుకుంటే సత్యం తేలదు. మనకు తెలియనటువంటివి, దృష్టికి గోచరం కానటు వంటివి ఎన్నియో వుంటున్నాయి. "యద్దృశ్యం తన్నశ్యం" అన్నారు. ఈనాడు మన దృష్టికి కనిపించేటటువంటివన్నీ ఒకనాడు కనిపించకుండా పోతాయి. ప్రత్యక్ష ప్రమాణం అని కొందరు వాదిస్తుంటారు. ప్రత్యక్ష ప్రమాణం అనేది పరిపూర్ణ జ్ఞానం కాదు. పరిపూర్ణంగా కనిపించనటువంటివి ఎన్నియో వుంటున్నాయి. ప్రత్యక్షమునే ఆధారంగా తీసుకొని పోతే నీవు మోసపోతావు. ఒక వ్యక్తి యొక్క ఎత్తు, బరువు, రంగును చూచి ఇదే ప్రత్యక్ష ప్రమాణమనుకుంటే, మనకు తెలియనటువంటివి ఎన్నియో వుంటున్నాయి ఆ వ్యక్తిలో. కరుణ, ప్రేమ, దయ, నిర్దయ, క్రోధం వుండవచ్చును. ఇవన్నీ మనకు తెలియనటువంటివి. తెలియనటువంటివి ఎన్నో అతనిలో ఇమిడి ఉన్నాయి. తెలిసినవే సత్యమని భావించుకోవటం చాలా మూర్ఖత్వం. ఆ ప్రత్యక్షమునందు పరోక్షమైన గుణములు ఎన్నో ఉంటున్నాయి. ఈ గుణమును మనం గుర్తించినప్పుడే ప్రత్యక్షం మనకు ప్రమాణంగా తోస్తుంది. కనుక ప్రత్యక్ష ప్రమాణమే ప్రధానమైనటువంటిది కాదు. ప్రతిదానికి ఒకటి పరోక్షమైనది ఉంటుంది. దైవం ప్రత్యక్షంగా కనిపించేటటు వంటిది కాదు. దైవత్వం సర్వత్రా ఉంటున్నది. ఈ సత్యం, ధర్మం సర్వత్రా ఉంటున్నది. నీవు ఆచరించి, అనుభవించి, ఆనందించు. అప్పుడు ... ఆత్మతృప్తి కలుగుతుంది. అన్నింటికి ఆత్మసాక్షి. అదియె నీ కాన్షన్స్. ఇలాంటి ఆత్మ సాక్షాత్కారానికి తగిన మార్గాన్ని వెతకాలి.

ఈ ఆత్మ ఎక్కడ ఉంటున్నది? సర్వత్రా ఉంటున్నది. ఆత్మలేని స్థానమేలేదు. ప్రతి జీవియందు ఉంటున్నది. అయితే దానికి రూపం లేదు. "నిర్గుణం, నిరంజనం, సనాతనం, నికేతనం, నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త, నిర్మల స్వరూపిణం". అలాంటి ఆత్మ తత్త్వమును ఎవరు గుర్తించగలరు? అసలు సత్యం... సత్యం.... అంటున్నారు. సత్యమును గుర్తిస్తున్నారా? ప్రత్యక్ష ప్రమాణమైన సత్యమునే గుర్తించలేకపోతున్నారు. నిత్య జీవితంలో నీ సత్య జీవితాన్ని గుర్తించుకోలేక పోతున్నావు. సత్యమంటే చెప్పింది చెప్పటం, చూచింది చెప్పటం, వినింది చెప్పటం - ఇది మాత్రమే సత్యమనుకుంటున్నారు. ఇదంతా ఇంద్రియ గోచరమైనటువంటిదే. ఇంద్రియాతీతమైనటు వంటిది ఆత్మతత్త్వము. ఇలాంటి ఆత్మతత్త్వమును మనం ఏరీతిగా గుర్తించాలి? మన కాన్షన్స్‌ను మనం విచారణ చేయాలి. ఎక్కడికో పోయి వెదకనక్కరలేదు. నీయందే వున్నటువంటి నీ కాన్షన్స్‌ను వెదుకు. నీ దృష్టిని అంతర్ముఖం గావించుకో. ఆత్మదృష్టి గలవాడు ప్రతి దానిని దైవంగానే భావిస్తాడు. **లోక భావంతో చూచేటటువంటి వానికి లోకమే కనిపిస్తుందిగాని లోకేశ్వరుడు కనిపించడు.** విశ్వదృష్టి (Divine Look)తో చూచేటటువంటి వానికి విశ్వమే కనిపించదు. కనుకనే **"విశ్వం విష్ణుమయం జగత్"** అన్నారు. సర్వత్రా ఉన్నది భగవత్ తత్త్వమే. మానవా కారములో ఉన్నావని నీవు భావిస్తున్నావు. ఆకారములు వేరువేరుగా ఉండవచ్చును. ఆ ఆకారము యొక్క నామములు వేరువేరుగా ఉండవచ్చు. కాని అందరి యందున్న ఆత్మ ఒక్కటే. కనుక అట్టి ఏకత్వాన్ని గుర్తించ డానికి తగిన కృషి చేయాలి. మన బహిర్ దృష్టిని అంత ర్ముఖంగావించుకోవాలి. అప్పుడే మనకు సత్య స్వరూపం గోచరిస్తుంది. పుట్టినది దేహం, మరణించునది కూడా

దేహమే. ఆత్మకు మాత్రం చావు పుట్టుకలు లేవు.

"చావు పుట్టుక లేని శాశ్వతుండు
ఆది మధ్యాంత రహితుడనాదివాడు
తాను పుట్టక చావక చంపబడక
సర్వమును బ్రహ్మరూపమై తానె నిలుచు"

ఆ బ్రహ్మ అనగా ఏమిటి? కేవలం నాలుగు శిరస్సులున్నవాడు కాదు బ్రహ్మ. ప్రపంచమంతా వ్యాపించినటువంటివాడు బ్రహ్మ. సర్వం బ్రహ్మమయం. ఎక్కడ చూచినా బ్రహ్మ Expansion of Love is God. నా దేహము అనే Contraction of Life is Death. నా దేహం.... నా దేహం... అనేది ఒక్క నీ దేహమునకు సంబంధించినటువంటిదే. కనుక ప్రేమను పెంచాలి. Love is God. Live in Love. ఇది నా ఇల్లు, ఇది నా కుటుంబం అని సంకుచితంగా ఆలోచించకూడదు. మనం సత్య జీవితాన్ని అనుసరించాలి. లోకములో ఉన్నదంతా సత్యమే. అసత్యమనేదే లేదు. ఒక వేళ ఒకటి, నీ దృష్టిలో అసత్యంకావచ్చు. ఇతరుల దృష్టిలో అది అసత్యమే కాదు. ప్రపంచమంతా దృష్టి దోషమేగాని సృష్టి దోషము లేదు. నీకన్నులకు నీలం అద్దాలు పెట్టుకుంటే అంతా నీలంగా కనిపిస్తుంది. ఎర్ర అద్దాలు పెట్టుకుంటే అంతా ఎర్రగా కనిపిస్తుంది. ఇది అద్దాల దోషమేగాని, కనుల దృష్టి దోషం కాదు.

"సర్వం ఖల్విదం బ్రహ్మ" అంతా బ్రహ్మ స్వరూపమే. అందర్నీ బ్రహ్మగా భావిస్తాం, గౌరవిస్తాం, ప్రేమిస్తాం. ఈ విధంగా ఉన్నప్పుడు ద్వేషమునకు అవకాశమేలేదు. ఈ కక్షలు, కార్పణ్యాలకు అవకాశమేలేదు. ఈనాడు లోకంలో ఈ కల్లోలాలకు కారణమేమిటి? సమత్వం లేకపోవటమే దీనికి మూలకారణం. ఈ సమత్వం వచ్చినప్పుడే సర్వులయందు ప్రేమతత్త్వం ఆవిర్భవిస్తుంది.

ప్రేమ స్వరూపులారా!

ఈ నవరాత్రులలోపల సప్త విధములైన పూజలు చేసుకుంటున్నాం. సప్తవిధములైన ఆరాధనలు సల్పుతున్నాం. దీనికి 'సప్తాహం' అని పేరు పెట్టుకున్నాం. ఎందుకు సప్త సంఖ్య పెట్టుకున్నాం? సప్త స్వరములు, సప్త లోకములు, సప్త సముద్రములు, సప్త ఋషులు - అన్నీ ఏడు అంకెల మీదనే ఉంటున్నాయి. ఇవన్నీ ఎక్కడ ఉంటున్నాయి? మనయందే ఉంటున్నాయి. మన కంటే భిన్నమైనటువంటిది ఏదీ లేదు. దైవం మనకంటే వేరుగా ఉన్నాడనుకోవటం చాలా అజ్ఞానం. భగవంతుడు ఎక్కడనో వున్నాడని వెదకటం మహా అజ్ఞానం. నీవే దైవస్వరూపం. నీవు కేవలం మానవుడవని విశ్వసించి, ఈ మానవాకారమును ఆధారం చేసుకొని, 'నేను ఫలానావాడను' అని విశ్వసిస్తున్నావు. ఈ దేహం శాశ్వతం కాదు. ఈ దేహం నీటి బుడగలాంటిది. మనసు పిచ్చికోతి లాంటిది. పిచ్చికోతిని, ఈ నీటి బుడగను ఎందుకు నమ్ముకుంటావు? ఈ నీటి బుడగ ఎప్పుడు చితికి పోతుందో? ఈ పిచ్చికోతి ఏమైపోతుందో? దాని పేరు 'మంకీ' కనుక ఆ Monkeyని Mankind గా మార్చుకోవాలి. నీ ఆత్మను నీవు అనుసరించు. అప్పుడే నీవు ఆత్మతృప్తిని పొందుతావు.

పవిత్రమైన గుణములను అభివృద్ధిపరచే నిమిత్తమై ఈ నవరాత్రి ఆరాధనలు ప్రారంభమైనాయి. దుర్గ, సరస్వతి, లక్ష్మి - ఇవన్నీ మూడు గుణముల స్వరూపములే. అవి సత్వ, రజో, తమో గుణములు. ఈ మూడు గుణములను మూడు ఆకారములుగా తీసుకున్నాం. సాత్వికము హృదయము నుండి ఆవిర్భవిస్తుంది. రజో గుణము కంఠం నుంచి వస్తుంది. తమో గుణము నాలుక నుంచి వస్తుంది. నాలుకపై నుంచి వచ్చేది గాస్... గాస్.... హృదయము నుంచి రావటంలేదు. హృదయం నుంచి వచ్చేది శాంతంగా వస్తుంది. శాంతం అనేది హృదయానికి కేంద్రం. శాంతం అనేది సత్వగుణం.

దశరథుడు ఎవరు? అయోధ్యరాజనుకుంటారు చాలా మంది. కాదు....కాదు... ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములు కలిసి మొత్తం పది. పది ఇంద్రియముల రథమే దేహము. ఈ దశేంద్రియములకు అధిపతి అయినవాడే దశరథుడు. ఈ దేహమే ఒక రథము. ఈ రథమునకు దశరథుడు అధిపతి. ఇతను మూడింటిని ఆశించాడు. అదే కౌసల్య, సుమిత్ర, కైకేయి- మూడు పత్నులు. ఇవే సత్వ, రజో, తమో గుణములు. ఈ

మూడు గుణముల ద్వారా పురుషార్థములనే చతుర్విధ పురుషార్థములు పుట్టాయి. అవే ధర్మ, అర్థ, కామ మోక్షములు. వారే రామ, లక్ష్మణ, భరత శత్రుఘ్నులు. ఇవి చతుర్విధ ధర్మములు.

దశరథుని ముఖ్య పట్టణం అయోధ్య. యోధులు చేరటానికి వీలుకాని స్థానము అని అర్థం. అదియే హృదయము. హృదయములో ఎవరూ చేరటానికి వీలులేదు. ఏ ద్వేషి లోపల ప్రవేశించడానికి వీలు కాదు. ఏ దుర్మార్గుడు లోపల ప్రవేశించడానికి వీలులేదు. ఎవరూ చేరటానికి వీలులేని స్థలము ఈ అయోధ్య. అదియే మన జీవితానికి నిజమైన ముఖ్య పట్టణము.

అంగములోని సంగము, సంగములోని లింగము, లింగములోని జంగము. అంగము అనగా దేహం. అంగంలోని సంగము ఏమిటి? సంగము అనగా అసోసియేషన్. అవే కామ క్రోధ లోభ మద మాత్సర్యములు. ఈ సంగం లోపల ఒక జంగం ఉంటున్నాడు. అతనే ఆత్మస్వరూపుడు. ఆ సంగమే లింగం. అతను అన్నింటిని సమాప్తం చేస్తూంటాడు. కనుక సర్వమూ మనయందే ఉంటున్నది. విశ్వమంతా మనయందే ఉంటున్నది. ఏదో విశ్వాన్ని చూడాలని ప్రయాణం చేస్తున్నావు. చాలా పిచ్చితనం. ఏదేశం వెళ్లినా బిల్డింగులు మారవచ్చును, మనుష్యులు మారవచ్చును, పరిస్థితులు మారవచ్చునుగాని నీయందున్నటువంటిది ఏ నాటికీ మారదు. ఏమిటి? నీవు ప్రపంచంలో చూచేది? దూరంగా వున్నప్పుడు అంతా నున్నగా కనిపిస్తుంది. అందుకనే దూరపు కొండలు నునుపు అన్నారు. దగ్గరకు వెళ్లితే కొండలు గుట్టలు మిట్టలే. నునుపు తనమనేది లేదు. దూరంగా వున్నప్పుడు నునుపుగా వున్నట్లు భావిస్తాం. దగ్గరగా వచ్చినప్పుడు యదార్థం బయటపడుతుంది. వైకుంఠం ఎక్కడో దూరంగా లేదు. కైలాసం ఎక్కడో దూరంగా లేదు. స్వర్గం ఎక్కడో దూరంగా లేదు. ఇవన్నీ నీ హృదయంలోనే ఉంటున్నాయి. 'తన సంతోషమే స్వర్గం, తన దుఃఖమే నరకము'. కనుక స్వర్గం వేరు నరకం వేరు కాదు. దోషములు చేయకుండా వుండునిమిత్తమై, తప్పులు చేస్తే నరకం వస్తుందని చెప్పారు. మన మనో ప్రవర్తనమీదనే స్వర్గ నరకములు ఆధారపడి ఉన్నాయి. మన దుఃఖమే మన నరకం. ఈ దుఃఖం ఎక్కడ నుంచి వస్తున్నది? నీ ప్రవర్తన యొక్క Reaction, Resound, Reflection. ఈ మూడింటి యొక్క ప్రతిబింబాలే మన హృదయంలో ఉంటున్నాయి. అన్నింటికి మన మనసే మూలం. కనుక మన మనసును అదుపులో పెట్టుకుంటే మనకు ఏ బాధలూ వుండవు. Man has conquered every thing. But he has not conquered himself అన్నారు. మనిషి అన్నింటినీ జయించాడు కాని, తనను తాను మాత్రం జయించుకోలేకపోయినాడు. తనను తాను తెలుసు కోకుండా, ఎన్నింటినో తెలుసుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు. ఎన్ని ప్రయోగాలు చేసినా ప్రయోజనం లేదు. తనను తాను తెలుసుకోలేని ప్రయోగాలు నిష్ప్రయోజనాలు. తనను తాను తెలుసుకుంటే సర్వమునూ తెలుసుకున్నవాడవుతాడు. ఇదే ఉపనిషత్తులు చెప్పాయి. ఏ దానిని తెలుసుకుంటే సర్వమునూ తెలుసుకున్న వాడవుతాడో, ఏ దానిని చూస్తే సర్వమునూ చూచినవాడవుతాడో, ఏ దానిని అనుభవిస్తే సర్వమునూ అనుభవించినవాడవుతాడో - దానిని తెలుసుకో! దానిని చూడు! దానిని అనుభవించు! - అదియే ఆత్మానందం, అదియే నిత్యానందం, అదియే పరమానందం, అదియే అద్వైతానందం, అదియే సాక్షాత్ ఆనందం. ఆ ఆనందం అనేది ఎక్కడ ఉంటున్నది? True happiness is union with God. అదే నిజమైన ఆనందం.

మన హృదయం క్షీరసాగరం. అయితే క్షీర సాగరమైన మన హృదయాన్ని ఈనాడు క్షారసాగరంగా మార్చుకుంటున్నాం. క్షీరసాగరంలో విష్ణువు పవళించాడు. అది క్షారసాగరంగా మారితే తిమింగిలాలకు నిలయమ వుతుంది. క్షీరసాగరమైన మానవ హృదయాన్ని క్షారసాగరంగా మార్చి నిర్మలమైన మానవ హృదయాన్ని కలుషితం చేయకండి! క్షీరసాగరం అంటే పాలసముద్రం. పాలు తెల్లగా ఉంటాయి. అనగా హృదయం నిర్మలంగా ఉంటుంది. ఆ నిర్మలమైన హృదయం లోపల క్షీర సాగరుడు పవళిస్తాడు. అతనే విష్ణువు. సర్వవ్యాపకుడైన విష్ణువు హృదయవాసిగా ఉంటాడు. కనుక విష్ణువు స్థానం

హృదయమే. దీనిని సరిగా అర్థం చేసుకుంటే దైవం కోసం ఎక్కడికో పోనవసరం లేదు. God is with you, in you, around you, below you, above you. అయితే ఈనాడు దగ్గర ఉన్న దైవత్వాన్ని విస్మరించి, దూరంగా ఎక్కడికో పోతున్నాం. దైవముకంటే దగ్గర వున్నవాడు మరొకడులేడు. ఈ దైవమే తల్లి. తల్లి హృదయ స్థానములో ఉంటున్నది. ఆమెయే సత్య స్వరూపిణి. కనుక సత్యమును ఆరాధించండి! సత్యమును అనుసరించండి! సత్య వాక్కును ఉచ్చరించండి! సత్యమార్గములో పయనించండి! సత్య ధర్మాలను ఏకం చేయండి! ఈ రెంటిని ఏకం చేయటంలోనే మానవత్వం సార్థకమవుతుంది.

నేను నా ఉపన్యాసమును శ్లోకంతో ప్రారంభిస్తాను. భజనతో ముగిస్తాను. శ్లోకము అనేది క్రిందప్లేటు. నా సంభాషణ కంచంలో వడ్డించిన విందు పదార్థములు. కడపటి భజన, పైన మూతపెట్టిన ప్లేటు. నేను వడ్డించిన భోజనమును విందుగా తీసుకోండి కాని మందుగా తీసుకోకండి! విందును పూర్ణంగా అనుభవించండి. అప్పుడే "పూర్ణమదం పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే" అవుతుంది.

*(ది.25-9-1998న ప్రశాంతినిలయంలో నవరాత్రుల ప్రారంభదినాన భగవాన్‌సాయి చేసిన దివ్య ప్రసంగం నుండి)*

# ఆపన్నివారకుడు శ్రీ సత్యసాయి

ఈశ్వరాంబ ప్రేరణతో భక్తురాలికి ఆపరేషన్ చేసి ఆమె బాధను తొలగించిన ప్రేమమూర్తి భగవాన్ శ్రీ సత్యసాయి లీలలు అత్యద్భుతం. ఆంధ్రప్రదేశ్‌లోని ఖమ్మం జిల్లా వేంసూరు మండలం వేంసూరు గ్రామంలో రిటైర్డ్ టీచర్ శ్రీ శంకరయ్యగారి కోడలు కలకొడిమ సుధ తలనొప్పితో విపరీతంగా బాధ పడుతోంది. ఆమె బాధ చూడలేక స్పెషలిష్టుకు చూపించాలని కారు మాట్లాడుకొని ది. 18-7-98న వెళ్లాలని నిశ్చయించుకొన్నారు.

ఆ రోజు తెల్లవారుఝామున ఈశ్వరాంబగారు ఆ గ్రామంలో ఉన్న కళ్యాణి సుధ మంచం వద్దకు వచ్చి ఈశ్వరాంబ పాదాల నుండి ఉద్భవించిన విభూదిని కళ్యాణి సుధ నోటిలో బలవంతంగా చొప్పించింది. ఫలితం ప్రశాంతంగా నిద్రపోయింది బాధితురాలు. కదల లేని పరిస్థితులలోనున్న సుధ తనంతతాను ఉదయం లేచి నెమ్మదిగా కాలకృత్యాలు తీర్చుకోగలిగింది. బంధువులు ఆశ్చర్యపోయారు. సుధ కోరికపై ప్రయాణం ఆగిపోయింది.

మరునాడు మహిళాదినోత్సవం. ది. 19-7-98 ఉదయం ఈశ్వరాంబగారు, డాక్టర్ రూపంలో ఉన్న స్వామి వచ్చి తల్లి ఆజ్ఞచే స్వామి సుధ మెదడు ఆపరేషన్ చేసి అందలి మాలిన్యమును మంచం క్రింద పడవేసి, కుట్లు వేసి శిరస్సుపై విభూదిని నింపి, ప్రతి రోజు వచ్చి చూసి వెళ్తాను అని అభయమిచ్చారు. స్వామిని చూడలేకపోయినా ఆగ్రామంలో 60, 70 మంది యీ ప్రక్రియను చూడగలిగారు. కానీ ఆ గ్రామంలోని కుమారస్వామి, సుధ మాత్రమే వైద్య బృందాన్ని చూడగలిగారు. ఆ గదిలో క్రింద పడ్డ రక్తము, మాలిన్యము, సుధ తల పై కుట్లు గ్రామస్థులందరూ చూసి అబ్బురపడ్డారు. డాక్టరు రూపంలో ఉన్న స్వామి 'గది తలుపులు, కిటికీలు భందిస్తే ఎట్లా రావాలి? తలుపులు తెరిచి ఉంచమని' అన్నారట. స్వామి 2,3 రోజులు వచ్చి డ్రసింగ్ చేసి భక్తురాలి బాధను పోగొట్టి ఆపన్నివారకుడు అయినారు-శ్రీ సత్యసాయి. స్వామి సుధచే విభూది, కుంకుమ సృష్టించి భక్తులకు యిప్పించారు.

ఈ సంఘటన ద్వారా స్వామి తాను పుట్టపర్తిలో మాత్రమే ఉంటున్నట్లుకాదని, సర్వాంతర్యామినని, ఎప్పుడు ఎక్కడ భక్తుడు బాధ పడుతూ ఉంటాడో అక్కడ అనేక రూపాలలో సాక్షాత్కరించి ప్రేమ వర్షాన్ని కురిపించి భక్తుల బాధలు తీర్చుతానని వెంట, జంట, అండగా ఉంటానని తెలియజెప్పటానికే యీ చమత్కారం చేశారని అవగతమవుతోంది. స్వామి లీలలు అనంతం, అద్భుతం.

– 'మాధవ'

- - సాయి దివ్యలీలలు - -

# డాక్టర్ డి.జె. గఢియా

డి. వెంకటేశ్వరరావు

గఢియా సౌరాష్ట్ర రాష్ట్రంలో వైద్య విద్య చదివి, ఆఫ్రికా ఖండంలోని టాన్‌జానియా దేశంలో డాక్టరుగా స్థిరపడ్డాడు.

1959లో వైద్య విద్యార్థిగా ఉన్నప్పుడు, తన నాన్నగారి స్నేహితుడైన మాధవదీక్షిత్ అనే ఆయన మధుమేహ వ్యాధితో బాధపడేవాడు. దీక్షిత్‌కు షుగరు జబ్బు ఎంతో ముదిరిపోయి రోజూ ఇన్సులిన్ ఇంజక్షను తీసుకోవలసివచ్చేది. ఆ జబ్బుని గురించి అపుడే కాలేజీలో తెలుసుకొంటున్న గఢియా, దీక్షిత్ మీద చాలా జాలి పడేవాడు. దీక్షిత్ సరిగా తినటానికి వీలులేకపోగా, ఎక్కువ కాలం జీవించడం జరుగదు గదా అని గఢియా బాధపడే వాడు. కాని 1959లో దీక్షిత్ పుట్టపర్తి యాత్ర చేసినపుడు భగవాన్ బాబా చాక్‌లెట్ రంగు విభూతి సృష్టించి ఇచ్చి ఆయన జబ్బుని పూర్తిగా నయం చేసారు. ఒకసారి మధుమేహ వ్యాధి వస్తే, అది తగ్గదని, మందుల ద్వారా ఆ వ్యాధిని అదుపులో మాత్రం ఉంచవచ్చని వైద్యశాస్త్రం చెపుతుంది. అటువంటి వ్యాధిని కొద్ది రోజులలో తగ్గించిన శ్రీ సత్యసాయిబాబా, సాక్షాత్తూ దైవ స్వరూపుడయి ఉండాలని గఢియాకు నమ్మకంకుదిరి, భగవాన్ భక్తుడయ్యాడు.

గఢియా తన చదువు పూర్తిచేసి ఆఫ్రికా ఖండానికి వెళ్ళే ముందు, భగవాన్‌ని దర్శించుకున్నాడు. బాబా గఢియాతో కలసి ఫోటో తీయించి, ఒక లాకెట్ సృష్టించి ఇచ్చి "దీనిని నీవు ఎపుడూ నీ శరీరం మీదే ధరించు. ఇది నీకు రక్ష" అని చెప్పారు. ఆ లాకెట్‌లో విష్ణుమూర్తి, విష్ణు హృదయంలో షిర్డీ బాబా, క్రింద సత్యసాయి, ఆ తరువాత ప్రేమసాయి రూపాలు చాలా అందంగా చెక్కబడి ఉన్నాయి. "ఈ రోజు నుంచి నా పనే చేస్తావు" అని స్వామి గఢియాకు వీడ్కోలు ఇచ్చారు. టాన్‌జానియా దేశం వెళ్ళి అక్కడ "ఓమ్ సాయి క్లినిక్" స్థాపించాడు గఢియా. ఆ క్లినిక్ ప్రారంభం రోజు భగవాన్ ఆశీస్సులు టెలిగ్రామ్ ద్వారా అందాయి. స్వామిని తలుచుకుంటూ అనేకమంది రోగులకు సేవచేసాడు డాక్టర్ గఢియా.

కొన్ని సంవత్సరాల తర్వాత భారతదేశం వచ్చి సౌరాష్ట్రలో కొన్ని రోజులు గడిపి, పుట్టపర్తిలో స్వామి దర్శనానికి వెళ్ళాడు. స్వామి ఇంటర్వ్యూ ఇచ్చి మాట్లాడుతూ మధ్యలో ఆగి, ఒక కాగితం, కలం తీసుకుని రాసుకొమ్మని ఈ విధంగా చెప్పారు. "ఇప్పుడు ఆఫ్రికాలో ఉన్న కంపాలా పట్టణంలో మీ తల్లికి ఆపరేషన్ జరుగుతున్నది. ఆపరేషన్ చేస్తున్న డాక్టర్లు మీ తమ్ముడితో ఆమె బ్రతకదని చెప్పారు. అయినా ఆమెకు నేను రెండవ జీవితం ప్రసాదిస్తాను." డా॥ గఢియాకు ఆ ఆపరేషన్ గురించి ఏమీ తెలియదు. తమ్ముడికి ఉత్తరం రాస్తే దానికి సమాధానంగా తన తల్లి పేగుకి చీము పట్టిందని, డాక్టర్లు ఆపరేషన్ చేయాలని చెప్తూ ఏమీ ఆశపెట్టుకోవద్దని చెప్పారని, అప్పుడు తాను స్వామి విభూతి డాక్టర్లకిచ్చి ఆమె నుదిటికి రాయమన్నానని, కనీసం ఆమె మరణించేటప్పుడు ప్రశాంతంగా పోవాలని అలా చెప్పానని, కాని విభూతి రాసిన తర్వాత ఆమె ఆశ్చర్యకరంగా కోలుకున్నదని తన తమ్ముడు రాశాడు. డా॥ గఢియా స్వామికి కృతజ్ఞతలు తెల్పుకున్నాడు.

ఇది జరిగిన రెండు సంవత్సరాలకు డా॥ గఢియా మళ్ళీ భారతదేశం వచ్చినపుడు స్వామి శ్రద్ధానంద అనే సన్యాసిని భగవాన్ దర్శనానికి బెంగుళూరు తీసుకుని వెళ్ళాడు. స్వామి నిత్యానంద శిష్యుడైన స్వామి శ్రద్ధానందకు భారతదేశంలో చాలాచోట్ల ఆశ్రమాలున్నాయి. ఆయనకు దేశం నలుమూలలా శిష్యులున్నారు.

బాబా ఇంటర్వ్యూకి పిలిచిన వారికి విభూతిని సృష్టించి ఇవ్వటం కోసం తన చేతిని తిప్పబోతుండగా శ్రద్ధానంద స్వామి చేతిని బలంగా నొక్కిపట్టి అటువంటివి తనవద్ద చెయ్యవద్దన్నారు. తను బాబాను పరీక్ష చేయటానికి వచ్చానని చెప్పారు. కోపం రావలసిన తరుణంలో స్వామి ఎంతో శాంతంగా చిరునవ్వులు చిందిస్తూ స్వామి శ్రద్ధానంద ఒక్కరినే లోపలి ఇంటర్వ్యూ గదిలోకి తీసుకుని వెళ్ళారు. కొన్ని నిముషాల తర్వాత బయటకు వచ్చినప్పుడు స్వామి

శ్రద్ధానంద కంటివెంట ఆనందాశ్రువులు కారుతున్నాయి. "బాబా సాక్షాత్తు భగవత్స్వరూపుడు. ఆయన అంగీ విప్పినప్పుడు ఆయన ఛాతిమీద నాకు నా గురువు స్వామి నిత్యానంద కనుపించారు" అని ఎంతో ఆనందంగా చెప్పారు.

బాబా అప్పుడు డా॥ గధియాతో "నిన్న మీ తల్లిదండ్రులను కారు ప్రమాదం నుండి రక్షించటానికి ఆఫ్రికాలోని కంపాలా వెళ్ళాను" అని చెప్పారు. డా॥ గధియాకు తర్వాత కంపాలా నుండి తెలిసిన విషయమేమిటంటే, తన తల్లిదండ్రులు ప్రయాణిస్తున్న కారు ఒక ప్రమాదంలో తుక్కు అయిపోయిందని, అయినా వాళ్ళిద్దరికి ఏమీ ప్రమాదం జరగలేదని, "ఎందుకు స్వామీ మా మీద ఇంత కృప?" అని గధియా అడిగినప్పుడు "నీ తల్లిదండ్రుల, మీ అమ్మమ్మ భక్తే మిమ్మల్ని కాపాడుతున్నది." అని చెప్పారు స్వామి.

డా॥ గధియా ఆఫ్రికా వెళ్ళిన అనేక సంవత్సరాల తర్వాత 1974లో, ఆయన భార్యతో ఒక ఊరు నుంచి మరొక ఊరికి కారులో వెళుతుండగా ఎదురుగా స్పీడుగా వస్తున్న ఒక లారీ ఆ కారుని గుద్దేసింది. ఆ లారీ ఎంత బలంగా కారుని గుద్దిందంటే, డా॥ గధియా పట్టుకున్న స్టీరింగు చక్రం వెనుక టైరు వెనకాల వరకు తోసుకుపోయింది. ఆ సమయంలో గధియా "బాబా, బాబా" అని అరిచి స్పృహ తప్పిపోయాడు. కొద్ది సేపట్లో తను ఆకాశ మార్గాన పుట్టపర్తి చేరుకున్నట్లు అనుభవం కలిగింది. అపుడు స్వామి కంఠం వినిపించింది. "లే, కళ్ళు తెరు. లేకపోతే నీ శరీరంలో అన్ని ఎముకలు విరిగిపోతాయి."

డా॥ గధియా కళ్ళు తెరిచి చూసేసరికి తన కారు చుట్టూ అనేకమంది మూగి ఉన్నారు. అంతలో ఇద్దరు బలవంతులైన నీగ్రోలు పెద్దగా "తప్పుకోండి, తప్పుకోండి' అని అరుస్తూ కారు దగ్గరకు వచ్చి పగిలిపోయిన అద్దం ముక్కలను జాగ్రత్తగా తీసి, వంగిపోయి రాకుండా ఉన్న తలుపులను ఎంతో నేర్పుగా కోసి, సీట్లు బయటకు లాగి డా॥ గధియాని, ఆయన భార్యని ఆస్పత్రిలో చేర్చారు. ఆ తర్వాత వాళ్ళిద్దరూ కన్పించలేదు.

డా॥ గధియా ప్రమాద స్థితి నుంచి బయటపడిన తర్వాత తనను రక్షించిన ఆ ఇద్దరు నీగ్రోలకు చాలా పెద్ద మొత్తంలో ధనం ఇస్తానని ప్రకటించాడు. కానీ అది తీసుకోవటానికి ఎవరూ రాలేదు.

చాలా కాలం ఆస్పత్రిలో ఉండాల్సి వచ్చింది. డా॥ గధియా ఒక కాలు పూర్తిగా విరిగి, అది తిరిగి అతకటానికి చాలా కాలం పట్టింది.

1978లో కర్ర సాయంతో నడవటం మొదలు పెట్టిన తర్వాత భారతదేశం వచ్చి స్వామి దర్శనం చేసుకున్నాడు. ఏప్రిల్ 20 న ఇంటర్వ్యూ ఇచ్చి, డా॥ గధియా పట్టుకున్న కర్ర తీసివేసి నడవమన్నారు స్వామి. నాలుగు సంవత్సరాల తర్వాత ఏ సాయం లేకుండా మొదటిసారి సరిగా నడిచాడు గధియా. అపుడు భగవాన్ "నీ వెన్నెముక పూర్తిగా విరిగిపోయి నీ ప్రాణం పోయింది. నీకు మళ్ళీ ప్రాణం ఇచ్చి నేను ఇద్దరు నీగ్రోల రూపంలో వచ్చి నిన్ను బయటికి లాగాను జ్ఞాపకముందా?" అని అడిగారు. తనను కాపాడింది స్వామేనని తెలుసుకుని ఎంతో ఆనందపడ్డాడు గధియా. "నీవు ఇంకా చాలా పని చేయాల్సి ఉన్నది. అందువల్ల నిన్ను రక్షించాను." అని చెప్పి స్వామి గధియాను ఆశీర్వదించారు. ❖

## శ్రీ సత్యసాయిరామ! శాంతిధామ!

ముదితు నిన్నుబాడ మూగనైపోయితి
పాదస్పర్శనమున పరవశింప
కనుల నీళ్ళతోడ కాళ్ళునుంగడగితి
సత్యసాయిరామ! శాంతిధామ!

పాదస్పర్శ నిడితె భక్తా నిడితె భక్తావనుఁడవౌట!
కదలకుంటివేమి? కమలనయన!
మాతృప్రేమ పూరమాదయావీక్షణ!
సత్యసాయిరామ! శాంతిధామ!

నన్నుగన్నతండ్రి! నాపాలిదైవంబ!
విన్నినాళ్ళకిపుడు నేగుఁదెంచి
నన్నుబ్రోవవచ్చెనన్న భావము కద్దు!
సత్యసాయిరామ! శాంతిధామ!

- కె. పాండురంగశర్మ

నవరాత్రుల సందేశం - 2

# కోఽహం నుంచి సోఽహం

## భగవాన్ సాయి జ్ఞానబోధ

"సకల విద్యలు నేర్చి సభజయించగవచ్చు
శూరులై రణమున పోరవచ్చు
రాజరాజై పుట్టి రాజ్యమేలగవచ్చు
హేమ గోదానముల్ ఈయవచ్చు
గగనమందున చుక్కలు లెక్కగొనవచ్చు
జీవరాసుల పేర్లు చెప్పవచ్చు
అష్టాంగ విద్యలనన్ని నేర్వగవచ్చు
చంద్రమండలమైన చేరవచ్చు
కాని దేహేంద్రియముల నరికట్టి
మనసు నిల్పియు నంతర్ముఖము చేసి
అనవరతము నిశ్చలే సమానచిత్తులై
నిలువలేరు మానవుల్ నియతితోడ"

ప్రేమస్వరూపులారా !

ఈ ప్రాకృతమైన ప్రపంచమునందు ప్రతి మానవుడు ఏ చిన్న కార్యక్రమం సాధించవలెననిన దీనికి ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి - ఈ మూడు శక్తులు అత్యవసరం.

ఇచ్ఛాశక్తి అనగా ఒక పనిచేయాలని సంకల్పించుట. అయితే ఆపని ఏవిధంగా చేయాలి? ఏ పరిస్థితులలో చేయాలి? ఎలాంటి మార్గమును అనుసరించాలి? అనేటటువంటి విచారణాశక్తి అత్యవసరం. ఈ ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి ఉండినంత మాత్రమున కార్యము సాఫల్యము అవుతుందా? దీనికి క్రియాశక్తి కూడా అత్యవసరం.

ఉదాహరణ-- ఇది ఒక వస్త్రము. ఈ వస్త్రమును నేను తయారుచేయాలనేది సంకల్పం. అయితే దీనికి దారము, ప్రత్తి మరియు మగ్గము కావాలి. ఈ అన్ని పరికరములను సమకూర్చటమే జ్ఞానశక్తి. నిత్యానిత్య పరిశీలనాశక్తి తనయందున్నది. చేయాలనే ఇచ్ఛాశక్తి తనయందున్నది. కాని చేయాలనే కార్యం ప్రారంభించి నప్పుడే - ఈ మూడింటియొక్క ఏకత్వం ఒక స్వరూపం ధరిస్తుంది.

ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి - కేవలం ఈ మూడు ఉండినంత మాత్రమున కార్యములు సరీగా నెరవేరవు. చిన్న ఉదాహరణ -- పూలు, సూది, దారము ఉన్న పుష్పమాలదానగునా? ప్రమిద, నూనె, వత్తి ఉన్న దీపము వెలుగుకలుగునా? దీనికి కూర్చేటటువంటివారు ఒకరు ఉండాలి. దీనిని చేర్చేటటువంటివాడు ఒకడుండాలి. ఒక వ్యక్తి లేకుండా ఈ మూడువున్నా ప్రయోజనం ఉండదు. ఒకడు చేసేటటువంటివాడు ఉండాలి. బంగారం ఉన్నప్పటికీ సొమ్ములు తయారవుతాయా? చేసేటటువంటి కంసాలి ఉండాలి గదా! దీనినే ఉపాదానకారణం అన్నారు. అనగా అన్నింటికి అధిపతి అయినటువంటివాడు ఒకడు ఉపాదానకారణం. క్రియాకారకుడు మరొకడు ఉండాలి. ఈ క్రియాకారకుడు భౌతికమైన జగత్తుకు ఒకవిధమైన ఆదర్శమును అందిస్తుంటాడు. ఒక కంసాలి, అనేక రకములైన బంగారు ఆభరణములను తయారు చేస్తుంటాడు. అసలు బంగారమును సృష్టించింది ఎవరు? ఈ బంగారమును సృష్టించినవాడే ఉపాదానకారకుడు. బంగారమును నగగా తయారుచేసినవాడు క్రియాకారకుడు. ప్రత్తిని ఎవరు సృష్టించారు? భగవంతుడు సృష్టించాడు. దానిని దారముగా చేసి వస్త్రముగా తయారు చేసేది చేనేతవాడు. కనుక నిమిత్తకారకుడైనటువంటివాడు జగత్తుకు ఆదర్శముగా ఉంటున్నాడు. అదేవిధంగా కంసాలి ఒక నిమిత్తకారకుడు. అసలు ఉపాదానకారణమైన సామాగ్రియే లేకుండిన, నిమిత్త కారకుడు ఏమియూ చేయలేడు. కనుక ఉపాదానకారకుడైన భగవంతుడే జగత్తు నంతా సృష్టించాడు. ఈ సృష్టించినటువంటి జగత్తును మానవుడు అనుభవించడానికి ప్రయత్నిస్తున్నాడు. మనం ఈనాడు ఉపాదానకారకుడ్ని మరచిపోతున్నాం. నిమిత్త కారకుడే ప్రధానమని విశ్వసించి, నేను చెప్పాను, నేను చేశాను, నేను చూశాను అనే అహంకారమునకు గురి అవుతున్నాడు. మూలాధారమైన పదార్థం ఒకటి ఉండినప్పుడే, ఈ నిమిత్తకారకుడు అనేక విధములుగా

సృష్టిని గావించగలడు. హైడ్రోజన్, ఆక్సిజన్ కలిపి విద్యార్థి నీరును తయారుచేసి నేనే నీరును సృష్టిస్తున్నానని విర్రవీగుతున్నాడు. అసలు ఈ హైడ్రోజన్, ఆక్సిజన్‌లను ఎవరు సృష్టించారు? ఈ మూలాధారమైన పదార్థములను ఆధారము చేసుకొనియే లౌకికమైన, భౌతికమైన, ప్రాకృతమైన వస్తువులను తాను తయారు చేసుకోగలుగుతున్నాడు.

కాని ఈ ఆధునిక యుగమునందు ఈ భౌతికమైన, లౌకికమైనటువంటి క్రియాస్వరూపాన్నే ఆధారంగా తీసుకుంటున్నాడుకాని, మూలాధారమైనటువంటి వస్తువులను తాను ఆధారంగా తీసుకోవటంలేదు. ఒక కుమ్మరి ఉంటున్నాడు. తాను కుండలు చేయాలని సంకల్పించుకున్నాడు. సంకల్పించుకున్నంత మాత్రమున కుండలు తయారుకావు. ఏవిధంగా చేయాలి? అని విధివిధానమును చింతించాడు. చింతించినంత మాత్రమున కుండలు తయారుకావు. ప్రవేశించి, అందులో పాల్గొని, క్రియా రూపమును ధరించాడు. కుండ తయారైంది. కుండ వేరు, కుమ్మరివాడు వేరు. కాని మట్టి, కుండ రెండు వేరుకాదు. ఈ కుండలోనే మట్టి ఉన్నది, మట్టిలోనే కుండ ఉన్నది. ఈ రెండింటిని విడదీయటానికి వీలుకాదు. వేరుగావున్న కుమ్మరి కేవలం నిమిత్తకారకుడేకాని, మూలాధారకారకుడు కాదు. ఈ మూలాధారకారకుడే ఉపాదానకారకుడు. అతనే దైవము. ఆ దైవముయొక్క సృష్టిచేతనే సర్వకార్యములలో విజయాన్ని సాధించగలుగుతున్నాడు.

84 లక్షల జీవరాసులున్నాయని మన శాస్త్రాలు బోధిస్తున్నాయి. ఇవి ఏవిధంగా సృష్టించబడినాయి?

**అండజము - ఇది 21 లక్షలు పిండజము - ఇది 21లక్షలు**

**శ్వేతజము - ఇది 21 లక్షలు ఉద్భిజ్జము - ఇది 21 లక్షలు**

ఇవి నాలుగూచేరి 84 లక్షల జీవరాసులు.

అండజమనగా ఏమిటి? గ్రుడ్డులోనుంచి జన్మించటం. దీంట్లో అనేక జీవరాసులుంటున్నాయి. కేవలం పక్షులు, క్రిమికీటకాలేకావు. పాము, తేలులాంటి విషజంతువులు సహితం గ్రుడ్డునుంచే ఆవిర్భవిస్తున్నాయి. పిండజమనగా గర్భము నుంచి ఉద్భవించినవి. శ్వేతజమనగా మన చెమటనుంచి పుట్టినవి. ఉద్భిజ్జము అనగా భూమినుంచి పుట్టినటువంటివి. ఈ నాల్గింటి యొక్క ఏకత్వమే 84లక్షల జీవరాసులు. అనంతమైన సముద్రములో అనేక అలలు ఉద్భవిస్తున్నాయి. ఒక తరంగం ఉండినట్లుగా మరొక తరంగం లేదు. కాని అన్నింటికీ సముద్రమే మూలాధారము. తరంగములు వివిధ రూపములు ధరిస్తున్నాయి. అదే విధముగనే అండజ, పిండజ, శ్వేతజ, ఉద్భిజ్జము అనేటటువంటి జాతులు 84 లక్షల జీవరాసులు కూడనూ ఒక్క సత్, చిత్, ఆనందమనేటటువంటి సముద్రమునుండే ఆవిర్భవిస్తున్నాయి. అన్నీ సచ్చిదానందము నుండే ఆవిర్భవిస్తున్నాయి.

ఈ సచ్చిదానందం అంటే ఏమిటి?

'సత్' అంటే ఎప్పటికి ఉండునటువంటిది, మార్పు చెందనటువంటిది, నిరంతరం ఉండేటటువంటిది. అదియే సత్. దీనినే 'Being' అన్నారు. 'చిత్' అనగా పరిపూర్ణమైనటువంటి జ్ఞానతత్త్వము. ఈ పరిపూర్ణ జ్ఞానమనేటటువంటిది ఎప్పటికీ మార్పు చెందేటటువంటిది కాదు. నిర్గుణం, నిరంజనం, సనాతనం, నికేతనం - ఇదియే నిజమైనటువంటి చిత్. దీనినే Awareness

## సాయినాథ

"ధన ధాన్య పశు పుత్ర దారా పౌత్రాదుల
మోహపాశంబులో మునిగినాను
కలకాలమెల్ల యీ కాయంబె ధృవమని
యాశించి మదినెంతొ యలరినాను
కామ్య కర్మంబులు కల్పించుకొని వృథా
గాలి సౌధంబులు గట్టినాను
సత్యధర్మ శౌచ స్వాధ్యాయమును లేక
మూఢుల వృత్తిలో మునిగినాను
పామరత్వము నొకయింత బాయనైతి
చెలగి యువకృతి ధర్మముల్ చేయనైతి
యెటుల బ్రోతువు నన్నింక నిట్టివాని
సత్పథము జూపి బ్రోవవే సాయినాథ."

- విద్యానందం

అన్నారు. ఈ 'చిత్' అనేటటువంటి దానికి 'సత్' అనేది ప్రతిబింబంగా ఉంటుంది. ఈ రెండింటి యొక్క ఏకత్వంచేతనే 'ఆనందం' అనేది ఆవిర్భవిస్తున్నది. దీనినే Bliss అన్నారు. 'సత్' అది ఒక Sugar వంటిది. 'చిత్' చైతన్యముతో కూడినటువంటి జలము. సత్, చిత్ - రెండూ ఏకంచేసినప్పుడే, ఇది ఒకవిధమైన ఆనంద స్వరూపమును ధరిస్తుంటుంది. ఇందులో చక్కెరగాని, నీరుగాని ప్రత్యేకముగా ఉండదు. ఈ రెండు చేరినప్పుడే 'సిరప్' అనే మూడవ రూపమును ధరిస్తుంది. సత్, చిత్ రెండూ చేరినప్పుడే 'ఆనందం' అనేది ఆవిర్భవిస్తుంది. కనుక సర్వజీవులయందు కూడనూ ప్రాణులయందు కూడనూ ఈ సత్‌చిత్ ఆనందం అనేటటువంటిది స్వస్వరూపకంగానే ఉంటున్నది. కాని స్వస్వరూపమును తాను దర్శించుకొనలేక, విచారించుకొనలేక, ఆనందించు కొనలేక స్వస్వరూపం ఎక్కడనో ఉన్నదని ప్రత్యేకంగా వెదకటానికి ప్రయత్నిస్తున్నాడు వెర్రిమానవుడు.

స్వదేశీయులు 'సాక్షాత్కారము' (సాక్షాత్ + ఆకారము) అంటున్నారు. విదేశీయులు 'లిబరేషన్' అంటున్నారు. పాపం! ఈ మాటలు అనేవారికే దాని అర్థం తెలియదు. ఒక అద్దము ముందునుంచొని చూశావు. నీ ఆకారాన్ని నీవు చూశావని ఆనందిస్తున్నావు. అది చాలా పొరపాటు. అద్దంలో చూచినది నీవుకాదు. భిన్నమైనదిగా ఉంటున్నది. అద్దములో కనిపించే ప్రతిబింబం నీకుడివైపు దానిలో ఎడమవైపుగా, నీ ఎడమవైపు దానిలో కుడివైపుగా కనిపిస్తున్నది. అది ఎట్లా సాక్షాత్ ఆకారము అవుతుంది? నీప్రతిబింబం మాత్రమేకాని 'సాక్షాత్' మాత్రంకాదు. 'సాక్షాత్' కానటువంటి దానిని 'సాక్షాత్'గా మనం భావిస్తున్నాం. నిన్ను నీవు చూచుకోవటమంటే నీ అంతర్ భావాన్ని వెతకాలి. **దేహాభిమానాన్ని త్యజించు! ఆత్మాభిమానాన్ని అభివృద్ధి పరచు!** ఈ ఆత్మాభిమానం చేతనే నీకు 'సాక్షాత్కారము' అనేది లభిస్తుంది. ఆత్మ తత్త్వాన్ని గుర్తించు. మానవునిగా జన్మిస్తున్నాడు, మానవునిగా పెరుగుతున్నాడు, మానవునిగా జీవిస్తున్నాడు, మానవునిగా మరణిస్తున్నాడు. కాదు.. కాదు.. మొట్టమొదట కోఽహం -- కోఽహం -- అని ఏడుస్తూ పుట్టాడు మానవుడు. అనగా నేనెవరు? నేనెవరు? అనిఅర్థం. చచ్చేంతవరకు కోఽహం -- కోఽహం-- అంటూపోతే ఏమి ప్రయోజనం? **పుట్టేటప్పుడు కోఽహం అంటూ పుట్టావు, చచ్చేటప్పుడు సోఽహం అంటూ చావాలి. సోఽహం అంటూ చచ్చినవాడికే నిజమైన ముక్తి లభిస్తుంది. కనుక కోఽహం నుంచి సోఽహంకు ప్రయాణించండి!**

భ్రాంతిలో మునిగిఉన్నంతవరకు బ్రహ్మ మనకు అర్థంకాడు. భ్రమలో ఉన్నంతవరకూ బ్రహ్మ మనకు చిక్కడు. భ్రమను దూరంచేసినప్పుడే బ్రహ్మ మనకు చిక్కుతాడు. అతని ఎక్కడో వెదకనవసరంలేదు. తన యందే సాక్షాత్కారమిస్తాడు.

## శ్రీ సత్యసాయి నామాక్షర సత్యమహిమ

భ - యను అక్షరమది భక్తి మార్గము చూపు,
గ - యను యక్షరమ్మది జ్ఞాన సంపదనొసంగు,
వా - యను యక్షర మా వాగ్దేవి కృపనొసగు,
న్ - 'న' కారమది నామస్మరణామృతం బిచ్చు,

శ్రీ - యను యక్షరము సిరులెన్నో సమకూర్చు,
స - యనునక్షరము సర్వులకు సద్బుద్ధినొసగు,
త్య - యను యక్షరంబు త్యాగశీలతను పెంచు,
సా - యనునక్షరమది సాధుత్వము నొసంగు,
యి - యను యక్షరమది ఇహ పర సౌఖ్యములిచ్చు,
బా - యను నక్షరమది సర్వ బాధలను తొలగించు,
బా - యనునక్షరమది బాపును పాపముల బాగుగాను.

శ్రీ సాయి నామామృతములోని ప్రతి యక్షరమది,
మహిమాన్వితము కాదె, మాన్యులారా!
నిత్యము స్మరించి తరింప మార్గమగును,
నిక్కమైన మాట యిది మోక్షంపు బాట,
శ్రీ సత్యసాయి నామాక్షర సత్య మహిమ!

**- భానుమతి - నరసింహారావు**

"ఏకంసత్ విప్రా బహుధావదంతి" వేదం అన్నది. అనేకమంది అనేకపేర్లు పెట్టుకుంటూ వచ్చారు. ఈ టంబ్లర్‌లో ఏమి ఉన్నది? నీరు. ఇది తెలుగుమాట. ఇంగ్లీషువారు దీనినే Water అంటారు. హిందీవారు 'పానీ' అంటారు. తమిళులు 'తన్నీ' అంటారు. భాషలు వేరువేరు నీరును మాత్రం ఎవరూ మార్చలేదుగదా! అదే రీతిగనే దైవత్వం ఒక్కటే. అనేక పేర్లతో పూజిస్తున్నాం, ఆరాధిస్తున్నాం. ఉన్నది ఒక్కటే అదే 'అహం...అహం...' దీనినే 'నేను...నేను' అంటున్నావు. 'నేను' అనేది భగవంతునికి మొట్టమొదట పేరు. 'I ' is the first Name of God. కూటి పేద నుంచి కోటీశ్వరుని వరకూ అడుగుతే నేను ఫలానావాడను అని చెబుతారు. 'నేను' లేకుండా ఫలానావాడను అని చెప్పటానికి వీలుకాదు. కనుక ఆ 'I' అనేదే నిజమైనటువంటి తత్త్వము. ఈ 'I' లో రెండు విధములైన 'ఐలు' వుంటున్నాయి. ఏకాక్షరం 'I' ఒకటి. మూడు అక్షరముల 'Eye' మరొకటి. ఏకాక్షరం 'I' ఆత్మ. మూడు అక్షరముల Eye దేహము. దేహము అనేది త్రిగుణములతో కూడినటువంటిది. 'ఆత్మ' ఎట్టి గుణము లేకుండా ఏకత్వంగా వుండేటటువంటిది. దీనికి ఎట్టి గుణమూలేదు. నిర్గుణం, నిరంజనం, సనాతనం, అంతే కాదు "బ్రహ్మానందం, పరమ సుఖదం, కేవలం జ్ఞాన మూర్తిం; ద్వంద్వాతీతం, గగన సదృశ్యం, తత్త్వమస్యాది లక్ష్యం; ఏకం, నిత్యం విమలం, అచలం, సర్వధీ సాక్షి భూతం, భావాతీతం, త్రిగుణ రహితం" ఈ 'I' కి అన్నీ అన్వయి స్తుంటాయి. ఇన్ని అన్వయిస్తున్నప్పటికినీ ఇది ఏకంగానే కనిపిస్తుంది.

ఈనాడు ఏకత్వం లోపించటం చేతనే భిన్నత్వం అభివృద్ధి చెందుతున్నది. ఈ ఏకత్వం అభివృద్ధి అయితే అందరూ ఆనంద స్వరూపులవుతారు. ఆ Unity ఉన్నప్పుడే Divinity మనకు ప్రాప్తిస్తుంది. కనుక మన ప్రేమను ఎలాంటి పరిస్థితులలోను మార్చుకోకూడదు. ఎవరు ఏమి చెప్పినా ఏమాత్రం భయపడనవసరంలేదు. ప్రేమ మనలో ఉన్నప్పుడు ఎందుకు భయపడాలి? ప్రేమ లేనివానికే భయ ముండాలి. తప్పుచేసిన వానికి ప్రేమ ఉండదు. కనుక ఎవరికీ భయపడనవసరంలేదు. Why Fear When I am Near and Dear. ఆ విధంగా మీరు దివ్యత్వాన్ని విశ్వసించాలి. వస్తున్నారు అనేక మంది భక్తులు... కాని ఎంతమందికి ఆ స్థిరమైన భక్తి ఉన్నదో చెప్పటానికి వీలులేదు. ఒక నిముషంలో Negative అయిపోతుంటారు. మరో నిముషంలో Positive అయిపోతుంటారు. ఈ Negative కు ఏమాత్రం అవకాశం యివ్వకూడదు. అంతా Positive .... Positive.... ఈనాటి ప్రాపంచిక కోరికలు (Worldly Desires) అన్నీ 'Negatives' ఈ 'Negatives' ను చేర్చుకోవటంచేతనే 'Positives' పాడైపోతున్నాయి. కనుక మీరు నిజమైనటువంటి విషయాలను, స్థిరమైన భావాలను, నిశ్చలమైనటువంటి భక్తిని స్థిరం చేసుకొని భగవంతుని స్మరిస్తూ రాండి!

*(ది. 26-9-1998న, నవరాత్రుల సందర్భమున భగవాన్ సాయి ప్రశాంతి నిలయంలో చేసిన దివ్య ప్రసంగం నుండి)*

✵

**మ్యూజిక్కు వినినంత మ్యాజిక్కుగా తలలు**
**పైకెత్తి భక్తాళి ప్రణతులిచ్చు**
**దిక్కూచి చూపులై దీన బాంధవు వైపు**
**విశ్లేషముగవట్టె విలచి యుండు**
**విశ్శబ్దమై యుండు విలయమంతయు కూడ**
**విశ్వనాథువి దీప్తి విస్తరించు**
**గోచరించరు యింక గోపీనాథుడు తప్ప**
**సమ్మోహనాస్త్రమ్ము సాగినట్లు**
**చక్కచక్కగ సాగును పాయి వడక**
**అక్కడక్కడ లేఖల అందుకొనుచు**
**విలయమంతయు తన ప్రేమ వలయమేమ**
**పొంగిపోవుమ హృదయాలు లొంగిపోవు.**

**- ఆదూరి శ్రీనివాసరావు.**

**పాతచందాలను రెన్యువల్ చేయండి!**
**క్రొత్త చందాదారులను చేర్పించండి!!**

సాయి దివ్యలీలలు

# సాయి! అంటే ఓయీ! అంటారు.

టి.ఎస్.ఎన్. మూర్తి

శ్రీ సత్యసాయి సేవాసమితి నరసన్నపేట వారి ఆధ్వర్యంలో నిర్వహించబడుతున్న వసంత నవరాత్రులలో భాగముగా ది. 01-4-98 బుధవారం సాయంత్రం గం॥ 7-00లకు ఏర్పాటు చేసిన నా ఆధ్యాత్మిక ప్రసంగాన్ని ముగించుకొని తిరుగు ప్రయాణములో బస్ కాంప్లెక్స్‌కు నేను, ఆ సమితి కార్యకర్త ఒకరు కలిసి చేరుకున్నాం. కాశీబుగ్గ పోవుటకు ఆఖరి బస్సు రడీగా యున్నది. నాతోబాటుగ వచ్చిన సాయి సోదరుడు నాకు మరొక్కసారి సాయిరామ్ చెప్పి వెనుతిరిగినాడు. నేను APZ 2032 బస్సు ఎక్కి కూర్చొని నా మామూలు అలవాటు ప్రకారం సాయి గాయత్రి పారాయణం ప్రారంభించాను. రాత్రి సుమారు గం॥ 9-00ల ప్రాంతములో భోజనాదికాలు ముగించుకొని బస్సు డ్రైవర్ సాయి సోదరులు శ్రీ హుస్సేన్ మరియు కండక్టర్ శ్రీ యమ్.ఎస్. రాజులు వచ్చి బస్సు బయలుదేరదీసిరి. నేను నిద్రలోకి జారుకున్నాను.

రాత్రి సుమారు గం॥ 10-30 ని॥లకు మా బస్సు మండల కేంద్రమైన నందిగాం విడిచిపెట్టి పలాస వైపు ప్రయాణం సాగిస్తోంది. మా గమ్యస్థానము మరొక 9-10 కి॥మీ దూరం ఉండనగా, తురకలకోట గ్రామ శివార్లలోనికి బస్సు చేరింది. ఆకాశం చిల్లులు పడిందా? అన్నట్లుగా ఒకటే కుండపోతగా వర్షం. రహదారిపై వాహనాలన్నీ మసక మసకగానే కన్పిస్తున్నాయి. వర్షపు నీరు కిటికీలగుండ లోనికి రావడంతో నాకు నిద్రాభంగం కలిగి అటుయిటూ చూస్తున్నాను. యింతలో ఒక పెద్ద కుదుపునకు లోనయిన మా బస్సు రోడ్డు వారగా ప్రక్కకు దొర్లి, రహదారి నుండి సుమారు 15-18 గజాల దూరం వరకు రోడ్డుప్రక్క పొలాల లోనికి దొర్లుకుంటూ, రాసుకుపోయింది. బస్సు దొర్లడం నాకు అనుభవంలోనికి వచ్చిన మరుక్షణం నేను "ఓం శ్రీసాయిరాం ఓం శ్రీసాయిరాం'' అని అరవడం ప్రారంభించాను. బస్సు బోల్తాపడిన సమయంలో మేము ముగ్గురం ఒక స్త్రీమూర్తితో సహా ప్రయాణికులం మరియు డ్రైవర్, కండక్టర్ మాత్రమే బస్సులో ఉన్నాం. బస్సు ఏవిధంగా పడిందోగాని, బస్సు పడిపోయింది అని డ్రైవరు అరిచే సమయానికి నేను మాత్రం చక్కగా బస్సు ప్రయాణాలలో మామూలుగా నిలబడి ఉన్నట్లుగానే అనుభూతితో నిలబడియున్నాను. జోళ్లు మాత్రం నా కాళ్ళకు లేవు. ఎంత ప్రయత్నించినా అటుయిటూ ఎక్కడా నా స్పర్శకు అందలేదు. పది పదిహేను నిముషాలు గడిచేసరికి బస్సులోనికి వర్షపునీరు చేరడం ప్రారంభమైంది. కిటికీల అద్దాలు బ్రద్దలవడంతో మేమంతా తడిసి ముద్దవుతున్నాం. డ్రైవరుగారు కొంచెం అధైర్యపడినప్పటికి కండక్టర్‌గారు మాత్రం తన ముఖ్యకాగితాలను భద్రపర్చుకొనిన మరుక్షణం ఎంతోధైర్యంగా మా కందరికి ధైర్యంచెప్పి, తానే ముందుగా డ్రైవర్ సీటువద్దకు వెళ్ళి ఆ తలుపుతీసి బయటకు దిగి మమ్మల్ని ఒక్కొక్కర్ని వరుసగా డ్రైవర్ డోర్ గుండా రమ్మనమని చెప్పి, అలా బస్సుపైకి చేరుకున్న మమ్మల్ని తన భుజాలపై కూర్చొనబెట్టుకొని ఆసరా కల్పించి, సుఖంగా రోడ్డుమీదకు చేర్చినారు. బస్సు పడిపడడంతో అద్దాలన్నీ బ్రద్దలయి గాజుముక్కలు బస్సుఅంతా చెల్లాచెదరుగా పడిపోయినను, వాటిపై మేము చెప్పుల్లేని కాళ్ళతో అటుయిటూ తిరుగాడినప్పటికి మా ఐదుగురిలో ఏ ఒక్కరికి చిన్న గాయమైనా కాలేదు. ఆ వర్షపు రాత్రి - ఆ దారిలో వస్తున్న లారీని ఆపించి మమ్మల్నందర్ని ఎక్కించడమేగాక మా తోటి ప్రయాణికురాలి 2 బియ్యం మూటలను కూడ మోసుకొని వచ్చి, లారీలో చేర్చి, మమ్మల్ని సేదదీరమని చెప్పిన సంఘటన తలచుకుంటే ఒళ్ళుపులకరిస్తోంది. లారీ ఎక్కిన వెంటనే తడిసిముద్దయి గజగజలాడుతున్న మాకు తమవద్దనున్న పొడి బట్టలనిచ్చి, మాకెంతో ఊరటకల్గించి మా గమ్యస్థానమైన కాశీబుగ్గ నీల్‌కమల్ జంక్షన్ వద్ద సురక్షితంగా దింపి వెళ్ళినారా లారీ డ్రైవర్, క్లీనరులు.

పడిపోయిన బస్సులోనుండి తన భుజాలపై ఆసరా ఇచ్చి, రోడ్డుపైకి చేర్చిన కండక్టర్ రూపంలోను, పొడిబట్టలిచ్చి ఊరట కల్గించిన లారీడ్రైవర్, క్లీనర్ రూపాలలోను, బస్సులో నుండి బస్సు పైభాగానికి సురక్షితంగా చేర్చిన డ్రైవర్ రూపంలోను ఆ వర్షపు రాత్రిలో వచ్చింది భగవాన్ శ్రీ సత్యసాయియే అని ప్రగాఢంగా విశ్వసిస్తూ సాయి అంటే ఓయీ అని పలికి మమ్మల్నందర్ని కంటికి రెప్పలా కాపాడిన శ్రీ సత్యసాయి దివ్య పాద పద్మములకు శతకోటి వందనములు సమర్పించు కుంటున్నాను.



# కర్మ ధర్మముల మర్మము

ఘండికోట వేంకట సుబ్బారావు

మరొక సంవత్సరం శివరాత్రి పండుగ సమయంలో బాబా మాకు ఇంటర్వ్యూ ఇచ్చారు. స్వామి యొక్క దివ్యతత్త్వమును మరింత సన్నిహితంగా అవగాహన చేసుకోవడానికి, ఆధ్యాత్మికంగా మేము మరింత ఉన్నతస్థాయికి చేరుకోవడానికి ఆ ఇంటర్వ్యూ మాకు తోడ్పడింది. ఎప్పటివలెనే ఆ ఇంటర్వ్యూ ప్రారంభములో కూడా ఆయన విభూతిని సృష్టించి అక్కడున్న వారందరికీ పంచారు. అది కాక, సంస్కృత లిపిలో "ఓం" గుర్తుగల ఒక ఉంగరమును సృష్టించి ఒక విదేశీ భక్తునికి ఇచ్చారు.

ఈ ఇంటర్వ్యూలో స్వామి, మనం అంతర్ముఖమైన సాధన సలిపి అనుక్షణం మార్పుచెందే అశాశ్వతమైన వస్తు ప్రపంచము యొక్క స్వభావమును, దానితోబాటే శాశ్వతమైన నిత్యసత్యమును గ్రహించాలని చెప్పారు. సత్తు, అసత్తుల మధ్య గల భేదమును గుర్తించడమే ఆధ్యాత్మిక విజ్ఞానమని కూడా స్వామి చెప్పారు.

ఇటువంటి విజ్ఞానమును మొట్టమొదటగా చెడు సహవాసములను విసర్జించి, సత్సాంగత్యమును పెంపొందించుకోవడం ద్వారా అలవాటు చేసుకోవాలి. అన్నిటికీ మించి ఇంద్రియనిగ్రహము చాలా అవసరం. ఇంద్రియములకు బానిసలు (పరవశులు) కాకండి, ఇంద్రియనిగ్రహమును అలవరచుకుని ఆత్మకు వశులు (ఆత్మవశులు) కండి, అని ఆయన సలహా ఇచ్చారు. ఈ సందర్భముగా ఆయన పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, వీటితోబాటు మనస్సు, బుద్ధి, అహంకారము, జ్ఞాపకశక్తి అంటే అంతఃకరణ, చతుష్టయములను నియంత్రణ చేసే ఏకాదశ రుద్రులను గురించి చెప్పారు. పశుపతియైన రుద్రుడు మానవుల యొక్క కర్మపాశములతో వారిని మాయ అనే రాటకు బంధించి ఉంచుతాడు. వారు ఆ రాటచుట్టు తిరుగుతూ, తిరుగుతూ చివరకు తమ మెడచుట్టూ ఉన్న తాడు బిగుసుకునిపోయి చనిపోతారు. తిరిగివారు పునరపి జననం, పునరపి మరణంగా జనన, మరణ చక్రభ్రమణంలో ఇరుక్కుని పోతారు. ఈ విధంగా మానవులు తమ పూర్వజన్మ కర్మ బంధముల చేత అజ్ఞానములో పడి, అంతులేని జన్మ, మృత్యు, జరా, వ్యాధి సంకటమునకు గురవుతారు.

తరువాత స్వామి ఆత్మజ్ఞానము లేక శివతత్త్వమును గ్రహించడానికి చివరకు సత్సాంగత్యము కొరకై పడే ఆర్తిని, దుస్సాంగత్యమునందు కల విముఖత, ద్వేషములను కూడా విడిచి పెట్టాలని చెప్పారు. ప్రాపంచికమైన ఆకర్షణలయందు విముఖత, సుఖ దుఃఖముల యందు సమచిత్తము, ఈ రెండింటినీ చాలా పట్టుదలగా అలవరచుకోవాలని ఆయన చెప్పారు.

పాజిటివ్, నెగటివ్ తీగలు రెండు కలసినప్పుడే కరెంటు ప్రవహిస్తుంది. చెడు ఉన్నప్పుడే మంచితనము యొక్క గొప్పతనం రాణిస్తుంది. ధర్మసూక్ష్మము అంత తేలికగా గ్రహించడానికి వీలులేనిది. అదే విధముగా సృష్టి రహస్యము కూడా, క్రియ ప్రతిక్రియలు, ధ్వని ప్రతిధ్వనులు, బింబ ప్రతిబింబములు ఒకే నాణెమునకు రెండు ముఖముల వంటివి. తరువాత స్వామి ఒక గొప్ప అహింసావాదిని గురించి చెప్పారు. ఒకప్పుడు ఆయన ఆశ్రమంలో తీవ్రమైన వ్యాధికి గురయిన ఒక ఆవు యొక్క బాధను చూచి తట్టుకోలేకపోయాడు. ఆయన ఆ ఆవుపై గొప్ప జాలిపడి మరణము ద్వారా దాని బాధకు శాశ్వతమైన విముక్తి లభించడానికి అంగీకరించాడు. స్వామి ఈ సందర్భంగా "ధర్మ సూక్ష్మమును సరిగా అవగాహన చేసుకోవడం అంటే ఇదేనా?" అని ప్రశ్నించారు. ఆ ఆవు పడుతున్న మరణవేదనను చూస్తూ చుట్టూ నిలబడినవారు దాని బాధను చూచికాక, ఆ బాధలో అది వ్యక్తము చేస్తున్న జుగుప్సాకరమైన మూలుగులు భరించలేకపోయారు. ఆ మూలుగులు వారిలో జుగుప్సాకరమైన ఏహ్యాభావమును పుట్టించాయి. దానిని తుపాకీతో కాల్చి చంపడంతో వారికి

శాంతి లభించింది. మరణవేదనతో తీవ్రంగా మూలుగుతున్న ఆ ఆవుపై జాలిపడి దానిని చంపడానికి అంగీకరించినందుకుగాను, జీవితమంతా ధర్మాచరణకు కట్టుబడిన ఈ మహానుభావుడు ధర్మశాస్త్రములోని, కర్మ విపాక సిద్ధాంతము ననుసరించి పాప పరిహారార్థం, తరువాత తాను కూడా అటువంటి తుపాకు దెబ్బకు గురిఅయి ప్రాణంపోవలసివచ్చినది.

తరువాత స్వామి కేవలం యోగులకు, దివ్య పురుషులకు మాత్రమే తెలిసిన, ఎవరికిని దాటశక్యముగాని కర్మసిద్ధాంతము యొక్క రహస్యమునకు సంబంధించిన మరొక ఉదాహరణ ఇచ్చారు. ఒక్కొక్క సందర్భములో ఎవరైనా ఒక అంధుడైన వ్యక్తి స్వామి అనుగ్రహము కొరకు ఎదురు చూస్తూండడం, ఆయన వాని అంధత్వమును నివారించకుండా ఉపేక్షించడం మనం చూస్తూంటాము. స్వామి కావాలని వారిని ఉపేక్షించడం కానేకాదు. అటువంటి సందర్భములలో అంధుడుపడే మానసిక వేదనను స్వామి తప్పక గుర్తిస్తారు. కాని, అతడు గత జన్మలో మరొక వ్యక్తిని అంధుణ్ణి చేశాడనే సత్యము స్వామి ఒక్కరికే తెలుసు. చుట్టూ ఉన్న వ్యక్తులు ఆ సత్యమును గ్రహించలేరు. అంధుడైన ఆ వ్యక్తి గత జన్మలో తాను చేసిన హేయమైన పాపకార్యమునకు ఫలితం ఈ జన్మలో కొంతవరకైనా అనుభవించాలి. అందువలన అతనిని చూచి జాలిపడే వ్యక్తులు, సర్వజీవుల భూత భవిష్యద్వర్తమానములు తెలిసిన స్వామి అతని అంధత్వమును నివారించకపోవడం చూచి అది సబబు కాదని ఆయనను నిందించడం సరికాదని గ్రహించాలి.

విపరీతముగా పెరిగిపోతున్న జనాభా కారణంగా ఏర్పడిన భూభారమును తగ్గించడానికి యుద్ధములు అనివార్యమని భావించే సిద్ధాంతమును గురించి కూడా స్వామి ప్రస్తావించారు. ఒక్కొక్క సందర్భములో యుద్ధములు ప్రస్తుత లేక గత జన్మలలో పాపకార్యములు ఆచరించిన వ్యక్తులను తొలగించడానికి దోహదం చేస్తాయి. వైకుంఠములో శ్రీమహావిష్ణువు యొక్క సందర్శనము కొరకై వచ్చిన మహర్షులను అవమానపరచినందుకు ద్వారపాలకులైన జయ విజయులు వరుసగా కొన్ని జన్మలెత్తవలసిరావడం గురించి మనకు తెలుసు. తమ పాపములకు పశ్చాత్తాపము చెందిన ఆ ద్వారపాలకులు తిరిగి వైకుంఠములో ప్రవేశించడానికి రెండు మార్గములు చూపించబడ్డాయి. ఒకటి, భగవంతుని తీవ్రముగా ద్వేషించి వేగముగా చేరుకునే మార్గము; రెండవది, భగవంతుని యందు ప్రేమ, భక్తులతో అనేక జన్మలు గడిపి చివరకు ఆయనను చేరుకునే నెమ్మదైన మార్గము. అయితే, వారిద్దరూ భగవంతుని తొందరగా చేరుకోవడానికి ఆయనను ద్వేషించే వైరభక్తి అనే మార్గమును ఎంచుకున్నారు.

కర్మసిద్ధాంతము ఏమార్గము ద్వారా ప్రకటితమవుతుందో, భక్తి తత్త్వము ఏవిధంగా రూపు దిద్దుకుంటుందో గమనించడానికి చాలా ఆశ్చర్యంగా ఉంటుంది. ఉదాహరణకు, విష్ణు ద్వేషియై తానే భగవంతునిగా ప్రకటించుకున్న హిరణ్యకశిపుడు పెట్టే అతి భయంకరమైన బాధలను తట్టుకుంటూ అతని కుమారుడైన ప్రహ్లాదుడు అచంచలమైన భక్తితత్పరతను పెంచుకున్నాడు.

## శ్రీ సత్యసాయి మహానీయము

ఎవ్వాని యవతార - మెల్ల దేశాలలో
అనుదినమ్మును పూజ -
లందుచుండు
ఎవ్వాని శుభనామ - మే ప్రొద్దు జపియింప
సంసార బాధలు - సమసిపోవు
ఎవ్వాని దర్శన - మే ప్రొద్దు పొందంగ
దూర దేశస్థులు - కోరి వత్తు
ఎవ్వాని శుభవాణి - నింపుగా వినగోరి
ప్రజలెల్ల పర్తికి - వచ్చుచుంద్రు
అట్టి దైవస్వరూపుడై - నట్టి సాయి
దివ్య తత్త్వమ్ము గ్రహియించ - భవ్యనవ్య
సత్యమగు ధర్మ పథమున - సాగిపోవ
తరలి రారండు జనులారా - ధన్యులార!

వై.వేం. రామబ్రహ్మశాస్త్రి

దీనిని బట్టి చూస్తే, భక్తుడు చూడడానికి అనేక బాధలు పడుతున్నట్లు కనిపిస్తాడు. అవన్నీ భగవంతుడు అతనిని ఉద్ధరించడానికి కల్పించిన పరీక్షలే. భగవంతునియందు అచంచలమైన విశ్వాసముతో, ధైర్యముతో భక్తుడు వాటిని ఎదుర్కొని విజయము సాధిస్తాడు.

శ్రీరామచంద్రుడు వనవాసములో తన భార్యయైన సీతకు దూరమై ఎంతో దుఃఖమును, బాధను అనుభవించడం గురించి మనం వాల్మీకి రామాయణంలో చదువుతాము. శ్రీరామచంద్రుడు సాక్షాత్తూ అవతార స్వరూపుడైనప్పటికీ, మానవరూపము ధరించి వచ్చుట చేత, మానవునివలెనే అనేక కష్టములకు, దుఃఖమునకు గురయ్యాడు. అయినప్పటికీ, అటువంటి కష్టసమయంలో కూడా సత్య ధర్మములను వీడని పవిత్రమైన జీవితము గడుపడం ద్వారా మానవులకు ఒక ఆదర్శమును చూపించాడు. శ్రీరామచంద్రుని గురించి మాట్లాడుతూ స్వామి, ఆయన ఆచరించిన ధర్మ సూక్ష్మమును గురించి తెలిపారు. రాముడు వానర రాజైన వాలిని చెట్టుచాటు నుండి చంపినమాట యదార్థమే. అయితే, అది ఎంతవరకు ధర్మబద్ధమైనది అనే ప్రశ్న ఉదయించినప్పుడు అందరి ధర్మ సూక్ష్మమును గ్రహించాలి. వాలి తన తమ్మునితో యుద్ధము చేసి అతనిని తరిమివేసి అతని భార్యయైన తారను అక్రమంగా స్వీకరించి ధర్మము నతిక్రమించాడు. అందువలన అతనిని శిక్షించవలసిన అవసరం ఉన్నది. అయితే, వాలి జంతుజాతికి చెందినవాడు కాబట్టి మానవులకు వర్తించే నియమాలు అతనికి వర్తించవు. అతనితో ప్రత్యక్ష యుద్ధము చేయడానికి వీలులేదు. ఆ విధంగా శ్రీరామచంద్రుడు వాలిని చెట్టుచాటునుండి బాణము వేసి చంపవలసి వచ్చింది. ఈ ధర్మసూక్ష్మమును గమనిస్తే, ధర్మస్వరూపుడైన శ్రీరామచంద్రుడు ధర్మమును ఎట్టి పరిస్థితులలోను అతిక్రమించలేదని ఋజువవుతుంది.

శ్రీవాణి గత సంచికలనుండి వెలువడుతున్న శ్రీ ఘుండికోట వేంకట సుబ్బారావుగారి యొక్క వ్యాసములను తెలుగులో స్వేచ్ఛానువాదముచేసి మనకందించినవారు శ్రీ గరిమెళ్ళ కృష్ణమూర్తిగారని పాఠకులు గమనించి ప్రార్థన.

# పదాల పందిరి - 16

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | ■ | 2 | ■ | 3 | 4 |
| | ■ | 5 | | 6 | ■ | |
| 7 | | | ■ | 8 | | |
| ■ | ■ | | ■ | | ■ | ■ |
| 9 | | | ■ | 10 | | 11 |
| | ■ | 12 | 13 | | ■ | |
| 14 | | ■ | | ■ | 15 | |

**అడ్డం**

1. 'ఆఫ్' (తెలుగులో)
3. వేడి
5. హైదరాబాద్ హిల్స్
7. ఆడ సింహం
8. 'లా'
9. అటు ప్రక్క నుంచి పరీక్ష
10. చంద్రునికిష్టమైన పువ్వు
12. ముక్కాలి పీట తిరగబడి చివర మాయమై వత్తు తడబడింది
14. టూరు
15. సర్పం

**నిలువు**

1. సంసారి కాదు
2. డప్పు
4. స్టేజ్
5. మామిడి పండులోని రకం
6. రాచరికము
9. ..... ధరిత్రీ
11. దేవుడు ప్రత్యక్షమై ప్రసాదించేది
13. దేహ

- కిరీటి

**పదాలపందిరి-15 : సమాధానాలు**

అడ్డం :- 1) ఇంపు 3) అంబ 5) ముక్కోపి 7) వనిత 8) నాదము 9) కంసశి 10) పానకం 12) పారాణి 14) రంధ్రం 15) గోడు

నిలువు :- 1) ఇంగువ 2) కొక్కొ 4) బలము 5) ముతపశుపా 6) పినాకపాణి 9) కందరం 11) కంసుడు 13) రావి

నవరాత్రుల సందేశం - 3

# ప్రేమను పెంచుకోండి! ద్వేషం పెట్టుకోకండి!!

భగవాన్ సాయి హిత

"సాధుజనులను చూచి చవుకనుచేతురు
వారికేమి కొరత వసుధ యందు
కుంజరమును చూచి కుక్కలెన్నో మొరుగు
దాని ఘనతకేమి తక్కువగును?"

ప్రేమస్వరూపులారా!

ఈనాటి కలిప్రభావంచేత ఇత్యాది దృశ్యములు ఎన్నియో చూస్తున్నాం. కోకిల గానమును విని కాకులు ఎంతగానో అరుస్తాయి. అంత మాత్రమున కాకుల కూతలకు కోకిల తన గానమును మానుకుంటుందా? హంసలను చూచి కొంగలు పరిహసిస్తుంటాయి. కాని కొంగలు ఎంత పరిహసించినప్పటికీ హంసల యొక్క ఘనత ఏమాత్రం తగ్గిపోదు. మానవత్వం యొక్క దివ్యత్వాన్ని గుర్తించుకొనిన వ్యక్తి తన యొక్క సత్యమును తాను గుర్తించుకొనినప్పుడు, ఇత్యాదిమానాభిమానములకుగాని, కీర్తి ప్రతిష్ఠలకుగాని ఏమాత్రం లొంగడు, క్రుంగడు, పొంగడు.

మానవ జన్మ భగవంతుని యొక్క వర ప్రసాదము. ఈ వరప్రసాదమును సరియైన మార్గములో అనుభవించినప్పుడే, ఈ అందుకొన్న వ్యక్తి సార్థకనాముడు అవుతాడు. భగవంతుడు అందించిన ఈదేహము పవిత్రమైన పాత్ర. ఈ పాత్రను సక్రమమైన మార్గంలో సరియైన స్థితిలో వినియోగించుకొనినప్పుడు ఈ పాత్ర యొక్క ప్రభావం మానవత్వం యొక్క అస్తిత్వాన్ని గుర్తిస్తుంది. ఇందులో మూడు విధములైన మార్గములు గోచరిస్తున్నాయి. అధముడు, మధ్యముడు, ఉత్తముడు - మూడు స్థాయిలు ఉన్నాయి. ఈ అందుకున్న మానవ దేహమనే పాత్రను సద్వినియోగపరచి, సరైన మార్గంలో దీనిని అనుభవించిన వానిని 'ఉత్తముడు' అని అంటారు. కాని ఈ దేహమనే పాత్రను గుర్తించుకొనలేక, దుర్వినియోగవరచి, దుర్మార్గంలో ప్రవేశించి, అపవిత్రంగావించే వానిని 'అధముడు' అని అంటారు. ఈ అధమునకు, ఉత్తమునకు మధ్యనున్నవారు కొన్ని రకములైన మార్గములు అనుసరిస్తుంటారు. భగవంతుడు దగ్గర నుంచి నిర్మలమైన, నిస్వార్థమైన, పవిత్రమైన, పరిశుద్ధమైన ఈ దేహమును అందుకొని, కూడా దీనిని సరియైన మార్గంలో అనుభవించక, కొన్ని సమయములలో పెడ మార్గమును పట్టించి, మరికొన్ని సమయములలో సన్మార్గంలో నడిపించి, దీనిని పవిత్రత, అపవిత్రత రెండింటియందు కూడనూ వినియోగించుకొనే వానిని 'మధ్యముడు' అని అంటారు.

భగవంతుడు హృదయ మనోబుద్ధులను మనశ్శాంతి నిమిత్తమే అందించాడు. అయితే మానవునికి నేడు సుఖశాంతులు లేకుండా పోతున్నాయి. సుఖశాంతులు లేనప్పుడు ఇవన్నీ వుండి ప్రయోజనం ఏమిటి? "జంతూనాం నర జన్మ దుర్లభం". మానవ జన్మ చాలా దుర్లభమైనదని వర్ణిస్తున్నారు. దీనికనుగుణంగా మనం నడుచుకుంటున్నామా? భగవంతుడు అనుగ్రహించిన వాటిని సరియైన మార్గంలో ఉపయోగించుకుంటున్నామా? మనసును సరియైన మార్గంలో ప్రవేశపెట్టటం లేదు. బుద్ధిని సరియైన స్థితిలో పెట్టి విచారించటంలేదు. హృదయాన్ని నిర్మలంగా ఉంచుకోవటంలేదు. కనుక మానవునకు శాంతి అత్యంత దూరమైపోతున్నది. సుఖమనేది కూడా చాలా దూరమైపోయింది. సుఖశాంతులు లేని జీవితం ఇది ఒక జీవితమా? కొంతమంది గొప్పవారు వైరాగ్యమును సాధించాలని ప్రయత్నిస్తుంటారు.

వైరాగ్యము అంటే ఏమిటి? వైరాగ్యం అంటే "ఆస్తి ఆలి వీడి అడవి కేగుట కాదు." ఈ స్థూల ప్రపంచం- ఇది జడమైనదని విశ్వసించాలి. సూక్ష్మ ప్రపంచం- ఇది మాయాస్వరూపంగా మనం విశ్వసించాలి. కారణ స్వరూపము - ఇది ప్రతిబింబముగా మనం తీసుకోవాలి. ఆ విధంగా ఈ మూడింటి అర్థమును చక్కగా గుర్తించినప్పుడే మనకు వైరాగ్యమనేటువంటిది సహజంగా

లభిస్తుంది. కాని మానవుడు ఈనాడు ఈ మూడింటికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడు. స్థూల ప్రపంచమునే సత్యముగా విశ్వసిస్తున్నాడు. సూక్ష్మమైన ప్రపంచమే దీనికి సరియైనటువంటి ముక్తిగా భావిస్తున్నాడు. కారణ స్వరూపమైనటువంటి మానవతత్త్వమునే వైకుంఠంగా విశ్వసిస్తున్నాడు. స్థూల సూక్ష్మ కారణ స్వరూపములు మానవునికి ఏమాత్రం సంబంధం లేదు. మహా కారణ స్వరూపుడైనటువంటివాడే భగవంతుడు. కనుక ఈ స్థూలమునంతా మనం జడ స్వరూపంగా విశ్వసించాలి. ఈ జడంలో ఏమాత్రం చైతన్యం లభ్యంకాదు. సూక్ష్మ జీవితమనేటటువంటిది 'మాయ'. మాయ అనగా లేనటు వంటిదానినే 'మాయ'అంటారు. ఇక కారణ స్వరూపము ప్రతి బింబమే. ఇది బింబముకాదు. బింబము కానప్పుడు దీనిని ఎందుకు బింబంగా విశ్వసించాలి? ఈ మూడింటిని చక్కగా అర్థం చేసుకొన్నప్పుడే మనకు నిజమైన వైరాగ్యము ప్రాప్తిస్తుంది.

ఈ స్థూల సూక్ష్మ కారణ స్వరూపమైనటువంటి మాయా స్వరూపమైనటువంటి ఈ జగత్తు, మనసులు ఒక విధంగా భ్రమింపజేసేటటువంటివే. మహాకారణ మైనటువంటి ఆత్మతత్త్వములో మనం ప్రవేశించాలి. అప్పుడే మనకు ఆనందం శాంతి లభ్యమవుతాయి. మానవత్వాన్ని ఈనాడు చక్కగా అర్థం చేసుకోవటానికి ప్రయత్నించాలి. అయితే ఈనాడు 'మానవత్వం' అంటే ఏమిటో అర్థం చేసుకోలేని స్థితిలో ఉన్నారు.

వీడు 'నరుడు'. 'నర' అనగా ఆత్మ. నరుడు అనగా ఆత్మస్వరూపుడే. ఈ ఆత్మకు మూలస్థానం ఆకాశము. ఈ ఆకాశము యొక్క ప్రతిబింబములే పంచ భూతములు. ఒకానొక సమయంలో గోపికలు "క్లీం, కృష్ణాయ, గోవిందాయ, గోపీ జనవల్లభాయ, స్వాహా" అన్నారు. క్లీం అనేది భూమి, కృష్ణాయ అనేది జలము, గోవిందాయ అనేది అగ్ని, గోపీ జనవల్లభాయ అనేదే ఆకాశము, స్వాహా అనేదే వాయువు. ఈ పంచ భూతముల స్వరూపమే మానవత్వం. పంచభూతములు లేని కణము గాని, పంచభూతములు లేని జీవితంగాని జగత్తులో కానరాదు. ఈ పంచభూతములు సర్వత్రా వ్యాపించి ఉన్నాయి. కనుక ఈ పంచభూతములను సద్వినియోగం చేసుకోవాలి. వీటిలో దేనిని దుర్వినియోగం చేసినా సర్వవ్యాపకుడైన భగవంతుని దుర్వినియోగం చేసినట్లే అవుతుంది. అయితే మానవుడు పంచభూతములతో కూడిన ఈపాంచ భౌతిక దేహమును మాత్రమే విశ్వసించి, దీని సుఖము కోసం, దీని ఆనందం కోసం జీవితాన్నే అర్పితం చేస్తున్నాడు.

"పాంచ భౌతికము దుర్బలమైన కాయంబు
ఎప్పుడు విడిచేది ఎఱుకలేదు
శతవర్షముల దాక మితము చెప్పిరి కాని
నమ్మరాదామాట నెమ్మనమున
బాల్యమందో లేక ప్రాయమందో కాక
ముదిమియందో లేక ముసలియందో
ఊరునో అడవినో ఉదక మధ్యంబునో
ఎక్కడ విడిచేది ఎఱుక లేదు."

ఈ నీటి బుడగలాంటి ఈ శరీరమును గురించి ఇంత శ్రమ ఎందుకు పడాలి? బ్రతికి ఉన్నందుకు ఒక సార్థకమైన కర్మను ఆచరించాలి. ఆదర్శవంతమైన జీవితాన్ని అనుభవించాలి. శాంతి సుఖాన్ని మనం ప్రపంచానికి అందించాలి.

సర్వమునకూ ఈ దేహమే మూలకారణం. కనుక ఈ దేహమును ఒక పనిముట్టుగా తీసుకొని తద్వారా మనం శాంతి, సంతోషాలను అనుభవించాలి. దేహము ఒక పనిముట్టు మాత్రమేకాని, ప్రాణసమానమైన దేమీకాదు. అనిత్యము, అశాశ్వతమైనటువంటి దేహమును మనం సత్యనిత్యంగా విశ్వసిస్తున్నాం. దీని ఆనంద నిమిత్తమై అనేకపాట్లు పడుతున్నాం. దీని సుఖసంతోషాల నిమిత్తమై అనేక కర్మలనాచరిస్తున్నాం. కాని ఇవన్నీ వ్యర్థమైన పనులే. అరిషడ్వర్గములతో కూడినటువంటిది ఈ దేహం. దయ, ప్రేమ, కరుణ, సహనం, సానుభూతి, సత్యం - ఇలాంటి గుణములతో కూడినటువంటిది హృదయం. కనుక హృదయం నుంచి వచ్చేవన్నీ పవిత్రంగా భావించాలి. కనుక ఈ హృదయాన్ని, దేహంతో ఏమాత్రం సంబంధం పెట్టకూడదు. అయితే దీనిని అర్థం చేసుకోలేక అనేక అనర్థములతో మానవుడు జీవితమును వ్యర్థం గావించుకుంటున్నాడు.

మానవ జీవితం పవిత్రమైనది, ధన్యమైనది, పుణ్యమైనది, విలువైనది. అయితే దీని విలువను ఏమాత్రం తెలుసుకోవటంలేదు. దీని విలువను గుర్తించటానికి ప్రయత్నించాలి. మనసు, బుద్ధి, చిత్తము, ఇంద్రియములు - ఇవన్నీ దేహము యొక్క ఉపాధులు. ఈ ఉపాధుల తత్త్వమును మాత్రమే మనం గుర్తుంచుకుంటున్నాం గాని, ఆత్మ తత్త్వమును ఏమాత్రం గుర్తుంచుకోవటానికి ప్రయత్నించటంలేదు. కనుక మూలాధారమైన ఆత్మ తత్త్వమును గుర్తించటానికి మనం ప్రయత్నించాలి. ఈ ఆత్మతత్త్వమును గుర్తించినప్పుడు మానవత్వం సార్ధకమవుతుంది.

మానవత్వమును సార్ధకం చేసుకోవాలనే తలంపుతో అనేక సాధనలు సలుపుతున్నాం. ఈ సాధనలు చేసి ఏమీ ప్రయోజనంలేదు. హృదయమును పవిత్రమైన భావములతో నింపి, ఏపని చేసినా అన్నీ పవిత్రమైపోతాయి. హృదయమును అపవిత్రంగావించుకొని ఎన్ని సాధనలు చేసినా ప్రయోజనం ఉండదు. అన్నీ నిరర్ధకమైన పనులుగా నిలిచిపోతాయి. కనుక మొట్ట మొదట నీ హృదయమును పవిత్రం గావించుకో!

ఆధ్యాత్మికమార్గంలో మానవునికి కామ, క్రోధ, లోభములు పరమశత్రువులు. రావణుడు ఎంతో గొప్పవాడు, ధనకనకవస్తువాహనాదులు విషయంలో ఏమాత్రం తక్కువలేదు. 64 విద్యలు అభ్యసించినవాడు, అనేక విధములైన తపస్సులుచేసి దైవానుగ్రహమును కూడా పొందినవాడు. ఇంతగొప్ప వ్యక్తి ఒక్క కామమునకు లోను కావటంచేతనే తానుపోయాడు, సర్వమునూ కోల్పోయాడు. ఇక భాగవతంలోపల, పంచభూతములను అదుపులో పెట్టుకొనిన హిరణ్యాకశిపుడు క్రోధంవలన సర్వనాశనం అయినాడు. "కోపము కలిగినవానికి ఏపనియు ఫలింప కుండు..కోపమువలన సర్వము చెడును..". ఇక భారతము నందు దుర్యోధనుడు పరమలోభి. లోభంతో ధర్మ మూర్తులైన పాండవులను సూదిమొన మోపే స్థలము కూడా యివ్వ నిరాకరించి తనతోపాటు తన యావత్ కుటుంబాన్ని సర్వనాశనం గావించుకొనినాడు దుర్యోధనుడు. - కనుక ఈ మూడింటిని మనం అదుపులో పెట్టుకోవాలి.

ఈనాడు మానవుడు సుఖమును కోరుతున్నాడు. అసలు సుఖమంటే ఏమిటి? వాంఛలు లేకపోవటమే సుఖము. వాంఛలు ఉండటమే దుఃఖము. ఉదాహరణకు ధన కనక వస్తు వాహనాదులు కలిగిన ఒక శ్రీమంతుని వద్దకు వెళ్లి అడిగితే, అతను ఒక విషయం చెబుతాడు. "నాకు అన్నీ అనుకూలంగానే ఉన్నాయి. అన్ని వసతులూ ఉన్నాయి. నాకు ఏ ఇబ్బందీ లేదు. కాని నావద్ద శాంతి, సుఖమూ మాత్రం లేదు." అని చెబుతాడు. అంతేకాదు "ఈ సంపదలన్నీ నాకు సౌకర్యాలను యిస్తున్నాయిగాని సుఖమును మాత్రం యివ్వటంలేదు. ధనం నాకు కీర్తిని సంపాదించి పెడుతున్నదిగాని, గౌరవాన్ని సంపాదించి పెట్టటం లేదు. నావద్దనున్న నౌకర్లు ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తిస్తున్నారుగాని, స్నేహభావాన్ని ప్రదర్శించడం లేదు.' ' అని చెబుతాడు. స్నేహితులనే వాళ్లు లేకుండా ఎంతమంది నౌకర్లు వుండి ఏమిప్రయోజనం? అసలు నీ స్నేహితుడు ఎవరు? సర్వకాల సర్వావస్థలయందునూ నీ వెంట జంట, ఇంట వుండి నిన్ను కాపాడేటటువంటి వాడే నిజమైన స్నేహితుడు. అటువంటివాడు ఒక్క భగవంతుడు

## శాంతి ధర్మప్రదాయి! శ్రీ సత్యసాయి

"భక్తి ముఖ్యముగాని శక్తి ముఖ్యముగాదు
నిను జేరవలెనన్న నీరజాక్ష!
గుణము ముఖ్యముగాని కులము ముఖ్యముగాదు
నీ దరి జేరంగ నిర్మలాంగ!
నీతి ముఖ్యముగాని జాతి ముఖ్యముగాదు
నీ సన్నిధిని జేర నిష్కలంక!
చిత్త శుద్ధియె కాని విత్తంబు కాదయ్య
నీ ప్రాపు నొందంగ నిర్వికార!
సకల జీవుల సృష్టించి సాకుచుండి
లయ మొనర్చెడి తత్త్వమరయ వశంబె!
సత్య ధర్మ శాంతి ప్రేమ సాక్షీవీవ!
శాంతి ధర్మ ప్రదాయి! శ్రీ సత్యసాయి!

- కొలచన వెంకట రమణమూర్తి

మాత్రమే. ఈనాడు అందరూ స్నేహితులే. చెరువులో నీరు చేరినప్పుడు ఎక్కడలేని కప్పలు వచ్చి చేరుతాయి. నీరు ఎండిపోగానే ఒక్క కప్పకూడా అక్కడ కనిపించదు. అదే రీతిగా నీకు అధికారం ఉండినంతవరకు, నీవు శ్రీమంతుడిగా వుండినంతవరకూ అందరూ నీస్నేహితులే. నీ చుట్టూ తిరుగుతునే ఉంటారు. పదవిపోయినా, సంపద తరిగినా ఒక్కడు కూడా నీకు కనిపించదు.

ఈ ప్రపంచంలో ఏదీ శాశ్వతం కాదు. మన హృదయంలో వున్న ప్రేమతత్త్వమొక్కటే శాశ్వతం. ఈ ప్రేమచేతనే సర్వులూ బంధువులైపోతారు. ఒక్క ప్రేమ వుంటే చాలు. ప్రపంచమంతా మన దగ్గరకు వస్తుంది. ఈనాడు ఇన్ని దేశాలవారు ఇక్కడకు రావటానికి కారణం ఏమిటి? నీ ఇంటిలో లేనిది, నీ దేశంలో లేనిది ఏదో ఒక్కటి ఇక్కడ ఉండి ఉండాలి. దానికోసమే మీరందరూ యిక్కడకు వచ్చారు. అదియే సర్వసమానమైన ప్రేమ. ఆ ప్రేమ నిమిత్తమే మీరు యిక్కడకు వచ్చారు. కనుక ప్రేమచేతనే సన్నిహిత సంబంధబాంధవ్యాలను ఏర్పర్చు కోవచ్చును. **ప్రేమరహితమైన హృదయం మరుభూమితో** సమానం. ఈ హృదయమనే **భూమిలో ప్రేమతత్త్వమును** పెంచండి. ఒక్క దైవమునందు మాత్రమే నిస్వార్థమైన ప్రేమలభ్యమవుతుంది. అట్టి ప్రేమను మీరుకూడా పెంచుకోండి. ప్రేమతో పలుకరించండి. మధురమైన మాటలను నేర్చుకోండి. పవిత్రమైన ప్రవర్తనలో నడుచుకోండి. అప్పుడే మీకు గౌరవంకూడా లభిస్తుంది. మనమాటలు, మననడతలు, మనప్రవర్తన వలననే మనకు గౌరవం లభిస్తుందనే సత్యాన్ని విస్మరించకండి.

మానవత్వంలో ఉన్న దివ్యశక్తి అంత ఇంత అని చెప్పటానికి వీలుకాదు. ప్రపంచంలో ఉన్న శక్తులన్నీ ఒక్క మానవత్వంలోనే యిమిడి ఉన్నాయి. 'మానవత్వము' అనగా విలువైనటువంటిది, అని ఉపనిషత్తులలో పేర్కొనబడినది. దీనికంటె విలువ మరొకటిలేదు. డైమండ్ విలువైనదంటున్నారు. ఎవరంటున్నారు? మానవుడు. బంగారమునకు విలువయిస్తున్నారు. ఎవరు యిస్తున్నారు? మానవుడే. బంగారం విలువ గొప్పది? డైమండ్ విలువ గొప్పది అని బాహ్యవస్తువులను చూచి వర్ణిస్తున్నాం. కాదు.. కాదు... Men are more Valuable than all the wealth of the World. మనిషికన్నా మించిన గొప్ప డైమండ్ మరొకటిలేదు. అలాంటి మానవత్వాన్ని మనం ఈనాడు దుర్వినియోగం చేసుకుంటున్నాం. ఆనాటి పవిత్రమైన ఋషులు ఈ మానవత్వాన్ని ఎంతగానో సార్థకం చేసుకున్నారు.

మన ప్రాచీన భారతదేశము అనేకమంది మహర్షులచేతను, మహాత్ములచేతనూ, యోగులచేతనూ అభివృద్ధి చెందినటువంటిది. అనేక విదేశీ దురాక్రమణలకు గురియైనప్పటికినీ ఈ దేశమును ఎవరూ కదిలించ లేకపోయారు. కారణమేమిటి? **ఆధ్యాత్మికశక్తి** అనేది ఇక్కడ గాఢంగా ఉండటంచేతనే దీనిని ఎవరూ ముట్టలేక పోయారు. వందల సంవత్సరాల విదేశీపాలన చేసిన ప్పటికినీ, భారతదేశ పవిత్రతను ఎవరూ చెడగొట్టలేక పోయారు. ఆనాటి మహర్షులు వేసిన పునాది చాలాగట్టిది. వారువేసిన పునాదిని మనం కాపాడలేక దినదినానికి దిగజార్చివేస్తున్నాం. మొట్టమొదట మనం కాపాడవలసింది మానవత్వపు విలువలను. మానవతా విలువలను పెంచు **కోవాలి.** సత్యం, ధర్మం, ప్రేమ, శాంతి, **అహింస - ఇవే**

మానవతావిలువలు. ఈ ఐదువిలువలను మనం కాపాడుతేచాలు. అవే మనల్ని కాపాడుతాయి. "ధర్మో రక్షతి రక్షితః". మనం ధర్మాన్ని రక్షిస్తేచాలు. ధర్మమే మనల్ని రక్షిస్తుంది. "ధర్మయేవహతోహంతి" ధర్మాన్ని నీవు శిక్షిస్తే, అది నిన్ను శిక్షిస్తుంది. కనుక ధర్మమే మనల్ని కాపాడేటటువంటిది. మన ప్రేమనే మనకు రక్షగా ఉండేటటువంటిది. మన శాంతియే మనకు కిరీటంగా ఉండేటువంటిది. మన అహింసయే మనకు హృదయంగా ఉండేటటువంటిది. మన హృదయము నుంచి మృదు మధురమైన పలుకులురావాలి. పరులను పరమానంద పరచేటటువంటి పలుకులు రావాలి. ఇట్టి దయార్ద్ర హృదయుడు ఈనాడు పాషాణహృదయుడుగా రూపొంధు తున్నాడు. మృగం కంటే హీనమైపోతున్నాడు. దయా దాక్షిణ్యములు లేకుండా పోతున్నాడు.

ప్రేమస్వరూపులారా!

ప్రేమను పెంచుకోండి! ద్వేషం పెట్టుకోకండి! ఈ ద్వేషమనేది చాలా ప్రమాదమైనది. ద్వేషంతో ఏ పలుకుపలికినా, అది హృదయంలో నాటుకొని పోతుంది. ఆ నాటుకొని పోయినటువంటి దానిని తీయాలంటే ఎన్నియో అక్షరసత్యములు కావాలి. ఎవరు నిన్ను దుర్మార్గ మైన మాటలు ఆడినారో, వారిని నీవు ప్రేమించు. నీవు అతనిని ప్రేమిస్తే, అతని మనసే మారిపోతుంది. మనం ప్రేమించినకొలది, అతని బాధలు తగ్గిపోతుంటాయి. ఈ గాయములు మాన్పేటటువంటి మందులు ప్రపంచంలో ఎక్కడా లేవు. సూటిపోటి మాటలచేత వేసిన బాణముల వలన కలిగిన బాధలను, ప్రేమ మాటలచేత తగ్గించాలి. అదియే సరియైన మందు. అంత త్వరగా ఉపశమనం యిచ్చేమందు వేరొకటిలేదు. అది ఒక్క ప్రేమచేతనే సాధ్యమవుతుంది.

ఈనాడు ప్రతివానికి టెన్షన్.. టెన్షన్.. ఎందుకో అర్థంకావటంలేదు. దీనిని ఎక్కడి నుంచి కొనుక్కుంటు న్నారో అర్థంకావట్లేదు. ఇది ఎక్కడా చిక్కేటటువంటిదికాదు. తనకు తానే దీనిని సృష్టించుకుంటున్నాడు. ఈ టెన్షనే మానవుని హతం చేస్తున్నది. ఈ టెన్షన్ వలన టెంపర్ కూడా పెరుగుతున్నది. ఈ రెండు చేరితే అధోగతే.

నీలోనున్న దుర్మార్గపు భావాలను దూరం చేసుకోవాలి. సన్మార్గము, సత్ప్రవర్తనతో కూడిన ప్రేమ భావాలతో నింపుకోవాలి. ప్రేమను పెంచినకొద్దీ పెరుగు తుంటుంది. ఇది ఎట్లా పెంచాలి? పదిమందికీ పంచు కుంటూపోతే అప్పుడే ఈ ప్రేమ పెరుగుతుంది. అది తరగనటువంటిది. అది అమృతమయమైనటువంటిది. ప్రేమతత్త్వం శాశ్వతమైనటువంటిది. ప్రేమ అమృతం కంటే కూడా మధురంగా ఉంటుంది. పశువు ప్రేమతో తన బిడ్డను కాపాడుకుంటుంటే, పశుపతి ఎందుకు కాపాడడు?

'అనిర్వచనం ప్రేమ' అన్నాడు నారదుడు. ప్రేమను వర్ణించడానికి మాటలు చాలవు. ప్రేమతత్త్వాన్ని చాటినటువంటివాడు నారదుడు. నరుడ్ని, నారాయణుడ్ని ఏకంచేసినటువంటివాడు నారదుడు. 'నారదుడు' అనగా కలహప్రియుడని భావిస్తుంటారు. ఇది చాలా పొరపాటు. పూర్వం మొదట్లో కలహప్రియుడుగా ఉండేవాడు. తరువాత తపస్సు ఆచరించి, తన దోషములను తాను గుర్తించుకొని, ఆ దోషములు పరిహారం గావించుకొనిన తరువాత, తాను గొప్ప బోధకుడు అయ్యాడు. జ్ఞాన బోధకుడు నారదుడు. అజ్ఞాననాశకుడు నారదుడు. దుఃఖనివృత్తి, ఆనందప్రాప్తి గావించినవాడు నారదుడు కనుకనే ప్రపంచంలోవున్న సర్వదుఃఖములను పరిహారం గావిస్తూవచ్చాడు.

జీవించే నిమిత్తమై ఈ ప్రపంచంలో వచ్చి పడ్డావు. జీవనోపాధికి సంబంధించిన పనులు మనం చేయవచ్చును. నీఉద్యోగాలు నీవుచేయి. నీవ్యాపారాలు నీవుచేయి. కాని నీమనసును మాత్రం దైవంపై ఉంచుకో. అప్పుడే నీకు శాంతి, సుఖములు లభిస్తాయి. ఒక్కదైవచింతనలోనే మనకు శాంతి లభిస్తుంది. మరెక్కడా లభించదు. ఈ వాస్తవాన్ని మరువకండి! దైవ చింతనను విస్మరించకండి!

*(ది.27-9-98న ప్రశాంతి నిలయంలో నవరాత్రుల సందర్భమున భగవాన్ సాయిచేసిన దివ్య ప్రసంగం నుండి)*

✱

-- ఒక పరిశోధన --

# భగవంతుడు భారతావనిలో అవతరించాడు

మూలం : ఆర్.కె. కరంజియా — అనువాదం : డా॥ రాపర్ల జనార్ధనరావు

(అమెరికా పారాసైకాలజిస్టుల రిపోర్టు : మోసం ఏదీ లేదు. ఆధునిక మానసిక శాస్త్రం (సైకాలజీ) ఒక క్రొత్త విశ్లేషణాన్ని చేపట్టింది. అది అతీంద్రియ మానసిక శాస్త్రం. దీనినే 'పారాసైకాలజీ' అని వ్యవహరిస్తారు. మన ఇంద్రియాలకు సామాన్యముగా గోచరించే వానికన్న ఇంద్రియాతీతమైన, లేదా అలౌకికమైన విషయములున్నవా అనెడి పరిశోధనలు అమెరికాలోనూ, ముఖ్యంగా ఫ్రాన్సు లోనూ సాక్ష్యాలు ప్రపంచంనల్లెడలా సంచరించి, సమీకరించి ఒక శాస్త్రంగా రూపొందిస్తున్నారు. నేను వాషింగ్టన్‌లో ఉన్న సమయంలో గ్రంధాలయంలో ఈ విషయమై పుస్తకాలు చదవటం, టి.వి చానెల్స్‌లో పారాసైకాలజిస్టులు విషయ నిరూపణం చేయటం చూశాను.
(అనువాదకర్త - రా.జ.)

ఒక బ్లిట్జ్ కాపీని డా. వి.వి. అకోల్కర్ పూనాలోని పేరాసైకలాజికల్ ఇన్‌స్టిట్యూట్‌కు చెందినవారు, ఐస్‌లాండ్ యూనివర్శిటీకి చెందిన డా. ఎర్లాండర్ హెరాల్డ్‌సన్, అమెరికన్ సొసైటీ ఫర్ సైకిక్ రిసెర్చి సంస్థకు చెందిన డా. కార్లిస్ ఓసిస్ వ్రాసిన రిపోర్టు, పొందుపరచబడిన దానిని మాకు పంపించారు. ఈ రిపోర్టులో పుట్టపర్తి సాయిబాబా వారి అతీంద్రియ శక్తుల పరిశీలనలు వ్రాయబడి ఉన్నవి. ఈ సమీక్ష (రిపోర్టు) ఈ శాస్త్రజ్ఞులచేత అమెరికాలోని కాలిఫోర్నియాలో 1975లో జరుపబడిన పారాసైకాలజిస్టుల సమావేశములో సమీక్ష ప్రవేశపెట్టబడినది. ఆ సమీక్ష నుండి కొన్ని అంశాలు ఈ క్రింద పొందుపరచబడినవి.

భారత దేశాన్ని మేము రెండుసార్లు సందర్శించినాము. ఈ సమయంలో పుట్టపర్తిలోని సత్యసాయి బాబాను అనేకసార్లు దర్శించినాము. మేము అతీంద్రియ శక్తుల పరీక్షలు మామూలు విధానములో జరుపుటకు సాయిబాబా అంగీకరించలేదు. ఆయన తన అతీంద్రియ శక్తులను కేవలము ఆధ్యాత్మిక కార్యములకే వినియోగించెదనని తెల్పియున్నారు. కాని మాకు ఒసంగిన ఇంటర్వ్యూలలో వారు అనేక సందర్భములలో అనుకొనని రీతిని ఆకస్మాత్తుగ అనేక అతీంద్రియశక్తుల నిరూపణలు గావించియున్నారు. ఎంతో సమీపమునుండి వారు సుమారు 14 పర్యాయములు భౌతిక వస్తువులను అదృశ్యము చేయుట, సృష్టించుటవంటి వానిని చేసి యున్నారు. అయితే ఈ మహత్తులు మా స్వాధీనములోని పర్యవేక్షణ క్రింద జరుపబడినవి. (None Under Controlled Conditions) అయితే వానిలో ఒకముఖ్యమైన మూడు మహాత్మ్యములు వర్ణించెదము.

"మాతో చర్చలు జరుపు సందర్భాన, పరిశోధనల ప్రాధాన్యత మేము వివరించునప్పుడు, స్వామి తనకు మక్కువైన ఆధ్యాత్మిక జీవన విలువలను గురించి ప్రస్తావించుచూ, అతీంద్రియశక్తులూ, ఆధ్యాత్మికత రెండును కలసిమెలసి "జంట రుద్రాక్షలవలె ఉండవలెనని తెలిపినారు. ఈ మాటకు మాకు అర్థంతెలియలేదు. సాయిబాబా ఈ పదమునకు అర్థము మాకు తేటతెల్లము చేయవలెనని ఎంతో ప్రయత్నించినారు. చివరకు విసిగినట్లు కన్పడి తన పిడికిలి మూసి చేయి ఒకసారి ఊపారు. పిడికిలి తీసి మాకు చూపగనే 'జంటరుద్రాక్ష' కన్పించినది(ఇది నేపాలులో మాత్రమే ఎంతో అరుదుగా లభించేది. అనేక సందులున్న రుద్రాక్షలు లభించునుగాని జంటరుద్రాక్షలు లభించుట కష్టము. దీనినే సాధువులు అత్యంత విలువగల దానిగా భావిస్తారు)

దానిని తన చేతిలోనికి తీసికొని హెరాల్డ్‌సన్ వైపుకు తిరిగి ఇది ఆతనికి బహుమతిగ ఇవ్వదలచినానని తెల్పినారు. ఈ జంటరుద్రాక్షను తన రెండు చేతులలోనికి తీసుకొని దానిని తన నోటితో ఊదినారు. లోగడ మేము ఆయన చేతిలో చూచిన జంట రుద్రాక్ష బంగారు పట్టికతో ఒక శిలువ ఎర్రని రాయి పొదుగబడినదిగా చూచాము. స్వామివారు తన చేతులు పైకెత్తు సమయమున మేము వారిని చాల నిశితముగ పరిశీలించినాము. (అందరూ

వాదించునటుల) ఆయన తన చొక్కాకు గల పొడుగు చేతుల నుండిగాని , లేదా గుబురుగా పెరిగిన జుట్టు నుండి గాని లేదా తన దుస్తులలో దాచిన వేరెచట నుండిగాని దీనిని తీసినట్టి జాడలేదు.

## ఉంగరపు మహిమ

కార్లిస్‌ఓసిస్‌కు బాబా సాయిబాబా బొమ్మ చెక్కబడిన మంచిరంగులు కల్గిన ఒక బంగారు ఉంగరాన్ని మంచి రాయితో పొదగబడినదానిని బహుకరించాడు. ఒక పర్యాయము మేము స్వామివారిని మాపర్యవేక్షణలో ఈ మహాత్మ్యమును ప్రదర్శించమని ఒత్తిడిచేయుచుండగా, స్వామివారు కొంత విసుగుచూపి ఓసిస్‌ను చూచి "నీ ఉంగరానికేసి చూడు" అన్నారు. ఆ తళతళమెరిసేరాయి మాయమయింది. ఉంగరములో ఆ రాయిని బంధించినగాడి,ఆ బంగారు కట్టు అలాగే ఉన్నాయి. స్వామి వారినుండి మేము చాలా దూరంగా కూర్చున్నాము. స్వామివారు చెప్పేవరకూ ఆ ఉంగరములోని రాయి మాయమైనట్లే మాకు తెలియదు. ఇది నా పరిశోధన అని స్వామివారు తెలిపారు. మేము నేలమీద కూర్చున్నాము. ఓసిస్ ఎడమప్రక్కన కూర్చున్న ప్రొఫెసర్ హస్రా గారి దగ్గర స్వామి ఆగారు. ఆయన ఎడమప్రక్కన హెరాల్డ్‌సన్ కూర్చున్నాడు. సాయిబాబా కుడిచేయి ఊపారు. ఆచేయి మా కళ్ళకు కొద్దిగా పైకి ఉంది. ఆయన చెయ్యి ఖాళీగా ఉంది. ఆయన చేయిక్రిందకు దింపి గుండ్రాలు గుండ్రాలుగ తిప్పి ఏదోపొడిని తనచేతిలో చూపించారు. అదేవిభూతి.

ఈ సందర్భములో స్వామివారు చూపించిన మహత్తులకు మావద్ద ఏ సాక్ష్యాధారాలులేవు. మేము వీనికి సశాస్త్రీయమైన కారణాలు కూడ తెల్పలేము. అందువలన ఇవి నిజమని తెల్పలేము. కాని స్వామివారు మోసము చేశారని తెల్పేందుకుకూడ మావద్ద సాక్ష్యాధారాలు లేవు. ఆయన పొడుగు చేతుల లాల్చీ ధరిస్తారు. గుండీలు మెడవద్దనుండి పొట్ట పైభాగం వరకూ ఉంటాయి. ఆయన వదిలేసిన ఒక లాల్చీని కూడా పరిశీలించాము. వాటిలో లోపల దొంగ జేబులు కాని మరి ఏవైనా దాచే జేబులుగాని లేవు.

ఇదేసాక్ష్యాధారము ఇంకొక ఇద్దరు పరిశోధన జరిపే శాస్త్రవేత్తలు అతని భార్య, స్వామివారి అంగీ చూడగలిగినవారు,తెల్పారు. విభూతి ఇచ్చినప్పుడు స్వామివారి చేతులు కొంతమట్టిగ కన్పడేవిగాని వారి దుస్తులు మాత్రం శుభ్రంగానే ఉండేవి.

*(బ్లిట్జ్ ఆగస్టు21 , 1975 పత్రికనుండి నాల్గవ అనుబంధము)*

## భగవానుడు పుట్టపర్తిలో జన్మించాడు

రచన : ఎ.రాయ్

కొంతకాలముక్రిందట స్వామివారు ఒక ఆగంతకునితో"నిన్నెవరైనా భగవంతుడెక్కడ అని అడిగితే,ఆయనకు " భగవంతుడు పుట్టపర్తిలో ఉన్నాడని తెల్పుము" అన్నారు. ఈ దినము (23నవంబరు 1976) సరిగా అదే స్థలమున స్వామివారు 50ఏండ్ల క్రిందట జన్మించినచోట నిలబడి యున్నాను.

ఒక చిన్న ప్రాథమిక పాఠశాల, కల్యాణ మంటపము, తెల్లగా రంగువేసిన కొన్నిదేవాలయాలుతప్ప ఈ పుట్టపర్తిలో (1976సం॥ నాటిమాట) పెద్దగా చెప్పుకోదగిన విశేషాలు ఏమీలేవు. గ్రామస్థులు ఏదో తమ పనుల్లో తాము నిమగ్నులై, నిద్రించినట్లు ఉంటారుగాని, ఈ చిన్ని గ్రామానికి గల విశిష్టతను అర్థం చేసుకొనలేరు.

ఈ ఇండ్ల మధ్య తల్లిదండ్రులులేని అనాథ, మూగవాని వలె ఈ సాయిబాబా పాద చిహ్నములు కలిగిన ఖాళీస్థలములో రాళ్ళుకుప్పలు పొరుగువారు పారవేసిన చెత్తచెదారములున్నవి, ఇచ్చట ఈ స్థలమునకు పవిత్రతగాని ప్రజలయందు మంచిభావములు గాని కన్పట్టవు.

## బాల్యమునుండియు మహిమాన్విత జీవనము

"బాబాకు చిన్ననాటినుండియే అద్భుత మహిమలు కలవని మీకెట్లు తెలియు"నని, బాబా పినతండ్రి 86ఏళ్ళవృద్ధుడు పూరిపాకలో నివసించుచున్న వానిని చూచి అడిగాను.

ఆ వృద్ధుడు చెప్పిన మాటలివి" నేను వినిన అద్భుతములన్నియు కట్టుకథలని త్రోసిపుచ్చెడివాణ్ణి.

ఒకరోజు వానిని పిలిచి దురుసుగా కోపాన పెద్ద నిమ్మకాయలు రెండు సృష్టించి నాకివ్వమని అడిగాను. అతడు చేతులుత్రిప్పి వెంటనే రెండు నిమ్మకాయలు సృష్టించి నాకిచ్చాడు".

ఆ గ్రామంలో అనుదినం ఏదో ఒక మహత్తు కనపడకుండా ఉండేదికాదు. ఖాళీసంచుల్లో నుండి 'సత్యనారాయణ' (సాయిబాబా చిన్ననాటి నామధేయం) పెన్సిళ్ళు, రబ్బర్లు,ఆటవస్తువులు, మిఠాయిలు, తీసి తోటి స్నేహితులకు పంపిణీ చేసేవాడు. చిత్రావతి నదీ తీరాన ఇసుకలో నిల్చుని, దేవుని పటాలు, విగ్రహాలు , గ్రంథాలు, తావళాలు, శిలువలు సృజించి ఇచ్చేవాడు. ప్రక్కనున్న కొండెక్కి అచటనుండి దేవతల రూపాలు మిరుమిట్లు గొల్పేలాగున చూపేవాడు. అక్కడ ఉన్న చింతచెట్టు (ఇప్పుడు కల్పవృక్షమని పిలుస్తారు) నుండి యాపిల్సు, మామిడి, అత్తిపళ్ళు, ద్రాక్షపళ్ళు లాగి ఇచ్చేవాడు. పదేళ్ళ వయసురాక పూర్వమే సంగీతము, నృత్యము బాగా చేసి స్కూలులో తన ప్రతిభ ప్రదర్శించేవాడు. నాటకాలు, పద్యాలు వ్రాయటంలో అతని కెవరు సాటిలేరు.

ఈ అద్భుతగాథలన్నీ ఆనోట ఈనోట వ్యాపించి గ్రామ సరిహద్దులుదాటగా, ఎందరెందరో ప్రజలు వేలకొలదిమంది ఈ అద్భుతాలు చూడటానికి ఈ గ్రామానికి వచ్చెడివారు. తన అవతార నిదర్శనమునకై బాబా ఇల్లు వీడుతాడు.

14వ ఏటనే తన పాఠ్యపుస్తకాలు అవతల పారవేసి సాధువులు, సన్యాసులు, భక్తుల ప్రార్థనల మన్నించి సాయిబాబాగ తాను అవతారమెత్తినానని ప్రకటించినాడు. సత్యము, ధర్మము, శాంతి, ప్రేమ మొదలుగాగల సద్గుణ ముల ప్రభోదించుటకై కారణ జన్ముడై అవతారపురుషుడై **ఇల్లువీడి వెడలినాడు.**

1940 అక్టోబరు 20వతేదీన సాయిబాబా ఎలుగెత్తి తన పిలుపునిచ్చినాడు. 'మోక్షప్రియులారా! మానవజన్మమెత్తిన ప్రైవాన్నినేను. నాపాదముల చెంతన చేరండి, నాకృపవలన జనన మరణముల మోహ సముద్రాన్ని మీరు దాటగలరు." అనిప్రకటించినారు. ఈ ప్రకటన ధ్వనులే నేటికిని ఈప్రాంతమున భజనల రూపమున ప్రతిధ్వనించి యావత్ప్రపంచమునను నింపుచున్నవి.

బీదలు, ధనికులు, సాధువులు, పాపకర్ములు, అందరునూ ఇక్కడికి చేరి శాంతికొరకు, ప్రశాంత ఏకాంత వాసమునకు, మానసిక పరిశుద్ధతకై చేరుకొనుచున్నారు. కాలము గడచిన కొలది ఈ స్థలము మానసిక, ఆధ్యాత్మిక మార్పులను తెచ్చెడి ఒక హోమాగ్ని స్థలిగా మారినది. ఇచ్చట దుర్గుణభూయిష్టమైనవన్నియు (కొలిమిని కాల్చి నటుల) పరిశుభ్రమైన రూపాంతరము పొందుచున్నవి. తళతళమెరియు వర్ణములో ప్రేమ, దయ మొదలగు గుణములు వెల్లివిరియుచున్నవి.

## వినూత్నమైన ఆధ్యాత్మిక చైతన్యము

ప్రతిదినము ఏదోఒక అద్భుతక్రియచేత అంతములేని ఈ మాహాత్మ్యముల గాధలు పుటలలో సంతరించుకొనుచున్నవి.

1976జూన్ 5వ తేదీ ఒక చరిత్రాత్మక సంఘటన జరిగినది. ఆ దినము సాయిబాబా వెండితో చేసిన భారతదేశపు పటమును సృజించినారు. దీనియందు రాబోవు 46సంవత్సరముల కాలమున ముఖ్యమైన స్థలములు, అచట జరుగవలసిన కార్యక్రమములు, నెలకొల్పవలసిన సంస్థలు అన్నిటి వివరములు తెలుపబడి యున్నవి.

లైటుహౌసు వలె త్రోవచూపుచు ఆధ్యాత్మికపు టెల్లలు నిరూపించుచు, తరతరములు ఆధ్యాత్మిక జ్ఞానమును బడయు నటుల సూచింపబడినది, ఈ మ్యాపు భావితరములు వారిని గూర్చి బాబా చేసిన నిర్దేశములు తెల్పుచున్నది, మానవ జన్మసార్థకతను గూర్చి పూర్తి అవగాహన కల్గిన ఒక మహాశక్తి ఇచట చోటుచేసుకొని యున్నది.

ప్రశాంతినిలయము ఆధారభూతమై ఆధ్యాత్మిక కంపనములను వెల్వడచేయుచు షుమారు 60దేశములను మించి ఉబికి వెల్లువయైన ఈ ఆధ్యాత్మిక పెనుతుఫాను ఆధ్యాత్మిక చైతన్యము ప్రపంచచరిత్ర పుటలలో ఎన్నడు గానని విధాన 25 సంవత్సరములలో సాయిబాబా ప్రకటించినరీతిని వ్యాప్తిచెందుచున్నది.

నేటికి అనగా 1976 నాటికి ప్రపంచ మందెల్లెడల వ్యాపించిన బాబా భక్తులు సుమారు 20మిలియన్ల మంది ఉన్నటుల తెలియుచున్నది. అందు అనేకులు రచయితలు, కవులు, పత్రికారచయితలు, వైద్యప్రముఖులు, ఇంజనీర్లు, సాధువులు, శాస్త్రవేత్తలు, ప్రతిభాశాలురైన రాజకీయ నాయకులు మొదలైనవారు అనేకులున్నారు. వీరెల్లరు బాబాచేత వంచింపబడినారనుట కేవలము అపహాస్యము.

## భక్తి, ప్రేమల ప్రకంపనలు

ఈ అలౌకిక శక్తుల గూర్చిన పరిశోధనలు అనవసరమని నేను అనబోను. కాని ముందుకు సాగిపోవు చున్న తరి, మనము మన ఆలోచనా సరళిని ఒకపద్ధతిగను, నియమరీతినుండి మరల్చరాదు. సాయిబాబాను శాస్త్ర పరిశోధన శాలలయందు పరిశోధనలు జరుపబడెడు జంతువుల స్థాయికి గొనిపోరాదు అను విషయము తేటతెల్లమగుచున్నది. ఎలక్ట్రిక్ మైక్రోస్కోప్‌తో ఒక అతీంద్రియశక్తిని సాధారణనేత్రమున కనుగొనజూచుట హాస్యాస్పదము.

ఈ దినము, 1976 నవంబరు 23, బాబా 51వ జన్మదినోత్సవము. " నాజన్మదినోత్సవమెవరూ జరుపు కొనవలదు. కారణము నేను జన్మనెత్తుట యనునదిలేదు. మీ హృదయములలో నేను జన్మించిన దినమునను జన్మదినోత్సవముగ జరుపుకొనండి'" ఈ దినము ఆయన అనేకమంది హృదయములలో జన్మించి ఈ ప్రత్యేక దినమును వైభవముగా జరుపుకొనుచున్నారు.

ప్రశాంతినిలయము రంగు కాగితములు, రంగోలీ, వేడుకలు, పుష్పాలంకరణలతో వెలయుచున్నది, ఆకసమున మెల్లగ మబ్బులు తేలియాడుచున్నవి. వృక్షములు మెల్లన కదలి, కమనీయ సంగీతగానముల నొసగుచున్నవి. భక్తుల ముఖారవిందములు తేజోరూప ముగ వెలయుచున్నవి. ఎటుచూచినను మందస్మిత వదనములే. అంతయు నవ్వుల తోరణములే. వాతావరణ మంతయు ప్రేమ, భక్తులతో వెల్లివారుచున్నది. రక్తనాళము లన్నియు ప్రేమ భక్తులతో నిండియున్నవి.

## నా శక్తులు అన్నియు నేను చేసినట్టివికావు

దివ్యజ్యోతులు శరీరమంతటి నుండి వెల్వడుచూ బాబా సభావేదికపై వచ్చియున్నారు. వేన్వేల నేత్రములు ఆయనపై ఆతృతతో కేంద్రీకరింపబడి యున్నవి. సభికులెల్లరు ప్రేమభావోన్మత్తులైయున్నారు. ఏదో ఒక దైవతేజస్సు వారిపై వెదజల్లబడుచున్నది. వేదికపైన భక్తులు పుష్పహారములిచ్చుచుండగా వేదిక క్రిందజనము తమ ఆనందాశ్రువుల పుష్పములను సమర్పించుచున్నారు.

బాబా తన 51వ సంవత్సర సందేశాన్ని ఇలా తెల్పినారు. "నా మహిమలు(నేనేదో కష్టపడి)నేనుగ సంపాదించుకొనినవి కావు. అవి శాస్త్రవేత్తల పరిగణనకు అతీతమైన దైవశక్తులు. శాస్త్రీయ విజ్ఞానమొక నిచ్చెన లాంటిది. దాని ఆధారమున ఆకాసమున కెగబ్రాకలేము. దైవావతారము, చమత్కారము(ఆకర్షణ), సంస్కారము (మార్పు), పరోపకారము(మానవసేవ), సాక్షాత్కారము (దైవనిదర్శనము)లను కల్గియుండును. దైవావతారము తన దివ్యగుణములను మార్పు నొందించును, పరోపకార భావన కలిగియుండ వలెనను ప్రబోధము సేయును, తుదకు దైవ దర్శనము నొసంగును. ఈ కారణముచే నేను దైవరూపము దాల్చిన వాడనయ్యాను. అందరికి సహాయము చేయండి, అందరిని ప్రేమించండి. ముఖ్యముగ నన్ను విమర్శించెడివారిని ప్రేమించండి వారు మార్గము తప్పిన వారుకద. అయినను అనంతత్వమున వారు కూడ భాగస్వాములే.

బాబా ఇలా గానం చేశారు. ప్రపంచమంత తానేనని చూపగల్గెడువాడు తనను ప్రార్థించినవారి చెంతనుండెడివారు. తన యందు భక్తి విశ్వాసము పెంపొందించువాడు ఆతడే పుట్టపర్తి వచ్చి యున్నవాడు ఆతనిని నీవు నీ మనమున నింపుకొన జాలవా?

20 మిలియన్ల భక్తులు, బాబా హృదయ సామీప్యము పొందియున్నారు. బాబా దివ్యత్వమును గూర్చి పొగడుచున్నారు. నమ్మండి. లేకపోండి. భగవానుడు పుట్టపర్తి యందు అవతరించియున్నాడు.

*(11 డిశంబరు 1976 బ్లిట్జ్ పత్రికలో ప్రకటితము.)*



# శ్రీ సత్యసాయి అకామిడేషన్స్

కుమార్ విలాస్ హోటల్ కాంప్లెక్స్,
డోర్ నెం. 324, ఫస్ట్‌ఫ్లోర్,
**పుట్టపర్తి - 515 134**

రు. 12,116/- ఒక్కసారిగా చెల్లించి మా అకామిడేషన్స్ నందు మెంబరుగా చేరిన 12 సంవత్సరముల వరకు సంవత్సరమునకు 60 రోజుల చొప్పన ఉచిత వసతి ఏర్పాటు చేయబడును. 12వ సంవత్సరము చివర రు. 10,000/- తిరిగి ఇవ్వబడును. అందులకై ఈ రోజునే మెంబరుగా చేరిన వారికి బ్యాంకు **ష్యూరిటీ సర్టిఫికేట్** ఇవ్వబడును.

రు. 10,116/- చెల్లించి మా అకామిడేషన్స్‌లో మెంబరుగా చేరిన 10 సంవత్సరముల వరకు సంవత్సరమునకు 60 రోజుల చొప్పన **ఉచిత వసతి** లభించును.

**LIMITED MEMBERS ONLY**

**మనవి :**

**శ్రీ శివసాయి అకామిడేషన్స్ అను పేరును శ్రీ సత్యసాయి అకామిడేషన్స్‌గా మార్చుట జరిగినది. కావున పాఠకులు మరియు మెంబర్లు గమనించ ప్రార్థన.**



మిగిలిన విషయములకై ఈ క్రింది అడ్రస్సును సంప్రదించగలరు.

**చుండూరు వెంకటరత్నం**

ప్రొప్రయిటర్

**శ్రీ సత్యసాయి అకామిడేషన్స్**

కుమార్ విలాస్ హోటల్ కాంప్లెక్స్,
డోర్ నెం. 324, ఫస్ట్‌ఫ్లోర్,
**పుట్టపర్తి - 515 134**

నవరాత్రుల సందేశం - 4

# బుద్ధి కలిగి జీవించుమో పెద్దమనిషి!

భగవాన్ సాయి దివ్యబోధ

" కోటీశ్వరులకైన కూడు గుడ్డయె కాని
బంగారమును తిని బ్రతకలేడు
కాలమే కాకున్న క్రయే పామగును
కలసివచ్చిన మట్టి కనకమగును
పండితుడొకచోట పశువైపోవును
మూర్ఖుండొకచోట మునిగా మారు
ధనవంతుడొకచోట దారిద్ర్య దేవత
వరియించి ప్రేమతో వరుసలాడు
ప్రాకులాడుటెకాని ప్రాప్తియె లేకున్న
దమ్మిడీయైనను దరికి రాదు
వద్దురాబాబు వద్దురా నరుడ పెద్ద ఆశ
బుద్ధి కలిగి జీవించుమో పెద్ద మనిషి."

ప్రేమ స్వరూపులారా!

ఈ విశాల ప్రపంచమునందు మానవత్వం అనేది చాలా ఉత్తమమైన జన్మ. అనేక జన్మల పుణ్యఫలమును ప్రోగుచేసి, అందుకొనిన అదృష్ట జీవితం ఈ మానవజన్మ. ఒక్క మానవ జీవితమునందే ఈ విశాల ప్రపంచ మంతయునూ సూక్ష్మ స్వరూపమై యిమిడి ఉన్నది. ఒక చిన్న గ్రామఫోన్ ప్లేటు లోపల అనేకమైన పాటలు, మాటలు, పద్యములు, ప్రసంగాలు అన్నీ కలిగి ఉంటాయి. ఆ ప్లేటును తీసుకొని చెవి వద్ద పెట్టుకుంటే ఏ శబ్దమూ వినిపించదు. దానిమీద ఒక అక్షరం కూడా కనిపించదు. ప్లేటు మీద కేవలం గీతలు వలె కనిపిస్తుంటాయి. కాని ఆ గ్రామఫోన్‌కు కీ యిచ్చి, పిన్ను పెట్టి త్రిప్పుతే అన్ని మాటలు, పాటలు, పద్యములు స్పష్టంగా వినిపిస్తాయి. అదే విధముగనే మానవుని హృదయము నందు అనేక జన్మల సంస్కారం గాని, అనేక జన్మల కర్మఫలములు గాని, ఈ జగత్తులో మనం చూచిన దృశ్యములుగాని, విన్న మాటలు గాని అన్నీ ఆ హృదయంలో లీనమై వుంటున్నాయి. కేవలం Resound మాత్రమే కాదు Reaction మరియు Reflection కూడా ఉంటున్నాది. నీవు చూచిన సముద్రము, నీవు చూచిన హిమాలయాలు, నీవు సంచరించిన ప్రదేశాలన్నీ నీ హృదయంలో ప్రింటు అయివుంటున్నాయి. ఏతావాతా దీని అంతరార్థం ఏమిటి? ప్రతి మానవుని హృదయము నందూ విశ్వమంతా ప్రింటు అయి వుంటున్నది. కనుక మానవుడు విశ్వవిరాట స్వరూపుడు.

ఇట్టి విశ్వవిరాట స్వరూపుడైన మానవుడు తాను అల్పునిగా భావించుకొని, స్వల్పునిగా విశ్వసించి, అనేక విధములైన కష్టములకు క్రుంగి, క్రుశించి, సుఖములకు పొంగి, పొరలి అనేక విధములైన మంచి చెడ్డలను అనుభవిస్తున్నాడు. మానవుడు తన సత్యమును తాను గుర్తించుకొనుటకు ప్రయత్నించటం లేదు. తన భావాలను తాను గుర్తించటానికి ప్రయత్నించటం లేదు.

శ్రుతి యొక్క ప్రమాణం ప్రకారం 'నేను' అనే పదమునకు హృదయం జన్మస్థానం. అయితే ఈ 'నేను' (I) ఎక్కడ ఉన్నది? "నేను" అనే పదం ఎక్కడ నుంచి వచ్చినది. ఇది సర్వత్రా వుంటున్నది. ఎవరికి వారు ఇతరులకు పరిచయం చేసుకునే ముందు 'నేను' అనే పదము ముందు ఉంటుంది. ఈ 'నేను' పదము ఉన్న చోటంత కూడనూ 'అహం' అనే తత్త్వంలో ఈ హృదయం ఉంటుంది. కాబట్టి 'హృదయం' అనేటటువంటిది ఒక్క దేహమునందు మాత్రమే కాదు, ప్రపంచమంతయూ నిండి ఉంటున్నది. ఈ 'నేను' అనే పదము ఆత్మ యొక్క పేరు. కనుక ప్రతి శరీరము నందు 'నేను' అనే స్వరూపంలో ఆత్మగా నిలిచి ఉంటున్నది. ఇది ఒక బుద్ధితో కూడి ఉంటున్నది.

ఈ బుద్ధి అనగా ఏమిటని ఎవరినైనా విచారించినప్పుడు సర్వులూ ఈ బుద్ధిని విచారణ శక్తి అంటున్నారు. నిత్యానిత్య విషయ పరిశీలనే బుద్ధి యొక్క రూపము అంటున్నారు. ఇది సరియైన సమాధానం కాదు. ఇది కేవలం ప్రాకృతమైన జగత్తులో, ప్రాకృతమైన భాషలో ఈ విధంగా చెప్పుకుంటున్నారు. ఈ బుద్ధికి ఐదు

అంశములు వుంటున్నాయి. 1. శ్రద్ధ, 2. ఋతము, 3. సత్యము, 4. యోగము, 5. మహత్‌తత్వము.

1. గాఢ విశ్వాసంతో కూడినటువంటిది. ఈ విశ్వాసం కూడా స్థిరత్వంతో ఉండినటువంటిది. కనుక Slow and Study ఈ రెండు శక్తులతో కూడినటువంటిది, మొదటిది శ్రద్ధ. 2. త్రికరణ శుద్ధితో కూడినటు వంటిదే ఋతము. 3. ఈ త్రికరణ శుద్ధితో కూడినటువంటి ఋతము నుండి ఆవిర్భవించినటువంటి స్వరూపమే సత్యము. ఇది వాక్కు రూపంలో వచ్చినటువంటిది. 4. "యోగః చిత్తవృత్తి నిరోధకః" సర్వేంద్రియములను స్వాధీనం చేసుకొనే తత్త్వమే ఈ యోగము. 5. ఇక మహత్ తత్త్వము - ఇది చాలా పవిత్రమైన స్థితి, దివ్యమైన స్థితి, నవ్యమైన స్థితి. దీని స్థితిని ఇట్టిది, అట్టిది అని ఎవరూ నిర్ణయించలేరు. కనుక శ్రద్ధతో, ఋతముతో, సత్యముతో, యోగముతో, మహత్ శక్తితో కూడినటువంటిదే ఈ బుద్ధి యొక్క స్వరూపము. ఇలాంటి సర్వ శక్తులతో కూడినటువంటి బుద్ధిని నిత్యానిత్య పరిశీలనతో మాత్రమే పోల్చుకోవట మనేది 'బుద్ధి'ని చులకన చేసినట్లే అవుతుంది.

ప్రతి మానవుడు మనస్సు, బుద్ధి, చిత్తము, ఇంద్రియము అని వర్ణిస్తుంటాడు. అయితే ప్రతి పదమునకు సరియైన అర్థమును గుర్తించటానికి మనం ప్రయత్నించాలి. ఈ మనస్తత్వం కూడా అట్టిదే. సంకల్పముల చేరికయే 'మనసు' అనుకుంటున్నాం. కాదు...కాదు... కేవలం సంకల్పములే కాదు, చర్యలు కూడా చేరినటువంటిదే ఈ మనసు యొక్క స్వభావము. ఈ మనసు, బుద్ధి రెండూ ఏకమైనప్పుడు మానవత్వమనేదే శూన్యమైపోతుంది. ఈ శూన్యమైన స్థితినే 'మోక్షము' అని చెప్పారు. కనుక ఈ మనస్సు యొక్క స్వభావం చాలా విచిత్రమైనటువంటిది, చంచలమైనటువంటిది, అస్థిరమై నటువంటిది. పొగరుమోతు లక్షణం కలిగినటువంటిది, సర్వత్రా వ్యాపించే లక్షణం కల్గినటువంటిది. ఇలాంటి మనసును ఎవరు అరికట్టగలరు? అరికట్ట గలమని భావిస్తున్నారు. ఇది అసాధ్యం. కనుక నీవు మనసును అరికట్టే ప్రయత్నం చేయనవసరంలేదు. బుద్ధిని అనుసరించు. అప్పుడు మనసు తనంతటతానే మన వెంటపడుతుంది. నీకు తెలికగా స్వాధీనమైపోతుంది. కనుక మనసును అరికట్టుకునే నిమిత్తమై సాధనలు సలపటం చాలా పొరపాటు. ఈ మనసుకు అధిపతి బుద్ధి. ఈ బుద్ధికి Master ఆత్మ. దానికి Master లేడు. ఆ Master అయినటువంటివాడే Master The mind be a Master Mind అన్నారు. దీనినే 'ఆత్మ' అని పిలుస్తూ వచ్చారు. దీనినే 'సత్యం' అని నిరూపిస్తూ వచ్చారు. Search for Truth is Search for God అన్నారు. God is Truth, because Truth is God. ఈ విధమైనటువంటి తత్త్వాన్ని మొట్టమొదట మనం గుర్తించుకోవాలి. ప్రత్యక్ష స్వరూపుడైనటువంటివాడు ఈ జగత్తులో ఎవరు? అంటే సత్యస్వరూపుడే. ఈ సత్యమును ఆరాధించు, అనుసరించు, సాధన చేయి. ఒక వేళ దేవుడు లేరని ఎవరైనా అనవచ్చును గాని సత్యములేదని అనలేరుగదా! Truth is God. సర్వ మతములకు, సర్వ దేశములకు సమానమైనటువంటిది ఈ సత్యము. అన్ని కాలముల వారికి, అన్ని జాతులవారికి, అన్ని దేశముల వారికి, అన్ని తెగల వారికి సత్యము ఒక్కటే. Truth is one for all. అదే విధంగా భగవంతుడు కూడా ఒక్కడే. God is one. అనేక రూపనామాలతో ఆరాధనలు సలుపు తున్నాము. ఇవన్నీ మన భ్రాంతి నిమిత్తమై ఏర్పడినవే. మానవుడు అనాది కాలం నుండి భ్రాంతి స్వరూపుడై నిలిచివుండటం చేతనే, ఈ భ్రాంతి కోసం ఈ సాధనలు సలుపుతున్నాడు. ఈ విధమైన భ్రాంతి మానవుని హృదయమునందు వుండినంతవరకునూ బ్రహ్మ మనకు ప్రాప్తించదు. ఏనాడు ఈ భ్రాంతి నిర్మూలమవుతుందో, ఆనాడే మనకు బ్రహ్మ ప్రత్యక్షమవుతాడు.

దైవత్వమునకు సమీపముగా వుండినంత మాత్రమున చాలదు. ప్రేమ తత్త్వాన్ని కూడనూ ఈ సచ్చిదానంద స్వరూపంలో ఏకంచేయాలి. అప్పుడే ఏకమవుతుంది. 'ఓం మిత్యేకాక్షరం బ్రహ్మ'ఒకే శబ్దం చేతనే దైవత్వాన్ని పొందవచ్చు. ఈనాడు మానవుడు చేసే సర్వసాధనలు కూడనూ కేవలం తన భ్రాంతిని తృప్తిపరచే నిమిత్తం చేస్తున్నాడు.

దైవం మన దేహంలో శిరస్సులో నివశిస్తున్నాడు.

ఈ శిరస్సునే దైవ లోకము అన్నారు. నరలోకమనేది మన కంఠంలో చేరి ఉంటున్నది. నాగలోకము మన హృదయం లో ఉంటున్నది. కనుక దేవలోకము, నరలోకము, నాగలోకము - ఈ మూడింటికి మన దేహమే నివాసంగా ఉంటున్నది. ఇంతటి పవిత్ర శరీరమును కలిగి ఉండి కూడనూ, కేవలం జీర్ణించిపోయేది శరీరమని, దహించి పోయేది దేహమని భావిస్తున్నాం. కాదు...కాదు..... దేహం దహించవచ్చు, జీర్ణించవచ్చును. కాని 'దేహి' దహించడు, జీర్ణించేవాడు కాదు.

**దేహము పాంచభౌతికము దేహము కూలక తప్పదెప్పుడున్**
**దేహి నిరామయుండు గణుతింపగ దేహికి చావు పుట్టుకల్**
**మోహ నిబంధ బంధనల ముద్రలు లేవు నిజంబు చూడ**
**దేహియె దేవదేవుడు మదిన్ గణుతింపగ ఆత్మరూపుడౌ"**

దేవుడికి స్థానమైన ఈ దేహమును మనం ఎంత దుర్వినియోగం చేసుకుంటున్నామో యోచించండి. దేవదేవుని నివాస స్థానమును దుర్వినియోగం చేస్తున్నాం, చెడు మార్గములో ప్రవేశపెడుతున్నాం. దుర్వ్యసనములకు గురి అవుతున్నాము. ఇటువంటి దుర్మార్గపు పనులకు ఒడిగడుతూ దైవత్వాన్ని చూడాలంటే ఎట్లా సాధ్యము అవుతుంది? మన శిరస్సే ఒక దేవ లోకం ఎందుకనగా ఆ శిరస్సు నందే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు ఉంటున్నాయి. పంచ భూతములతో కూడినటువంటిదే ఈ ప్రపంచం. భగవంతుడు ఎక్కడ ఉన్నాడు? అంటే పంచభూత స్వరూపుడై ప్రపంచమంతా ఉంటున్నాడు. దివ్యత్వమనేది సర్వత్రా ఉండినటువంటిదే. ఈ పంచభూతముల యొక్క తత్త్వమే మానవుని యొక్క జీవిత తత్త్వము.

ఈ పంచభూతములు, పంచ కోశములతో చేరి ఉంటున్నవి. **1. అన్నమయకోశము, 2. ప్రాణమయ కోశము, 3. మనోమయకోశము, 4. విజ్ఞానమయకోశము, 5. ఆనందమయ కోశము.** ఈ ఐదూ కూడనూ ఒక్క దేహము నందే ఉంటున్నాయి. విజ్ఞానం కోసం వేరే గ్రంథములు చదువనవసరంలేదు, ఏ పెద్దలను ఆశ్రయించ నవసరం లేదు, ఏ బోధనలూ విననవసరం లేదు. ప్రజ్ఞానమనే కోశమే మనలో ఉంటున్నది. ఈ విజ్ఞాన కోశమును మనం అనుభవించినప్పుడు, ఆనందమయ కోశం సహజంగానే మనకు లభ్యమవుతుంది. కనుకనే మానవుడు నిరంతరం ఆనంద పిపాసియై ఉంటున్నాడు. ఆనందసాగరంలో తేలిపోతున్నాడు. అసలు ఆనందంలోనే ఉంటూ ఆనందం కోసం ఎందుకు ప్రాకులాడటం?

ఈనాడు ఎవరికి వారు తన జీవితలక్ష్యము ఏమిటి? మనం దేని కోసం పుట్టాం? ఇత్యాది ప్రశ్నలు వేసుకోవాలి. అప్పుడే మన జీవిత పరమావధి ఏమిటో మనకు బోధపడుతుంది. What is the purpose of Life? అని ప్రశ్నించుతే హిందీలో చమత్కారంగా చెబుతుంటారు. "ఖానా, పీనా, సోనా, మర్‌నా" అని అంటారు. ఈ నాల్గింటి కోసమే మనం పుట్టామా? కాదు... కాదు... మానవదేహం ఎందుకు వచ్చింది? 'శరీరమాద్యం ఖలు ధర్మ సాధకమ్.' ధర్మమును ఆచరించడాని కోసం పుట్టింది. ఏమిటి మన ధర్మం? తన సత్యమును తాను గుర్తించాలి. ఎదుటి వ్యక్తిని దైవంగా విశ్వసించాలి. ప్రపంచమంతా ఒక దైవమందిరంగా భావించాలి. ఏ పనిచేసినా దైవకార్యంగా

## సత్యసాయీశ! జగదీశ!

"అర్థంబు జగతి సర్వార్థ మూలకమంచు
తెలివి లేకను ప్రవర్తించువారు
సంసార మార్గ సంచారులై విహరించి
అధిక బాధలకు లోనైనవారు
దురభిమానంబుతో పరులను దూషించి
వైరభావంబు పెంపొర్చువారు
క్షాత్ర తేజమ్మె విశ్వ శ్రేయమని యెంచి
అంచలంబున హుంకరించువారు
మహితమైన మోక్ష మార్గంబు గనలేక
వెతలజిక్కి పరితపించుచుండ
వారి నుద్ధరింప పఱతెంచి తీవొకో
సత్యసాయీశ! జగదీశ! స్వప్రకాశ!

- తాళ్లూరి సత్యనారాయణ.

భావించాలి. "సర్వకర్మ భగవత్ ప్రీత్యర్థమ్" అనే భావనతో కర్మలనాచరించాలి. ఇలాంటి పవిత్రమైన జీవితాన్ని గడుపవలసిన మానవుడు, ఈనాడు ఏదో ఆర్జించాలనే తాపత్రయంతో అపవిత్రమైన జీవితాన్ని గడుపుతున్నాడు. జీవితాన్ని వ్యర్థం గావించుకుంటున్నాడు.

జీవితంలో ఉన్నది ఏమిటి? జీ...వి...త...ం. ఈనాడు మొదటి మూడు పోయినాయి. ఆఖరిలో వున్న 'సున్న' మాత్రమే మనకు మిగిలింది. ఈ 'జీరో' కోసం మన జీవితమా? కాదు. నీవు హీరో కావాలి. కాని 'జీరో' అనేది ఎక్కడనుంచి వచ్చిందో, దాని ప్రక్కనే వుంటున్నాడు 'హీరో'. ఈ హీరోకు ఎడమ ప్రక్కన ఒక 'జీరో' పెడితే పది అవుతాడు. దాని ప్రక్కన మరో 'జీరో' పెడితే వంద అవుతాడు. కనుక 'హీరో'ను లక్ష్యములో పెట్టుకొని నా దేహము, నా బుద్ధి, నా మనసు, నా ఇంద్రియము, నా అంతఃకరణ అనే జీరోలను ఎన్ని అయినా పెట్టుకోండి. Hero becomes Zero, if He forgets God. దేవుని విస్మరిస్తే 'హీరో' కూడా 'జీరో' అయిపోతాడు. కనుకనే మనం 'హీరో' ను ఆధారంగా తీసుకోవాలి. ప్రపంచమంతా 'జీరో'నే. జీవితమంతా 'జీరో'నే. అంతా జీరోలే. 'హీరో' వలననే జీరోలు ప్రకాశిస్తున్నాయి. కనుక మన జీవితమును గుర్తించుకోవటానికి ప్రయత్నం చేయాలి.

మనం సేవలలో ప్రవేశించాలి. మనం ఎవరికో సేవలు చేస్తున్నామని భావించరాదు. నీకు నీవే చేసుకుంటున్నావు. భగవంతుని పూజిస్తున్నావు. దేనికోసం? నీ తృప్తి కోసం నీవు పూజిస్తున్నావు. నీవు చేసే భజనలు, పూజలు, జపాలు, తపాలు, ధ్యానం - ఇవన్నీ భగవంతునికోసం కాదు. నీ తృప్తికోసం నీవు చేస్తున్నావు. భగవంతునికి ఇవేమి అవసరం లేదు. భగవంతునికి కావల్సింది ఒక్కటే. అదే "నిన్ను నీవు తెలుసుకో. అప్పుడే నన్ను నీవు తెల్సుకున్నవాడవవుతావు!" "Confidence in you, confidence in God, This is the secret of greatness." అయితే ఈనాడు నిన్ను నీవు నమ్మలేక పోతున్నావు. ఇక భగవంతుణ్ణి ఎట్లా నమ్మగలవు? నాలుగు దినాలు బ్రతికే నరునిపైననే నమ్మకం లేనినాడు నారాయణునిపై నీకు ఎట్లా నమ్మకం వస్తుంది? కేవలం నారాయణుని నమ్మినటువంటివాడు ప్రహ్లాదుడు. నర దేహమును నమ్ముకొనినటువంటివాడు హిరణ్యకశిపుడు. దైవాన్ని నమ్ముకున్న వాడికి ఎట్టి పరిస్థితులలోను దైవ రక్షణ వుంటూనే ఉంటుంది.

ప్రేమ స్వరూపులారా!

మన దేహానికి ఆహారం కావాలి. ధరించడానికి వస్త్రములు కావాలి. ఉండడానికి ఇల్లు కావాలి. జబ్బు చేస్తే మందులకు డబ్బు ఉండాలి. పిల్లలను చదివించడానికి డబ్బు అవసరం. ఇంతేగాని మితిమీరిన ఆశకు ప్రాకులాడ వద్దు. "వద్దురా నరుడ పెద్ద ఆశ. బుద్ధి కలిగి జీవించుమో పెద్దమనిషి" అన్నారు. మితిమీరిన ఆశలను పెంచుకోవద్దు. ఎంతవరకు అవసరమో అంత వరకే తృప్తి పడాలి. కనుక 'తృప్తి' అనేదే సుఖం. "అసంతృప్తో ద్విజో నష్టః" రెండు విధాల నష్టమై పోతుంది. శాంతిని పొందాలంటే 'తృప్తి'ని అనుభవించు. ఆ తృప్తి ఎక్కడనో లేదు నీయందే ఉంటున్నది. కోరికలు తగ్గించుకోండి! ఆశలు పెంచు కోకండి!

ప్రేమ స్వరూపులారా!

మొట్టమొదట నీయందు వున్న దివ్యతత్త్వాన్ని గుర్తించు కోకుండా ఎన్ని సాధనలు చేసినా ప్రయోజనం లేదు.

"మేథమేటిక్సును మరువక జపియించు
గణిత శాస్త్రము వంక చూడబోడు
అమెరికా మార్గమ్ము నరయచూచునుగాని
కాశికా మార్గమ్ము కానరాడు
ఆల్జిబ్రాయంత అరసి చూచును గాని
ఇంటి వైశాల్యంబు నెఱుగ బోడు
వృక్షశాస్త్ర మెఱుగు సమృద్ధిగాను తులసి
ఉపయోగ మెఱుగడు మానవుండు."

ఈనాడు మానవుడు ఇలాంటి జీవితాన్ని గడుపుతున్నాడు. ఏది జీవితానికి ఆదర్శమో దానిని విడిచిపెడుతున్నాడు. అనవసరమైన వాటిల్లో ప్రవేశిస్తున్నాడు. నీ హృదయతత్త్వాన్ని మొదట నీవు గుర్తించు. హృదయమునకు మించిన స్థానం మరొకటి

లేదు. Manకు వుండవలసింది Kindness అది లేకపోతే వీడు రాక్షసుడే. రాక్షసులలో కూడా కొంత Kindness కనిపించేది. అయితే ఈనాటి మానవులలో ఆ Kindness ఏమాత్రం కనిపించటంలేదు.

మనకు మహత్తరమైన మానవ జన్మ లభించింది. ఈ జన్మ చాలా పవిత్రమైనటువంటిది. ఈమానవజన్మకు వున్న విలువ దేనికీ లేదు. మానవ జన్మకు వున్న స్థాయి మరేదేనికీ లేదు. ఇటువంటి మానవజన్మ ఎత్తి కూడా, దీనిని ఎంత నిరర్థకం చేసుకుంటున్నాం?

మీ జీవితమంతా ప్రేమకోసమే ధారపోయండి. ప్రేమతోనే జీవించండి. ఆనందాన్ని అనుభవించండి. ఆనందాన్ని పంచండి. నేను ఎల్లప్పుడూ ఆనందంగానే ఉంటాను. మీరు కూడా ఆనందంగానే ఉండండి. ఈ ఆనందం ఏ సాధనల ద్వారా లభించదు. ఒక్క దైవ ప్రేమ ద్వారానే లభిస్తుంది. కనుక ప్రేమ చేతనే భగవంతుని ధ్యానించి, పూజించి, ఆరాధించి, ఈ ప్రేమతత్త్వాన్ని మనం పొందటానికి ప్రయత్నించాలి. నీవు కూడా ప్రేమ స్వరూపుడివే అయినప్పటికినీ, నిజతత్త్వాన్ని నీవు గుర్తించేంతవరకు ఈ మార్గాలు అనుసరించవలసిందే, ఈ సాధనలు చేయవలసిందే.

ప్రేమస్వరూపులారా!

సత్సంగాన్ని చేరండి! సత్ప్రవర్తనలో మునగండి! సచ్చింతన సల్పండి! సన్మార్గంలో ఉండండి! సర్వేశ్వరునికి ప్రియులు కాండి!

*(ది. 28-9-1998న ప్రశాంతి నిలయంలో నవరాత్రుల సందర్భమున భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి)*



సేవ వలన అహంకార రాహిత్యము, ఆనంద ప్రాప్తి లభించును. సేవాతత్త్వమే మానవుని అహంకారమును దూరము చేయు యంత్రము, తంత్రము, మంత్రము. సేవ యనగా మానవ సేవ, పీడిత ప్రజల సముద్ధరణ. "మానవ సేవయే మాధవ సేవ గదా!" - శ్రీ సత్యసాయిబాబా

త్వరపడండి ! త్వరపడండి !

**పోషకులుగా రూ. 1116/-**

శ్రీవాణికి పంపినవారికి ఈ క్రింది పుస్తకములు కూడా **ఉచితంగా పంపబడును.** **దంపతుల ఫోటోలు శ్రీవాణిలో ముద్రించ బడును.** ప్రతినెలా శ్రీవాణి క్రమం తప్పకుండా పంపబడును.

| | | |
|---|---|---|
| 1. ప్రేమజ్యోతి | - | రు. 45-00 |
| 2. అమృతవాణి | - | రు. 10-00 |
| 3. శ్రీ సత్యసాయి శతకము | - | రు. 12-00 |
| 4. ప్రశ్నోత్తరమణి రత్నమాల | - | రు. 10-00 |
| 5. రామాయణ పాత్రలు | - | రు. 6-00 |
| 6. కనీస విజ్ఞానము | - | రు. 5-00 |
| | | రు. 88-00 |
| రిజిష్టర్ పోస్టు ఖర్చులు : | - | రు. 12-00 |
| మొత్తం: | - | రు.100-00 |

ముఖ్య గమనిక:

✪ **రు. 100/- లు మనియార్డర్ ద్వారా విడిగా పంపిన వారికి కూడా పై పుస్తకములు రిజిష్టర్ పోస్టు ద్వారా పంపబడును.**

✪ **రు. 1,116/- లు పంపేవారు శ్రీవాణి పేర డి.డి. తీయించి పంపగలరు.**

**చిరునామా**

**మేనేజర్**
**'శ్రీవాణి' మాసపత్రిక**
**24-52, రామానాయుడు పేట,**
**మచిలీపట్నం - 521 001.**

సింహావలోకనం

# సత్యరూపుడైన ఆతని చూడుడెపుడు

కొమరగిరి శ్యామ్‌ప్రసాద్

శ్రీమన్నారాయణ, శ్రీమన్నారాయణ
శ్రీమన్నారాయణ నీ పాదమే శరణు.....

అంటూ భూపాలరాగంలో భగవంతుని కీర్తిస్తూ ఆబాల గోపాలాన్ని అలరిస్తూ, ప్రత్యూష పవనాలను ఆస్వాదిస్తూ దినచర్యను ఆరంభించేవారు మన పూర్వీకులు. భారతదేశం వేదాలకు పట్టుగొమ్మ. భారతదేశం సంగీత సాహిత్య సత్ సంప్రదాయాలకు పుట్టినిల్లు. భారతదేశం నైతిక, ధార్మిక, ఆధ్యాత్మికతలకు మూలబిందువు. కాని నేటి భారతావనిని అవలోకిస్తే... నిద్దుర నుండి లేవగానే శ్రీమన్నారాయణునికి నమస్కారం పెట్టుకోమని, దైవ ప్రార్థన చేసుకోమని చెప్పే పెద్దలు కానరావడంలేదు. పెద్దలు చెప్పినా పిల్లలు వినిపించుకొనే పరిస్థితులలో లేరు. స్టార్ టి.వి. మోతలు, కుక్కర్ల కూతలు, బస్సులకై పరుగులతో దినచర్య ఆరంభం అవుతోంది. సతమత మవుతున్న సమస్యలను సవాళ్ళను ఎదుర్కోవాలనే ఆరాటం, జీవితపు పరుగులో ముందుకు పరిగెత్తాలనే పోరాటం ప్రారంభం ఉదయాన్నుంచే.

పరుగుజీవితమ్ము పరిపాటి కలిలోన
పరుగులిడకయున్న పనులు చెడును
బస్సులకై పరుగు బయోస్కోపునకై పరుగు
పరుగులిడకయున్న పనులు చెడును
పదవులకై పరుగు, పగదీర్చుకొనగ పరుగు
పరుగులిడకయున్న పనులు చెడును
ఆఫీసుకై పరుగు, ఆర్థికమునకై పరుగు
పరుగులిడకయున్న పనులు చెడును.

ఈ పరుగులో ముందుకు సాగాలి అన్న భావంతో, కోర్కెల సుడిగుండంలో కొట్టుమిట్టాడుతూ అంతరంగంలోని ఆశలను అధిగమించలేక, లౌకిక వస్తువులకై వెంపర్లాడుతూ వ్యక్తి తన యొక్క విలువలను కోల్పోవుతున్నాడు. విజ్ఞానశాస్త్రంలో, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంలో అత్యున్నత శిఖరాలను అధిరోహించానని విఱ్ఱవీగుతున్న మానవుడు నైతికంగా ధార్మికంగా అధః పతన మవుతున్నాననే విషయాన్ని విస్మరిస్తున్నాడు. ఈ పతనం వ్యక్తి మానసిక స్థితిని బలహీనపరుస్తున్నది. తద్వారా సమాజంలో అశాంతికి కారణమౌతుంది. వ్యక్తులలో చిత్తశుద్ధి లోపించడానికి కారణం నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక చింతనలు లేకపోవడమే.

యాంత్రిక జీవనం మానవునిలో నిగూఢమైన విలువలను తెలుసుకునే వ్యవధి లేకుండా చేస్తున్నది. మంచి చెడ్డల విచక్షణ గాని, ధార్మిక చింతనపట్ల ఆసక్తిగాని, దైవం యెడల విశ్వాసాన్ని గాని, మానవత్వంపై సదభిప్రాయాన్ని గాన్ని పూర్తిగా దూరం చేస్తున్నది. ఈ మరుగుబడిన మానవత్వంతో, పతనమైన ప్రేమతత్త్వంతో, దానవత్వంతో, పాశవికమైన పశుత్వంతో మానవుడు అనుభవిస్తున్నది ఏమిటి? దీనివలన ఆనందిస్తున్నది ఏమిటి?..... ఒక్కసారి సింహావలోకనం చేసుకొంటే యావద్భారతజాతికి ప్రశ్న ప్రశ్నగానే మిగులుతుంది.

"దేశమా ఇంకెప్పుడమ్మా దాస్యశృంఖలాల ఛేదనం" అంటూ అహర్నిశలు విశ్రమింపక తమ తుది రక్తపు బొట్టు వరకు పోరాడి అశువులు బాసిన మహావీరుల, త్యాగధనుల మాటలు ఇప్పుడెవరికీ జ్ఞప్తికి రావడం లేదు. "లేవండి! మేల్కొనండి! లక్ష్యము సాధించువరకు విశ్రమించకండి!" అని యావత్ జగతిని జాగృతం చేసిన నరేంద్రుని (వివేకానందుని) స్ఫూర్తిని మరచిపోతున్నారు. శాంతి అహింసల ద్వారా స్వాతంత్ర్యాన్ని సముపార్జింప చేసి అహింసాయుత మార్గాన్ని అందించి ఆదర్శవంతుడైన గాంధీ మాటలు చరిత్రకే పరిమితమవుతున్నాయి. ఆది శంకరులు, రామకృష్ణ పరమహంస, అరవిందఘోష్, రమణ మహర్షి వంటి మహనీయులు వరించి వివరించిన ధార్మిక, ఆధ్యాత్మిక ప్రబోధాలు పుస్తకాలకు పరిమితమై పుక్కిటి పురాణాలుగా మారుతున్నాయి. అయితే అల్లకల్లోలమైన

ఈ సమాజాన్ని ఆదుకునేవారులేరా? భ్రష్టుపట్టిన తుచ్ఛ భావాలను బాగుపరచేవారులేరా? పతనమైన ప్రేమతత్వాన్ని పునః ప్రతిష్టించేవారు లేరా? మానవునిలో మానవత్వాన్ని అధిష్టించి, మాధవత్వాన్ని నిరూపించి, ప్రేమతత్వాన్ని ప్రతిష్టించి నైతిక, ధార్మిక, ఆధ్యాత్మికతలకు పునర్జీవనాన్ని ప్రసాదించేవారు లేరా? ఉన్నారు.. ఉన్నారు. సత్యమే ప్రచారముగా, ధర్మమే శ్వాసగా, శాంతియే ఆభరణముగా, ప్రేమయే ఆయుధముగా, అహింసయే ఆదర్శంగా చేకొని అవతరించిన ప్రేమమూర్తి మనకు సమకాలీనులై మన మధ్యనే ఉన్నారు.

ఎవ్వాని పాదస్పర్శచేత రాతి నాతిగా మారిందో, ఎవ్వాని స్పర్శ చేత అయితే కురూపి అయిన కుబ్జ సుందర స్త్రీగా మారిందో, ఎవ్వాని ప్రబోధల కయితే భ్రమించిన మనస్సును, చలించిన దృష్టిని మార్చుకుని సర్వస్వాన్ని విడనాడి పార్థుడు కార్యోన్ముఖు డైనాడో ఎవ్వాని అవతరణ వల్లనైతే కృత, త్రేతా, ద్వాపర యుగాలలో పుడమి పునీతురాలై దుష్టశిక్షణ, శిష్టరక్షణ జరిగి జగతి నుద్ధరింపబడిందో ఆయనే "సంభవామి యుగే యుగే" ఈ రోజున, ఈ కలియుగంలో, ఈ అణుయుగంలో, ఈ యాంత్రిక యుగంలో మానవాకారాన్ని దాల్చి పుడమిపై అవతరించిన ప్రేమమూర్తి, దివ్యమంగళదీప్తి "శ్రీ సత్యసాయి".

యావత్ ప్రపంచానికి తాను జన్మించిన పుట్టపర్తిని ఒక ఆధ్యాత్మిక కేంద్రబిందువుగా మార్చుకొని తన యొక్క ఆచరణ ద్వారా ప్రచారాన్ని సల్పి, ప్రబోధల ద్వారా ప్రజలను ప్రభావితుల్ని చేసి, సత్య - ధర్మ - శాంతి- ప్రేమ - అహింసల ద్వారా మానవులలో మాధవత్వాన్ని, ప్రేమ తత్వాన్ని మూర్తీభవింపచేసే ఒక మహోద్యమానికి ఆద్యుడు శ్రీ సత్యసాయి. ఇది సామాన్యమైన ఉద్యమం కాదు. ఇది లౌకికమైన ఉద్యమమూ కాదు. సత్యమును చూపిస్తూ, ధర్మమును చేయిస్తూ, శాంతిని అనుభవింప చేస్తూ, ప్రేమను అందిస్తూ, అహింసను ఆచరింప చేస్తున్న వాస్తవ సనాతన మహోద్యమం.

మొక్కై వంగనిది మ్రానై వంగునా అన్నట్లు చిన్ననాటి నుండే ఆధ్యాత్మిక చింతన ఆవశ్యకమని, ఆధ్యాత్మిక విద్య అవసరమని నేటి బాలబాలికలే రేపటి నవసమాజ నిర్మాణానికి, సమ సమాజ నిర్మాణానికి కారకులనే ఉద్దేశ్యంతో కె.జి. నుండి పి.జి. వరకు ఉచిత విద్యను అందిస్తున్నారు శ్రీ సత్యసాయి.

*"చదువులన్నియు చదివి చాల వివేకి అయి*
*మదిని తన్నెరుగడు మందమతుడు*
*ఎంత చదువు చదివి ఎంత విన్ననుగాని*
*హీనుడవగుణంబు మానలేడు*
*తరచి చదువు చదువ తర్క వాదమె గాని*
*పూర్ణ జ్ఞానంబునెపుడు పొందలేడు*
*చదివి చదివి చదివి చావంగ నేటికి*
*చావులేని చదువు చదువ వలయు"*

అట్టి చావులేని చదువుని, చదువవలసిన చదువును గరపటం ద్వారా విద్యార్థులలో చిన్ననాటి నుండే ధార్మిక, ఆధ్యాత్మిక చింతనల పట్ల ఒక మంచి అవగాహన ఏర్పడుతుంది. శ్రీ సత్యసాయి విద్యాసంస్థల లోని విద్యార్థులు వారి విద్యాభ్యాసానంతరం సమాజం లో మంచి సేవలను, ఆదర్శవంతమైన సేవలను అందిస్తున్నారు. "మీరు నాకు ఏదైనా కృతజ్ఞతను చూపదలచుకుంటే మీరు నేర్చిన విద్యను, మీరు తెలుసుకున్న సత్యధర్మములను సమాజంలో ప్రవేశ పెట్టండి. ఆదర్శ వ్యక్తులుగా మంచి పేరు తెచ్చుకోండి. అదే మీరు నాయందు చూపించవలసిన కృతజ్ఞత" అంటున్నారు శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయ ఛాన్సలర్ భగవాన్ శ్రీసాయి. విద్యార్థుల ద్వారా వారు సమాజాన్ని ఎంతవరకు ప్రభావితం చేస్తున్నారో ఒక్క తూరి మనం ఆలోచిస్తే వాస్తవం గోచరిస్తుంది.

**We want that Education.**
**By which Character is Formed**
**By which Strength of Mind is Increased**
**By which The Intellect is Expanded**
**By which One can Stand on one's own feet.**

అన్న వివేకానందుని భావాలకు వాస్తవిక రూపం శ్రీ సత్యసాయి ఉన్నత విద్యాసంస్థలలో మనకు గోచరిస్తుంది.

అధికార వ్యామోహం చేత, కల్లబొల్లి మాటల చేత ప్రజలకు సేవలు చేస్తామని శుష్కవాగ్దానాలు చేసే నేటి

నాయకులకు, ప్రజలకు మేము ఎనలేని సేవలు చేస్తున్నామని ప్రచారాలు సల్పే ప్రభుత్వాలకు దీటుగా సేవకు నిర్వచనం ఇదే అన్న విధంగా యావత్ ప్రపంచంలోను శ్రీ సత్యసాయి సేవాసంస్థలు తమ సేవ లను అందిస్తున్నాయి. ఈ సంస్థలద్వారా మానవాళికి అమూల్యమైన, అద్వితీయమైన, నిస్వార్ధమైన సేవలను అందిస్తున్నారు.

*"చెప్పుట సులభంబు చేయుట కష్టంబు,*
*ధాతకైన వాని తాతకైన"*

అన్నట్లు తాను చేయకుండా పదిమందికి సేవలు చేయాలని చెప్పే ఒట్టి మాటల వాడు కాదు ఈ సాయి. సేవలు ఇలా చేయాలని చెప్పి చేసి చూపించి యావత్ ప్రపంచానికి ఆదర్శాన్ని అందిస్తున్నారు ఆయన.

రోగం వస్తే డబ్బులేకుండా కనీసం రంగునీళ్ళు అయినా పోయని ఈ సభ్య సమాజంలో సుమారు 300 కోట్ల రూపాయలు వెచ్చించి అత్యాధునికమైన ఒక వైద్యాలయాన్ని స్థాపించి తాడిత, పీడిత ప్రజలకు ఒక ఆశాదీపాన్ని వెలిగించి, ఎన్నో లక్షలు వ్యయం చేస్తే గాని నయంగాని రోగాలను నయాపైసా ఖర్చు లేకుండా ప్రేమతో నయం చేస్తున్నారు. ఇది అద్భుతాలలో కెల్లా అత్యద్భుతం. ఇటువంటి నిస్వార్ధ సేవలను అందించే అత్యాధునిక వైద్యాలయం ప్రపంచంలో మనకు మరెక్కడా కానరాదు. స్వామి యొక్క ప్రభావం చేత ప్రపంచంలో ఎక్కడెక్కడో ఉన్న సుశిక్షితులు, నిష్ణాతులు అయిన డాక్టర్లు కొన్ని నెలల తరబడి అక్కడే ఉండి విశిష్టమైన వారి సేవలను అందిస్తున్నారు. మరికొందరు స్వామి సన్నిధిలోనే స్థిరపడి సేవలు చేస్తూ తమ శేషజీవితాన్ని ఆనందమయం చేసుకుంటున్నారు.

కరువు విలయతాండవం చేస్తూ, కనీసం మంచి నీరైనా త్రాగటానికి నోచుకోనక మురుగు నీటిని వడగట్టుకుని త్రాగే నిరాశ్రయులను చూచి చలించేవారు లేరు. చలించినా చేయి అందించే వారు లేరు. అట్టి రాయలసీమ వాసులకు తన యావత్ ఆస్థిని తాకట్టు పెట్టి కొన్ని వందల గ్రామాలకు కోట్ల రూపాయలు వెచ్చించి, కేవలం పండ్రెండు మాసాల లోపు "శ్రీ సత్యసాయి సుజల మంచినీటి పథకము"ను అందించిన మహాపురుషుడు ఆయన. త్యాగం అంటే ఇదే. సేవ అంటే ఇదే. మానవత్వం అంటే ఇదే. ప్రేమతత్త్వం అంటే ఇదే. దివ్యత్వం అంటే మరేదో కాదు ఇదే అని నిరూపించిన అద్భుతమూర్తి /శ్రీ సత్యసాయి.

ఒకానొక రోజుల్లో త్యాగరాజు విచారిస్తూ పచ్చాడు. తనయొక్క కష్టాలకు కలత చెందాడు. రామా! నా భక్తి లోపమా, నీ శక్తి లోపమా? ఈ కష్టాలకి కారణం ఏమిటి? నీ శక్తి లోపమే ఈనా కష్టాలు అని తీర్మానించాడు. కాలం గడిచింది. నిజం తెలుసుకున్నాడు. రాముని పాదాల చెంతకు వెళ్ళి స్వామీ! అజ్ఞానంతో నిన్ను దూషించాను. నా కష్టాలకు నేనే కారణం, నా భక్తి లోపమే కారణం. నీ శక్తి సామాన్యమైనది కాదు అని బాధపడతాడు. అప్పుడంటాడు.

*కపి వారధి దాటునా, కలికి రోట గట్టున*
*లక్ష్మీ దేవి వలచునా... లక్ష్మణుండు కొలచునా*
*సూక్ష్మబుద్ధిగల భరతుడు చూచి చూచి మ్రొక్కునా*
*అబ్బ రామ శక్తి ఎంతో గొప్పరా!*

స్వామీ! ఏ శక్తి లేకపోతే వానరులు, అల్పులు అంత వారధిని నిర్మించారు? ఏ శక్తి లేకపోతే సాక్షాత్ లక్ష్మీదేవి నీ పాదాలను చేరుతుంది? ఏ శక్తి లేకపోతే లక్ష్మణుడు నిన్ను ఆశ్రయించాడు? ఏ శక్తి లేకపోతే జ్ఞాని, సూక్ష్మగ్రాహి అయిన భరతుడు నీ పాదాలు పట్టాడు? రామా! నీ శక్తి గొప్పది. నా భక్తి లోపమే నా కష్టాలకు కారణం అని అన్నాడు. అదే విధముగా ఏ శక్తి లేకపోతే సత్యసాయి ఇన్ని కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు? ఏ శక్తి లేకపోతే కుగ్రామమైన పుట్టపర్తిని ప్రపంచ ఆధ్యాత్మిక కేంద్రంగా మార్చారు.? ఏ శక్తి లేకపోతే విశ్వవిద్యాలయాన్ని, అత్యాధునిక వైద్యాలయాన్ని ఏర్పరిచారు? ఏ శక్తి లేకపోతే సంకల్పం మాత్రము చేతనే ఎన్నెన్నో కార్యక్రమాలను అబ్బుర పరచే విధంగా నిర్వహిస్తున్నారు? ఏ శక్తి లేకపోతే పండితులు, శాస్త్రవేత్తలు దేశ విదేశాలనుండి స్వామి చెంతకు చేరుతున్నారు? ఏ శక్తి లేకపోతే భోగాలాలస జీవితానికి స్వస్తి చెప్పి స్వామి చూపిన మార్గాన్ని చేపట్టి ఆయనకు పాదాక్రాంతులవుతున్నారు?

**(తరువాయి 44 పేజీలో)**

నవరాత్రుల సందేశం-5

# అన్నమాట తప్పను ! ఇచ్చిన వాగ్దానం నెరవేర్చుకుంటాను !!

భగవాన్ సాయి ప్రతిజ్ఞ

"పునర్విత్తం పునర్ మిత్రం
పునర్ భార్యా పునర్ యశః
యావత్ సర్వం పునర్ లభ్యం
న శరీరం పునః పునః"

ప్రేమస్వరూపులారా!

ధనమును కోల్పోయిన ఏ విధమైన ప్రయత్నమైననూ చేసి తిరిగి ధనమును సంపాదించుకొనవచ్చును. మిత్రుడు మనల్ని వదిలిపోయినప్పుడు, మరొక మిత్రుని సంపాదించుకొని మిత్రత్వాన్ని అభివృద్ధి పరచుకోవచ్చును. భార్య మరణించిన, మరో వివాహం చేసుకొని తాను జీవించవచ్చును. భూమిని కోల్పోయిన, తిరిగి సంపాదించుకోవచ్చును. గడిచిపోయినవన్నీ తిరిగి మనకు లభ్యం కావచ్చును. శరీరమును కోల్పోయినచో తిరిగి దానిని సంపాదించుకోలేము. కనుక సమస్త సాధనలకు, సమస్త ప్రయత్నములకు, సమస్త విజయములకు ఈ దేహమే ప్రధానమైనదని మానవుడు విశ్వసించాలి. మానవ శరీరం ఎంతో ఉత్తమమైనది. అనంత జీవరాసులలో మానవత్వమనేది అత్యంత ఉత్కృష్టమైనటువంటిది. ఇట్టి సౌజన్యమైన, సౌశీల్యమైన మానవ జన్మను ధరించటమనేది ఒక గొప్ప అదృష్టం.

ఈ శరీరంలో ఒక విచిత్రమైన మనసు ఉంది. ఇది గాలికంటే, కాంతి కంటే వేగంగా కదిలిపోతుంటుంది. మనసుకు మరణం లేదు, మనసుకు వయసు లేదు, మనసుకు చింత లేదు, మనసుకు విచారం లేదు, మనసుకు ఆనందమూ లేదు. ఇట్టి మనస్తత్వాన్ని మానవుడు గుర్తించుకొనినప్పుడే, తన తత్వాన్ని తాను గుర్తించుకొనినవాడవుతాడు.

పంచభూతముల యొక్క ఏకత్వాన్ని గుర్తించినప్పుడే మానవత్వాన్ని మనం సార్థకం గావించుకున్నవారమవుతాం. ఈనాడు మనం చేయవలసిన సాధనలు ఏమిటి? శరీరమును, మనస్సును, వాక్కును పరిశుద్ధం గావించుకోవాలి. ఈ దేహమును మనం ఏవిధంగా పరిశుద్ధం గావించుకోవాలి? నీరు, సోపుతో పరిశుభ్రం చేసుకోవటం కాదు. ఇది కేవలం భౌతికమైన మార్గం మాత్రమే. కాని నివృత్తి మార్గమునందు దీని పరిశుద్ధత మరో రీతిగా ఉంటుంది. సత్సంకల్పములచేత, సద్భావముల చేత, సత్కర్మలచేత, సదాచారముల చేత, దేహమును మనం పరిశుద్ధం గావించుకోవాలి. ఇదియే నివృత్తి మార్గంలో పరిశుద్ధం చేయుటం. ఏ పని చేసినప్పటికినీ, పవిత్రమైన భావంతో చేయాలి. ఈ శరీరమును పవిత్రమైన మార్గంలో ప్రవేశపెట్టాలి. పరిశుద్ధమైన కర్మలచేత ఈ కాయమును పరిశుద్ధం చేయాలి.

ఇక మనసును ఏ విధమైన మార్గంలో పరిశుద్ధం చేయాలి? "చిత్తస్య శుద్ధయే కర్మః" ఇంద్రియ నిగ్రహం చేత మనసును పరిశుభ్రం చేసుకోవాలి. ఈ దశేంద్రియములను మనం పవిత్రమైన మార్గంలో ప్రవేశపెట్టాలి.

See No Evil See What is Good
Hear No Evil Hear What is Good
Talk No Evil Talk What is Good
Think No Evil Think What is Good
Do No Evil Do What is Good
This is the Way to God

ఇంద్రియములను పరిశుద్ధం గావించాలంటే, ఇంద్రియములను పరిశుద్ధమైన కర్మలలో ప్రవేశపెట్టాలి. ఇంద్రియ పరిశుద్ధమే నిజమైన శరీరపరిశుద్ధము. ఇంద్రియములకు Master మనస్సు. ఈ Master ను పరిశుద్ధం చేయాలంటే మొట్టమొదట ఇంద్రియములు పరిశుద్ధంగా ఉండాలి.

ఇక వాక్కును ఏవిధంగా పరిశుద్ధం చేయాలి? సత్యవాక్కు చేత పరిశుద్ధం చేయాలి. ధర్మకార్యముల చేత పరిశుద్ధం చేయాలి. ప్రేమతత్త్వంచేత పరిశుద్ధం

చేయాలి. సత్యము, ధర్మము, ప్రేమ, శాంతి - ఈ నాల్గు మార్గముల చేతనే మన వాక్కును పరిశుద్ధం చేసుకోవాలి. శరీరం పుట్టిన తక్షణమే మానవునికి మొట్టమొదట వచ్చేది 'అహం' ఈ 'అహం' అనేటటువంటిదే ఆత్మ స్వరూపము. 'అహం' అనేటటువంటిది ఆత్మకు కుమారుడు. అహంనుంచి మానవుని మనసు పుట్టింది. ఈ మనసు ఆత్మకు Grand Son (మనుమడు). ఈ మనసు నుండి పుట్టినటువంటిదే 'వాక్కు'. ఈ వాక్కు ఆత్మకు Great Grand Son (మునిమనుమడు). ఆత్మ కుమారుడు అహం, అహం కుమారుడు మనస్సు, మనస్సు కుమారుడు వాక్కు. కాబట్టి ఆత్మ, అహం, మనస్సు, వాక్కు ఈ నల్గురు ఒకే కుటుంబానికి చెందినవారు. వాక్కు అనేటటువంటిది దైవ కుటుంబానికి చెందినదనే విశ్వాసాన్ని మనం దృఢ పరచుకోవాలి. మనస్సు అనేది భగవంతునికి (ఆత్మ) మనుమడు అనే విశ్వాసాన్ని పెంచుకోవాలి. 'నేను' అనేటటువంటి 'అహం' భగవంతుని (ఆత్మ) ప్రేమ పుత్రుడుగా మనం విశ్వసించాలి. కనుక ఈ ఆత్మ కుమారుడు 'అహం' మనుమడు, మునిమనుమడు ఈ మనోవాక్కులు. ఈ విధమైన సన్నిహిత సంబంధ బాంధవ్యాలను మనం అభివృద్ధి పరచుకున్నప్పుడే మానవుని యొక్క ఇంద్రియములు, మానవుని యొక్క జీవితం, మానవుని యొక్క నడత పవిత్రమైన జీవితాన్ని గడుపుతుంది.

ఈనాడు మానవుడు తన ఇంద్రియములకు పూర్తిగ వశుడైపోతున్నాడు. మనసును ఏవిధంగా అరికట్టాలనే విధి విధానమును కూడా తెలుసుకోలేక పోతున్నాడు. కనుకనే క్షణ క్షణమునకు మానవుడు భయభ్రాంతులతో జీవిస్తున్నాడు. ఈ భయం ఎక్కడ నుంచి వస్తున్నది? దోషములు వుండినప్పుడే భయం మనలో ప్రవేశిస్తుంది. దిన దినమూ పెరిగిపోయే ఈ విజ్ఞానం చేత మానవత్వం పూర్తిగా మాలిన్యమైపోతున్నది. మానవుడు కడపటికి కృత్రిమ జీవితమును అనుభవిస్తున్నాడు. అన్నీ మాలిన్యమైపోతున్నాయి, కలుషితమైపోతున్నాయి. పీల్చే గాలి, తినే తిండి అంతా కలుషితమే. దీనివలన మనసు కూడా మాలిన్యమైపోతున్నది. మానవ జీవితమే మాలిన్యమైపోతున్నది. సైన్సు పెరిగిపోతున్నదనుకుంటున్నాం. ఎంత సైన్సు పెరిగిపోతున్నదో, 'సెన్స్' అంత తరిగి పోతున్నది. మానవత్వంలో ఉన్న దైవత్వం తరిగిపోతున్నది. మానవ జీవితమే కృత్రిమమైనదిగా తయారైంది. తల్లీ పిల్లల [illegible]లు చూస్తుంటే, అసలు వారు ఆ తల్లి పిల్లలేనా? అనిపిస్తుంటుంది. తల్లి పిల్లల మధ్య వుండవలసిన ఆత్మీయత, ప్రేమలు మచ్చుకైనా ఈనాడు కనిపించటంలేదు. ఈ విధమైన జీవితాన్ని గడుపుతున్నారు ఈనాటి విద్యార్థులు, విద్యార్థినులు. ఇంద్రియ నిగ్రహం అనేది వారియందు ఏమాత్రం కనిపించటంలేదు. పశువులైనా కొంత వరకు ఇంద్రియ నిగ్రహానికి ప్రయత్నిస్తున్నాయిగాని మానవుడు ఏమాత్రం ప్రయత్నం చేయటం లేదు. పశుపక్ష్యాదులకు అయినా ఒక Season ఒక Reason ఉంటున్నదిగాని ఆధునిక విద్యార్థులకుగాని, విద్యార్థినులకుగాని, No Season, No Reason. కారణమేమిటి? ఈనాటి చదువుల ఫలితమే. ఆధునిక చదువులు వద్దని నేను చెప్పటం లేదు. చదువులతో పాటు సంస్కారమును కూడా పెంచుకోవాలి. చదువులు....చదువులు.... ఏమిటి ఈ చదువులు. కేవలం గ్రంథ పరిచయమే చదువా?

**"చదివి వ్రాయ నేర్చిన వారంతా విద్యార్థులేనా?**
**కాలేజీ డిగ్రీలు పొంద విద్యావంతుడగునా?**
**సుజ్ఞానము, సుకృతము లేని విద్యలు సద్విద్యలగునా?**
**బ్రతుకుటకే విద్యయన్న బ్రతుకలేవె పశుపక్షులు?"**

కనుక మనం జీవించటానికోసం చదవటం కాదు. జీవిత పరమావధిని పెంచుకునే నిమిత్తమై మనం చదవాలి. ఈ పరమావధి తత్త్వాన్ని తెలుసుకున్నప్పుడే ఈ మానవత్వం సార్థకమవుతుంది. కేవలం Bookish Knowledge వలననే ప్రయోజనంలేదు. Practical Knowledge లో మనం ప్రయాణం చేయాలి. ఇదియే మనకు నిజమైన మార్గము. దీనికి హృదయ పరిశీలన కావాలి.

ఒక్క చిన్న ఉదాహరణ. స్వామి యొక్క తత్త్వము మీకు అర్థంకావాలి. నేనొక్కపర్యాయం 'నీవు

నా వాడవు! అన్న తరువాత, ఇంక ఆ మాట ఏనాటికి తప్పను. ఒక వేళ వాడు నాకు విరోధి అయినప్పటికినీ నేను వాడిని మరువను. నేను అంటే వాడు ద్వేషపడవచ్చునుగాని, అతనంటే నాకు ద్వేషం లేదు. నాకు ఎవ్వరూ ఈ జగత్తులో ద్వేషులు లేరు. ఎవరూ నాకు అయిష్టమయినటు వంటి వారే లేరు. కనుక నేను యిచ్చిన వాగ్దానమును చక్కగా నిలబెట్టుకుంటుంటాను. నా నడక ముందుకేగాని వెనుకకు వేయను. వారిని రక్షించే నిమిత్తమై నేను ఎప్పుడూ ముందుకు వెళ్ళుతుంటాను. ఎలాంటి పరిస్థితులలోను నేను వెనుకంజ వేయను. ఎలాంటి పరిస్థితులలో కూడా స్వామి వాడు నావాడు అనుకుంటు నప్పటికినీ, అలాంటివారు కూడా అనేక కష్టములకు, నష్టములకు గురి అవుతుంటారు. తన వారైనప్పుడే వారికి ఎందుకు ఈ కష్టములు కలగాలి? వారు ఈ బాధలకు ఎందుకు గురి కావాలి? వారు ఎందుకు ఈ దుఃఖములలో మునిగి పోవాలని కొందరు ప్రశ్నించవచ్చును? ఇది నాది కాదు దోషము. నేను యిచ్చిన వాగ్దానమును నేను చక్కగా జరుపుకుంటున్నాను, చక్కగా నిర్వర్తిస్తున్నాను. అయితే ఈ బాధలు కలగటానికి కారణమేమిటి? తాము యిచ్చిన వాగ్దానమును నిలబెట్టుకోలేకపోవటమే ఈ బాధలకు మూలకారణం. తన వాగ్దానము నుంచి తాను తప్పి పోవటం వలన, తన పవిత్రతను తాను మార్చుకోవటం చేత, అపవిత్రతను అభివృద్ధి పరచుకోవటం చేత తాను ఈ కష్టములకు, దుఃఖములకు గురి అవుతున్నాడు. అంతేకాని, స్వామి యిచ్చిన వాగ్దానము ఏనాటికినీ కష్టములను అందించదు. కడపటి వరకునూ నేను వెంటనే, ఇంటనే, జంటనే ఉంటాను. ఇలాంటి సత్యమును అనేక మంది గుర్తించటానికి ప్రయత్నించటం లేదు. వారి కష్టములకు, నష్టములకు, దుఃఖములకు మూలకారణ మును గురించి విచారించటం లేదు. వారి హృదయ మార్పులే దీనికి మూలకారణం. వారి మనోచింతనలే దీనికి మూలకారణం. కృతజ్ఞత లేకుండా పోవటమే దీనికి మూలకారణం. "తల్లి కంటెను దైవంబె దగ్గర" అని కవి చెప్పాడు. తల్లి కంటె ఎంతో ప్రేమగా చూచుకుంటు న్నప్పటికినీ, వారు కృతజ్ఞతను చూపలేక పోతున్నారు.. నేను ఆ కృతజ్ఞత కోసం కూడా కాచుకొని కూచోటం లేదు. కాని నా Duty నేను చేసినప్పుడు నీ Duty నీవు చేయాలి. నీ స్థాయిలో నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించాలి. మానవత్వంలో ఇలాంటి దోషములు ఎన్నియో, మనకు తెలియకుండానే జరిగి పోతుంటాయి. కాని ఈ దోషములు తనవి అనే దానిని విశ్వసించ కుండా, దైవము వలననే మాకు ఈ దుఃఖములు దాపురించాయని భావిస్తుంటారు. దైవము ఇన్ని విధములైన వాగ్దానములు చేసి కూడా ఎందుకు దీని నుంచి తప్పిపోతున్నాడని భావిస్తుంటారు. దైవం ఏనాటికి తన వాగ్దానమును మార్చడు. తన వాక్కును ఏనాటికి వెనుకకు తీసుకోడు. ఏనాటికైనా తాను యిచ్చిన వాగ్దానమును సంరక్షించు కుంటూ ఇంటనే, జంటనే, వెంటనే ఉంటుంటాడు. కాని ఇట్టి సత్యమును మానవుడు గుర్తించుకోలేక పోతున్నాడు. ఈ భౌతికమైన, లౌకికమైన, ప్రాకృతమైన చింతనలో మునిగి, తద్వారా దైవముపైన ఈ విధములైన నెపములు వేస్తుంటాడు. దైవము ఏనాటికినీ, ఎవరికినీ ఏ కష్టములు, ఏ దుఃఖములు అందించడు. నీ కర్మల యొక్క ఫలితమే నీకు ఈ దుఃఖములను అందిస్తుంటుంది. నీ చర్యల యొక్క ఫలితమే నీకు ఈ దుఃఖములను అందిస్తుంటుంది. నీ నడతల యొక్క ఫలితమే నీకు ఈ దుఃఖములను అందిస్తుంటుంది. కాని అది ఎప్పుడు అనుభవిస్తావో, ఏవిధంగా అనుభవిస్తావో ఎవరికి తెలియదు. కాని ప్రతి కర్మకునూ ఒక విధమైన ప్రతిఫలం ఉంటుంది. ఇది అప్పటికప్పుడే జరుగవచ్చును. కొన్ని గంటల తరువాత జరుగవచ్చును. కొన్ని దినములలో జరుగవచ్చును. కొన్ని నెలలలో జరుగవచ్చును. కొన్ని జన్మలలో జరుగవచ్చును.

చిన్న ఉదాహరణ. పెన్సిల్ చెక్కుకుంటుంటే చేయి కోసుకుంటుంది. ఆ కర్మ జరిగిన తక్షణమే రక్తం వస్తుంది. నిచ్చెన ఎక్కుతుంటే కాలు జారవచ్చు, క్రిందపడవచ్చు, తక్షణమే ఎముక విరుగుతుంది. నిన్న జారటం ఈ రోజు విరగటం జరుగదు. జారి క్రింద పడిన తక్షణమే ఎముక విరుగుతుంది. ఒక విత్తనం నాటిన వెంటనే చెట్టు కాదు, కాయరాదు. కొన్ని దినాలకు మొక్క వస్తుంది. కొన్ని సంవత్సరాలకు పెరిగి చెట్టు అవుతుంది.

తరువాత కాయలు కాస్తుంది. తరువాత పండ్లు వస్తాయి. అన్నం తిన్న వెంటనే జీర్ణం కాదు. కొన్ని గంటలు సమయం తీసుకుంటుంది. ఈ జన్మలోనే కాకుండా మరో జన్మలో కూడా ఈ కర్మ ఫలం మనల్ని వెంటాడుతునే ఉంటుంది, దానిని అనుభవించక తప్పదు. మంచిగాని చెడ్డగాని ఫలమును అనుభవించక తప్పదు. తప్పునది కానప్పుడు దైవమును ఎందుకు చింతించాలి? దైవమును చింతించునది బాధ నివారణ కోసం కాదు. నీకు మనశ్శాంతి కోసం దైవమును ప్రార్థించు. ఆ శాంతి నీకు లభ్యమవుతే ఈ కష్టములు నీకు దూరమైపోతాయి.. నీ కర్మలు ఆచరించినప్పటికినీ, ఆ కర్మలు కూడానూ నిన్ను తప్పించివేస్తాయి. ఒక చిన్న ఉదాహరణ. ఒక మందు సీసా ఉన్నది. ఈ సీసాలో మాత్రలు ఉన్నాయి. అది 1997 సంవత్సరానికి Expire అయిపోయింది. కాని ఇప్పుడు 1998 సంవత్సరం ఆఖరులో ఉన్నాం. కాని ఆ సీసాలో ఆ మాత్రలు ఉన్నాయి. కాని ఆ మాత్రలకు ఏవిధమైన 'పవరు' ఉండదు. మందు ఉన్నది. కాని Expire అయిపోయింది. అదే రీతిగనే నీలో 'కర్మ' అనేటటువంటిది ఉన్నది. కాని దైవానుగ్రహం వలన అది Expire అయిపోతుంది. కనుక ఆ Expire కావటానికే నీ ప్రార్ధన అవసరం. ఆ కష్టములు నిన్ను అనుభవించకుండా చేయటానికే ఈ Expire అవుతుంది. కనుక దైవప్రార్ధన చేయటం వలన ఎన్నో విధములైన మేలు జరుగుతుంటుంది. ఆ ప్రార్ధన కూడనూ హృదయ పూర్వకంగా చేయాలి. నీ హృదయం భగవంతునికి స్థానం.. కాబట్టి నీ హృదయమునందున్నటువంటి భగవంతుని స్మరించు. నీ ఆనందం ఎక్కడనో లేదు. ఇది బయట చిక్కేది కాదు. అది నీలోనే ఉన్నది. బయట వెదికితే లభించేది కాదు. లోపలనే వెదుకు. నీ హృదయమునందే వెదికినప్పుడు నీ ఆనందం నీకు లభ్యమవుతుంది.

ప్రేమస్వరూపులారా!

మన కష్టములకు, నష్టములకు, దుఃఖములకు, విచారములకు భగవంతునిపై నిందమోపరాదు. ఎలాంటి పరిస్థితులందైనా భగవంతుణ్ణి ప్రార్థించడం మన కర్తవ్యం ఎంత వరకు? 'నేను జీవుడు, తాను దేవుడు అనేటటువంటి బేధము వుండేంతవరకూ ప్రార్థించాలి. నేనే అతడు, అతడే నేను అనేటటువంటి ఏకత్వం వచ్చినప్పుడు ఇక ప్రార్థించనవసరంలేదు. మనం లోపలికి పంపవలసింది ఒకటి, బయటకు పంపవలసింది మరొకటి. ఏది బయటకు పంపాలి? ఏది లోపలికి తీసుకోవాలి? ఈ సత్యాన్ని గుర్తించలేకపోతున్నాం. మన శ్వాసయందే ఈ సత్యము బోధించబడుతున్నది. సో2హం 'సో'ను లోపలకు తీసుకుంటున్నాం. 'హం'ను బయటకు పంపుతున్నాము. 'సో' అనగా అదే దైవత్వము. 'హం' అనగా అదే అహంకారం. అనగా దైవత్వమును లోపలకు తీసుకుంటున్నాం, అహంకారమును బయటకు పంపుతున్నాం. ఇదియే మన జీవితము యొక్క ప్రధానమైన సూత్రం. లోపలకు తీసుకోవలసింది ఆక్సిజన్, బయటకు వదలవలసింది కార్బన్‌డయాక్సైడ్ అదియే మనకు రాక్షసి, అదియే మన అహంకారం, అదియే మనయొక్క చెడ్డగుణము. చెడ్డగుణములను బయటకు పంపాలి. ప్రాణవాయువును లోపలికి తీసుకోవాలి. అదియే దైవత్వము. కాబట్టి ప్రాణమునే దైవముగా భావిస్తున్నారు. బొగ్గుపులుసు వాయువును బయటకు వదలకపోతే ఆరోగ్యమే పాడైపోతుంది. ప్రాణవాయువును లోపలికి తీసుకొనకపోతే ప్రాణానికే హాని ఏర్పడుతుంది. కనుక దైవత్వాన్ని లోపలికి తీసుకోవాలి, రాక్షసత్వాన్ని బయటకు పంపాలి.

ఈనాడు ఎక్కడ చూచినా స్వార్థం....స్వార్థం.... ఇది కేవలం స్వప్రయోజనమునకు సంబంధించినటువంటిదే. సొసైటీకి సంబంధించినటువంటిది కాదు. మనం సొసైటీ క్షేమాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. సర్వుల యందూ వుండినటువంటి దివ్య శక్తియొక్క తత్త్వాన్ని మనం గుర్తించాలి. ఇదే మహా దుర్గాదేవి. 'దుర్గ' అనగా ఏమిటి 'దుర్గము' అనగా ఎత్తైన గుట్ట అని అర్థం. పెద్ద గుట్ట భగవంతుని అనుగ్రహమే. ఆ అనుగ్రహమనే పర్వతంపైననే ఆ దివ్యత్వమనేది ఉంటున్నది. మన భారతీయ సంస్కృతియందు ఉత్తరాయణ కాలం ప్రారంభమైందంటారు. సూర్యుడు కూడా ఉత్తరదిశకే ప్రయాణం చేస్తుంటాడు. ఈ ఉత్తరదిశయందు హిమాలయ పర్వతములుంటున్నాయి. ఈ పర్వతములపైన

ఈశ్వరుడుంటున్నాడు. ఈశ్వరునివైపు సూర్యుడే ప్రయాణమై వెళ్లుతున్నాడు కాబట్టి, మన దృష్టిని కూడా ఈశ్వరునివైపు మరల్చాలి. ఈ కారణనిమిత్తమై భీష్ముడు కూడా 64 దినములు ఈ పవిత్ర ఉత్తరాయణకాలం కోసం కాచుకొని ఉన్నాడు. దీని అంతరార్థమేమిటి? ఈశ్వరుడు సర్వత్రా ఉన్నాడంటున్నారుగదా! ఒక్క హిమాలయాలలో మాత్రమే ఎందుకున్నాడు? దీనికి అంతరార్థం మన హృదయంలోనే ఉన్నది. ఉత్తరాయణమనగా ఏమిటి? ఇది హిమాలయం లేక హిమాచలం అంటారు. 'హిమము' అనగా మంచు (ఐస్) 'ఐస్' చల్లగా ఉంటుంది, తెల్లగా ఉంటుంది. అచలంగా ఉంటుంది. అచలంగా ఉండేది పర్వతము. హిమ + అచలం = హిమాచలము. 'హిమ' మనగా మన హృదయమే. పవిత్రమైనటువంటి హృదయమే హిమాచలము. ప్రశాంతమైన హృదయమే హిమాచలము. అది చల్లగా ఉంటుంది. పరిపూర్ణమైనటువంటి, పరిశుద్ధమైనటువంటి, ప్రశాంతమైనటువంటి, చలించనటువంటి యొక్క హృదయమే హిమాచలము. కనుక అక్కడ వుంటున్నాడు ఈశ్వరుడు. నీ దృష్టిని అంతర్ముఖం గావించుకొనిన అదియే హిమాచలం అయిపోతుంది. చలించేటటువంటి హృదయం హిమాచలం కాదు. మాలిన్యమైనటువంటి హృదయం హిమాచలం కాదు. ప్రశాంతమై, పవిత్రమై, నిర్మలమై, నిశ్చలమై, నిస్వార్థమై, స్థిరంగావుండినటువంటి హృదయమే హిమాచలము.

ఈనాడు కాలమును చాలామంది దుర్వినియోగం చేస్తున్నారు. నేను ఒక్క క్షణం కూడా వృథా (Waste) చేయను. "స్వామి అన్నం తినగానే పడుకుంటాడు" అని మీరనుకుంటారు. నాకు నిద్ర అంటే ఏమిటో తెలియదు. నేను నిద్రపోను. అందరి దగ్గరా తీసుకున్న జాబులలో, అవసరమైన కొన్నింటిని అప్పటికప్పుడే చూస్తాను. ఒక క్షణమైనా వృథా చేయను. అయితే నాకు కావాల్సింది ఏమీ లేదు. ఎటువంటి ఫలితాన్ని నేను ఆశించను. నాకోసం నేను ఏమీ చేసుకోను. ఏమి చేసినా ఇతరుల క్షేమం కోసమే చేస్తాను. నాకు స్వార్థమనేదే లేదు. నేనెప్పుడూ పరార్థంలోనే నా కాలాన్నంతా సార్థకం చేసుకుంటాను. ఎప్పుడూ ఇతరులకు ఇవ్వటమేగాని, పుచ్చుకోవటమనేదే లేదు. ఒక్క దానిని మాత్రమే పుచ్చుకుంటాను. అదే నిర్మలమైన ప్రేమ. ఆ ప్రేమ గలిగినటువంటివారికి ప్రాణమునైనా యిస్తాను. నేను ఆ విధంగా ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంటాను.

ఈ విషయం నరసింహమూర్తి చెప్పాడు. పోయినతూరి బృందావనంలో ఒకనాడు ఉన్నట్టుండి దేహాన్ని వదలిపెట్టాను. నరసింహమూర్తి, గంగాధరశెట్టి చాలా ఆశ్చర్యపడ్డారు. ఈ ఇద్దరు మాత్రమే లోపలికి వచ్చారు. చూచారు బాధపడుతున్నారు. గాభరా పడుతారేమోననే ఉద్దేశ్యంతో నేనే తెలివి తెచ్చుకొని చెప్పాను. భర్తలేని వనిత, ఇద్దరు పిల్లలున్నారు. ఆమె నిరంతరం స్వామి చింతన చేస్తుంటుంది. భర్తపోయిన తరువాత చిన్న ఉద్యోగం చేస్తూ పిల్లల్ని పోషించుకుంటున్నది. భర్తపోయిన వియోగ దుఃఖం, పిల్లల్ని పోషించుకోలేకపోవటం మరో దుఃఖం, వచ్చే ఆదాయం చాలక నిరంతరం బాధపడుతూ కూడా సాయిరాం.... సాయిరాం.... అంటూ జీవితం గడుపుతున్న సమయంలో ఆమెకు గుండెపోటు వచ్చింది. ఆమె మరణించిందని అందరూ భావించారు, కాని నేను పోతే ఆమె మరణిస్తుందా? మరణించదు. కాని ఆ గుండెపోటు ఆమె మరణానికే వచ్చింది. కాని అప్పుడు ఆమె Heart Attackను నేను తీసుకున్నాను. అప్పుడు 7 దినములు క్రిందకు రాలేదు, ఎక్కడికి పోలేదు. ఆమె సమయమంతా నేను గడుపుతూ వచ్చాను. ఆమె అనుభవించినదంతా నేను అనుభవించాను. ఆమెను ఆరోగ్యంగా పెట్టాను. ఆమె తరువాత మూడు దినములకు టెలిగ్రాం యిచ్చింది. 'స్వామీ! మీరు వచ్చారు. నన్ను రక్షించారు. నా బిడ్డలను రక్షించారు' అని యిచ్చింది. నేను, ఆమె జబ్బును తీసుకున్నట్లుగా ఆమెకు తెలియదు పాపం! వారం తరువాత పిల్లల్ని తీసుకొని ఆమె వచ్చింది.

ఈ విధంగా నిర్మలమైనటువంటి, పవిత్రమైనటువంటి భక్తితోవున్నవారికి ఏమైనా చేయటానికి నేను సిద్ధమే. కాని ఈనాడు అట్టి పవిత్రత ఎక్కడా కనిపించటంలేదు. కాని ఉన్నారు నూటికొక్కరో, కోటి కొక్కరో కనిపిస్తుంటారు.

"జగతియందు పుణ్య పురుషులు లేకున్న జగము లెట్లు వెలుగు పగలుగాను" భారతదేశంలో ఎంతోమంది పవిత్ర హృదయంగలవారున్నారు. ప్రపంచంలో కూడా ఉన్నారు. కనుక మంచివారులేరని చెప్పటానికి వీలులేదు. ఈ ఆధ్యాత్మిక మనేది ఒక్క భారతదేశంలోనే కాదు ప్రపంచమంతా ఉన్నది. ఈనాడు విదేశీయులు మన భగవద్గీతను కంఠస్థం చేస్తున్నారు. ఇటలీ ప్రెసిడెంటు బిడ్డ బ్రహ్మ సూత్రమంతా చెప్పి వేస్తుంది. రుద్రమంతా చెబుతుంది. అక్కడ 'Mother Sai' అనే పేరుతో 25 ఎకరముల స్థలములో ఒక పెద్ద ఆశ్రమాన్ని నిర్మించింది. స్వామి ఏనాటికైనా యిక్కడికి వస్తాడనే నమ్మకంతో పూర్ణచంద్రహాల్ లాంటి ఒక పెద్ద హాల్‌ను కూడా నిర్మించింది. కాన్వెంటు విద్యార్థులకు, వచ్చిపోయే అతిథులకు ఉండటానికి చాలా గదులను కట్టించింది. స్వామి వస్తే ఉండటానికి ప్రత్యేక వసతిని కూడా ఏర్పాటు చేసింది. అన్ని మాస్టర్ ప్లాన్ ప్రకారం ఆశ్రమాన్ని కట్టించింది. ఆమె చక్కగా విపులంగా స్పష్టంగా భగవద్గీత చెబుతుంది. మన ప్రైమరీ స్కూలులో జర్మన్ పిల్లలు చదువుతున్నారు. వారు ఎంతో చక్కగా వేదపారాయణ చేస్తారు! సుస్పష్టంగా చెబుతారు. కారణమేమిటి? చుట్టూ వుండే వాతావరణం ప్రభావం, సత్సంగ ప్రభావం అటువంటిది.

కనుక మీరు ఎక్కడికి వెళ్లినా సత్సంగంలో చేరండి. మీ హృదయాన్ని పవిత్రంగా నిర్మలం చేయండి. మీ మనస్సును పవిత్ర కర్మలచేత పరిశుద్ధంగావించండి. మీ వాక్కును సత్యంచేత, ప్రేమచేత, శాంతంచేత నింపండి. భజన, జపము, ధ్యానము, యోగము - ఇవన్నీ సత్కర్మలు, కాలమును పవిత్రం గావించుకొనేటటువంటి కర్మలు. కాని దైవానికి ప్రీతికరమైన కర్మలు మాత్రం కావు. అయితే దైవానికి ప్రీతికరమైన కర్మలు ఏమిటి? దేహమును పవిత్రమైన కర్మలలో ప్రవేశపెట్టాలి. మనసుతో పవిత్రమైన చింతన చేయాలి. వాక్కుతో నిర్మలమైనటువంటి, నిశ్చలమైనటువంటి, నిస్వార్థమైనటువంటి, సత్యమైనటువంటి, ప్రియమైనటువంటి పలుకులు పలకాలి. ఇవియే భగవత్ ప్రీతికరమైన పనులు. భగవంతుని ప్రీతికరంగా చేయాలంటే సత్యమును పలుకు. పరోపకార కర్మలు చేయి. నీ హృదయాన్ని నిర్మలమైన భావాలతో నింపుకో. దీనినే 'త్రికరణ శుద్ధి' అన్నారు. భావము, వాక్కు, కర్మ - ఈ మూడింటిని పవిత్రం చేయాలి. ఈ విధమైన సత్కర్మలచేత జీవితాన్ని సార్థకం చేసుకొని ఆదర్శవంతమైన జీవితాన్ని అందించాలని విద్యార్థులకు ప్రత్యేకంగా బోధిస్తున్నాను. కేవలం వాక్కులతో బోధించడమేకాదు. నీవు నడుచుకొని వారికి అందించాలి. నీవు చేసి వారికి చూపించాలి. అప్పుడే నీ జీవితానికి సార్థకత. ఎవరివద్దా నయాపైసా తీసుకోకుండా ఇక్కడ విద్యను బోధిస్తున్నాం. ఇక్కడ నేర్చుకున్న మంచి విషయాలు, మీ ప్రదేశాలకు వెళ్లి పదిమందికి పంచాలి. మన విద్యాలయమునకు మీరు తెలిపే నిజమైన కృతజ్ఞత అదే. మీ హృదయాలను ప్రేమతో నింపుకొని యిక్కడ నుంచి వెళ్లండి! ఆ ప్రేమను పదిమందికి పంచండి!

*(ది. 29-9-1998న ప్రశాంతి నిలయంలో నవరాత్రుల సందర్భమున భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి)*

#

"త్రేతాయుగంబున శ్రీరామచంద్రుడై
ఆ యయోధ్యా పురి నవతరించి
ద్వాపర యుగమున గోపాల కృష్ణుడై
ఆ మధురాపురి నవతరించి
శిష్టరక్షణకయి దుష్టుల దునుమాడి
ధర్మ సంస్థాపన ధరణినిల్పి
నట్లు, యీ కలియుగమందు మీరుదయించి
అందరి హృదయాల నలుముకొన్న
దుర్గుణంబులఁ బరిమార్చి నిర్గుణమును
నిర్వికారమునైయున్న నిశ్చలాత్మ
బోధనందరికందించు బోధ గురువు
లైన, శ్రీ సత్యసాయి! నిన్నభినుతింతు."

**- మేడేపల్లె కుళ్లాయప్ప చౌదరి.**

-- సేవా నిరతి --

# శ్రీ సత్యసాయి ప్రేమకుటీరం

వై. శ్రీనివాసరెడ్డి

భగవానుని 55వ జన్మదిన వేడుకలు మరియు శ్రీ సత్యసాయి సేవా సంస్థల మూడవ ప్రపంచ సమ్మేళనముల సందర్భమును పురస్కరించుకొని స్వామి ఆదేశానుసారము కర్నాటక రాష్ట్రములోని కోలారు జిల్లా, బాగేపల్లి వాస్తవ్యులైన (లేటు) శ్రీ అశ్వత్థ నారాయణరెడ్డి గారి సారధ్యములో సాయి సేవకులు బాగేపల్లిలో ఒక సేవా శిబిరమును నిర్వహించారు. ఈ ఉత్సవముల సందర్భముగా ఎక్కడెక్కడ నుండో ప్రశాంతి నిలయమునకు వచ్చు వేలాదిభక్తులకు అల్పాహారమిచ్చి, ఆతిధ్యమిచ్చి ఆదరించుట ఈ శిబిరము యొక్క ముఖ్యోద్దేశము. ఈ ప్రకారము 18 రోజులు ఈ సేవా శిబిరము స్వామి ఆశీస్సులతో జయప్రదంగా నడచింది.

ఈ శిబిరము నడచుచున్న సమయములో స్వామి జన్మదిన ఉత్సవాలలో పాలుపంచుకునేందుకు మద్రాసు నుండి శ్రీమతి పి. సుశీల మరియు శ్రీమతి అంజలీదేవి గార్ల సారధ్యములో కొంత మంది సంగీత కళాకారుల బృందం స్వామి సన్నిధికి బయలుదేరటం జరిగింది. వారి కారు బాగేపల్లి సమీపించినపుడు శిబిరములోని సాయిసేవకులు కొందరు ఆతిధ్యము నందుకొనమని అడిగే నిమిత్తమై కారు ఆపమని కోరారు. కాని వారు వీరిని సినీ అభిమానుల బృందమనుకొని, కారు ఆపకుండా పుట్టపర్తి వెళ్ళిపోయినారు. పర్తి చేరిన తర్వాత వారు స్వామి దర్శనమునకు వెళ్ళినపుడు స్వామి వారితో "బాగేపల్లిలో మీరు ఎందుకు ఆగలేదు. నేను ఇక్కడ కాదు బాగేపల్లి శిబిరంలో వున్నాను. మీరు తిరుగు ప్రయాణంలోనైనా తప్పనిసరిగా అక్కడ ఆగి, కొన్ని భజన కీర్తనలు పాడి ఆనందింపజేసి, వారి ప్రేమను అందుకొనవలసినది" అని మందలించారు. స్వామి ఆజ్ఞ ప్రకారము వారు అదే విధంగా తిరిగి వెళ్ళునపుడు ఆ శిబిరానికి వెళ్ళి అక్కడ సాయి భక్తులకందరికీ ఈ విషయాన్ని తెలియజేసి వారందర్ని ఆనందంలో ముంచెత్తారు.

**నవంబరు 30, 1980న స్వామి స్వయంగా తామే ఈ శిబిరానికి విచ్చేసారు. తదుపరి డిసెంబర్ 7, 1980** నాడు స్వామి ఆ శిబిరంలో సేవలు అందించిన సాయి సేవకులందరికీ తమ చల్లని దీవెనలు ప్రసాదించారు. ఆనాడే వారితో మాట్లాడుతూ స్వామి "మీరు ఏదైనా మంచి కార్యం తలపెట్టండి. నేను బాగేపల్లి వస్తాను." అని పలికారు.

అవ్యాజ్యమైన స్వామి ప్రేమను చవిచూచి, ఆయన ఆశీస్సులు అందుకొని సాయిప్రేరణతో సాయి సేవకులు బాగేపల్లిలో సేవా శిబిరమును స్వామి 65వ మరియు 70వ జన్మదినోత్సవములప్పుడు కూడా జయప్రదంగా నిర్వహించారు. నిత్యం ప్రశాంతినిలయానికి వచ్చి వెళ్ళే వేలాది భక్తుల సౌకర్యార్థం సంవత్సరం పొడుగునా ఈ సేవా శిబిరాన్ని నిర్వహిస్తే బాగుంటుందని, ఇందు నిమిత్తం ఒక ఆశ్రమాన్ని నిర్మిస్తే బాగుంటుందని సాయి సేవకులు భావించారు. ఈ విషయాన్ని స్వామి దగ్గర ప్రస్తావించినపుడు స్వామి ఆ ఆశ్రమం వృద్ధులకు, అనాధలకు ఆశ్రయం కల్పించేదిగా కూడా వుండాలన్నారు. పరిపూర్ణమైనటువంటి సాయిమాత అనుగ్రహము వలన అనతి కాలంలో "శ్రీ సర్వధర్మ సమన్వయ ట్రస్ట్, బాగేపల్లి' పేరిట ఒక ట్రస్టు ఏర్పడింది. జూన్ 6, 1996న స్వామి తమ దివ్యహస్తాలతో ఈ వృద్ధాశ్రమాన్ని ప్రారంభించి దానికి 'శ్రీ సత్యసాయి ప్రేమ కుటీరం' అని పేరు పెట్టారు. అప్పటి నుండి స్వామి సంకల్పం వలన ఈ ఆశ్రమం ఎంతో మంది వృద్ధులకు, స్వామి భక్తులకు ఆశ్రయం కల్పిస్తోంది. స్వామి తమ అపరిమితమైన ప్రేమను ఆశ్రమం పైన, ఆశ్రమవాసులందరిపైన ఎల్లప్పుడూ ప్రదర్శిస్తూనే వున్నారు. 1998 జూన్ 15న స్వామి ప్రేమ కుటీరానికి విచ్చేసి, వేలాది భక్తులను, ఆశ్రమవాసులను, సాయి సేవకులను ఆశీర్వదించి, వారిని ఆనందాబ్ధిలో ఓలలాడించారు.

'శ్రీ సత్యసాయి ప్రేమ కుటీరం' పూర్తిగా భగవానుని ప్రేరణతో, అనుగ్రహంతో నిర్మించబడినది. ఆశ్రమ వాతావరణంలో ప్రవేశించగానే సాధకుని అంతరంగంలో ఆధ్యాత్మిక భావతరంగాలు స్పందనను **కలుగచేసి, అతనికి అలౌకిక ఆనందాన్ని కలుగచేస్తాయి.**

ఉన్నది ఒక్కటే కులం, అది మానవ కులం.

ఉన్నది ఒక్కటే మతం, అది ప్రేమ మతం.

అన్న స్వామి ప్రబోధనలను జ్ఞప్తికి తెస్తూ సర్వధర్మ స్థూపము ఆశ్రమంలో ప్రవేశించే భక్తులకు స్వాగతం పలుకుతుంటుంది. ఇంకా అద్భుతమైన ప్రార్థనా మందిరము, కాటేజిలుకూడా ఆశ్రమంలో వున్నాయి. గణేశుని ఆలయం, గోశాల, డార్మిటరీ... ఇత్యాదులు నిర్మాణంలో వున్నాయి.

మానవ సేవే మాధవ సేవ, సర్వజీవ సేవే సాయీశ్వర సేవ అని భావించటమే గాక వృద్ధులకు, అనాథలకు, సాయి భక్తులకు అందరికీ ఆశ్రయమిచ్చి ఉన్నతమైన సేవలు అందిస్తూ స్వామి చూపిన బాటలో పయనిస్తున్న ఈ ఆశ్రమ నిర్వాహకులు ఎంతో శ్లాఘనీయులు. వారి ఆదర్శం మరెందరికో స్ఫూర్తినిస్తుందనటంలో అతిశయోక్తి లేదు.

బాగేపల్లి, "శ్రీ సత్యసాయి ప్రేమ కుటీరం"లో ఆశ్రయం కోరదల్చుకున్న వృద్ధులు, అనాథలు మరియు సేవ చేయదల్చుకున్న సేవాతత్పరత కలిగిన వ్యక్తులు ఈ క్రింది చిరునామాలను సంప్రదించగలరు.

వై. శ్రీనివాసరెడ్డి, బి.ఎ., యల్.యల్.బి.,
అడ్వకేట్, శ్రీ సాయి శ్రీనివాసా కాంప్లెక్స్,
డి. వి. జి. రోడ్, బాగేపల్లి - 561 207.
ఫోన్ : 08150 - 2333

వై. శ్రీనివాసరెడ్డి, బి.ఎ., యల్.యల్.బి.,
అడ్వకేట్, శ్రీ సాయి శ్రీనివాసా కాంప్లెక్స్,
యస్. బి. ఐ. వెనుక,
పుట్టపర్తి. - 515 134.

*(36వ పేజీ తరువాయి)*

ఏ శక్తి లేకపోతే అమెరికా, జపాన్ జర్మనీ వంటి అగ్రదేశాలు, రష్యా వంటి కమ్యునిష్ట్ దేశాలు, అర్జెంటీనా, ఆస్ట్రేలియా వంటి మారుమూల దేశాలవారు మరియు ప్రపంచంలోని 180 దేశాలవారు స్వామికి భక్తులుగా మారుతున్నారు? శ్రీ సత్యసాయి ప్రబోధాలకు ప్రభావితులై స్వామి నిర్దేశించిన మార్గాన్ని ఎన్నుకొని జీవితాలను సుఖమయం, శాంతిమయం గావించుకొంటున్నారు?

అట్టి సకల శక్తి స్వరూపుని, అద్వితీయ మహిమాన్విత మూర్తిని అందరూ గుర్తిస్తున్నారు. వారి వారి ఇష్ట దైవాలను సాయిలో చూచుకుంటున్నారు. అందరూ అన్ని ప్రాంతాలనుంచి వచ్చి స్వామి ప్రేమ మకరందాన్ని ఆస్వాదించి, ఆనందించి వెళుతుండగా ఆ మకరందాన్ని మనం ఎంతవరకు ఆస్వాదిస్తున్నాము? Near గా ఉండి Dear కాలేకపోతున్నాము. మనము Near & Dear గా మారాలి. సమకాలీనులమైనందుకు సరిఅయిన సాయి మార్గాన్ని తెలుసుకొందాము. అందుకే స్వామి అన్నారు. Come, See, Examine and Enjoy. రండి, చూడండి, పరీక్షించండి, ఆనందాన్ని అందుకోండి అన్నారు. మన భారతావనిలో, మన ఆంధ్ర గడ్డ మీద, మన భాష మాట్లాడుతూ, మన మధ్య తిరుగుతూ ఉన్న నడయాడే దేవుని కనులారా దర్శించుకుందాము.

వృధా వాదనలకు తావివ్వకుండా, అనవసర ప్రసంగాలకు అవకాశమివ్వక సత్యాన్ని గుర్తించుదాం. సత్య స్వరూపుడైన భగవంతుని మన కాలము సమీపించక ముందే గుర్తించుదాం. సాయి బాటలో పయనిద్దాం. సాయి ప్రబోధలను ఆచరిద్దాం. జీవితాలను ధన్యం చేసుకొందాం.

క్ష్మాభారమును బాపి భూదేవి మనుపు కొరకు
త్రేతనాసగిన కోర్కెలు తీర్చుకొరకు
అవతరించెను అచ్యుతుడవనియందు
సత్యరూపుడైన ఆతని చూడుడిప్పుడు.



నవరాత్రుల ప్రసంగము - 6

# ఆత్మను నమ్మండి!
# ఆత్మ విశ్వాసమును పెంచుకోండి!

భగవాన్ సాయి ప్రబోధ

" నిర్గుణో నిష్క్రియో నిత్యాం
నిర్వికల్పో నిరంజనః
నిర్వికారో నిరాకారో
సర్వముక్తైః లభ్యః"

గుణములు లేనిది, ఎట్టి కర్మలు ఎరుగనటువంటిది, నిర్వికారమైనటువంటిది, ఆకారము లేనటువంటిది, అనేక విధములైన ప్రయత్నముల ద్వారా తన నిశ్చలత్వము, నిర్మలత్వము, నిస్వార్థతను ప్రకటించలేనటువంటిది ఒకటి ఉన్నది. అదియే ప్రేమ. ఈ ప్రేమకు 'ఆత్మ' అని ఉపనిషత్తులు పేరు పెట్టినాయి. ఇట్టి పవిత్రమైన ప్రేమతత్త్వములో ఇట్టి గుణములేనటువంటిది, చర్యలు లేనటువంటిది, నిరాకారమైనటువంటి ప్రేమతత్త్వాన్ని మానవుడు ఏరీతిగా గుర్తించగలడు? ఈ ప్రేమ బుద్ధియొక్క వ్యాయామము కాదు. మానసిక మార్గముకాదు. స్వప్నమునందలి ప్రతిబింబము కాదు. కాని అన్నింటియందును ప్రాణసమానమైన సత్యము దీని స్వభావము. ప్రేమను గురించి చిన్న పెద్దలు అనేక విధముల గానములు చేస్తుంటారు, ప్రసంగిస్తుంటారు. అయితే ఈ ప్రేమ యొక్క స్వరూపం ఎట్లా ఉంటుంది? ఆచరణ రూపమైన స్వరూపంలో ఇది మనకు సాక్షాత్కరిస్తుంది. ప్రేమను వర్ణించుటకు కవిత్వంచాలదు, బాష లేదు. ఇది మనస్సునకుగాని, వాక్కునకుగాని అతీతమైనటువంటిది. ఇట్టి ప్రేమతత్త్వాన్ని మహనీయులు అనేక విధముల ప్రపంచంలో చాటుతూ వచ్చారు. దీని స్వరూపము భగవత్ స్వరూపము. ఇట్టి ప్రేమ స్వరూపమైన దైవత్వాన్ని ఏవిధంగా గుర్తించాలి? ఈ లౌకిక ప్రేమయందు, ఈ భౌతిక ప్రేమయందు స్వార్థం, స్వప్రయోజనం అంతో ఇంతో ఉంటుంది. కాని దైవ ప్రేమ స్వార్థము, స్వప్రయోజనము లేనటువంటిది. భగవంతుడు ఫలరహితమైన ప్రేమను అందిస్తుంటాడు. నాయందున్నది, నీయందున్నది దైవాంశమే అనే సత్యమును గుర్తించాలి, విశ్వసించాలి. అప్పుడు నీ ప్రేమను అందరికి పంచడానికి సులభమవుతుంది.

ఈనాడు ఇట్టి పవిత్రమైన, నిర్మలమైన, నిశ్చలమైన ప్రేమతత్త్వాన్ని జగత్తుకు పంచలేకపోతున్నారంటే 'మమైవాంశో' అనే మాటపైన విశ్వాసం లేదన్నమాట. నిజముగా నిర్మలమైన, నిశ్చలమైన విశ్వాసమే గనుక వుండివుంటే మీరు ప్రేమించక తప్పదు. ఈ ప్రేమ దిక్సూచి యంత్రమువంటిది. దీనిని ఎక్కడ పెట్టినా, దీని ముల్లు ఉత్తరదిశకే చూపుతుంటుంది. అదే విధముగనే దైవ ప్రేమ అనేటటువంటిది ఏ ప్రదేశమునందు, ఏ పరిస్థితులయందు, ఏ దేశమునందు ఉండినప్పటికినీ, ఇది దైవమువైపే మరల్చి ఉంటుంది. ఈ ప్రేమపై దేశకాలమాన పాత్ర ప్రభావములు ఏమాత్రం ఉండవు.

తనను తాను గుర్తించుకోలేని మానవుడు తనయందున్న దైవాన్ని ఏవిధంగా గుర్తించగలడు? తన మానవతావిలువలనే తాను గుర్తించుకోలేనివాడు దైవ విలువలను ఏరీతిగా గుర్తించగలడు? కనుక మొట్టమొదట తనను తాను గుర్తించుకోవటానికి ప్రయత్నంచేయాలి.

ఆత్మకు రూపనామములు లేవు. దైవమునకు అనేక రూపనామములు. 'ఏక్ ప్రభు కా అనేక్ నామ్' అని పాడుతుంటారు. కాని అన్నింటి మూలాధారతత్త్వము ఆత్మయే. ఆత్మ నిర్మలమైనది, నిశ్చలమైనది, నిస్వార్థమైనది. అట్టి నిర్మలమైన ఆత్మయందే ఈ జగత్తంతా సుస్పష్టంగా గోచరమవుతున్నది. ఈనాడు మనకు విశ్వమంతా గోచరమవుతున్నదంటే, వెనుక ఏదో ఒకటి ఆధారం వుంటుండాలి. ఆ ఆధారమే ఆత్మ స్వరూపము. ఈ జగత్తునకు దైవత్వమనేది ఒకటి ఆధారంగా ఉంటున్నది. ఈ ఆత్మతత్త్వమే ప్రతి రూపమునందు ప్రతిబింబిస్తుంటుంది. ఇట్టి దైవస్వరూపాన్ని నీవు ఏరీతిగా గుర్తించగలవు? కేవలం విశ్వసించు, అనుసరించు, ఆచరించు, అనుష్ఠించు, ఆనందాన్ని అనుభవించు, భగవంతుని యొక్క తత్త్వాన్ని విచారించడానికి ప్రయత్నం చేయకండి. కేవలం విశ్వసించి, ఆరాధించి, ఆనందాన్ని అనుభవించండి.

దైవత్వమును చక్కగా గుర్తించడానికి ఒక చిన్న ఉదాహరణ. తల్లియొక్క స్వభావము ప్రేమ. అయితే ఈ ప్రేమకు రూపమేమైనా చూపగలవా? ప్రేమకు రూపం లేదు. కాని ప్రేమకు ఆధారమైనటువంటి తల్లియే ఈ ప్రేమస్వరూపము. అదే విధముగనే సత్యము, ప్రేమలకు రూపములు చూపలేవు. ఆ తల్లియే లేకుండిన నీవెక్కడి వాడవు? నీవు ఈప్రేమను ఏరీతిగా అనుభవించేవాడవు? అనుభవించలేవు. అదే విధముగనే ఆత్మతత్త్వమనేది వెనుక భాగంలో వుండటంచేతనే మానవుడు ప్రేమ, ఆత్మ అనేదాంతో ప్రతిబింబింపజేస్తున్నాడు.

పరిపూర్ణ విశ్వాసమును పెట్టుకొని, పవిత్రమైన ప్రేమతో, స్వార్థరహితమైన ప్రేమతో దైవాన్ని చింతించుతే, తప్పక సాక్షాత్కరిస్తుంది ఈ ప్రేమ తత్త్వము. భగవంతుని చూడాలని కోరుకుంటున్నావు, ఆశిస్తున్నావు. కాని విశ్వాసమనేది దృఢంగా లేకపోవటం వలన ఈ సత్య తత్త్వాన్ని నీవు గుర్తించుకోలేకపోతున్నావు. కనుక అన్నింటికిని మొట్టమొదట నమ్మకం అత్యవసరం. నమ్మకమే పునాది. నమ్మకమే Self Confidence. ఆ Self Confidence అనే పునాది ఉండినప్పుడే Self Satisfaction అనే Wall ను నిర్మించవచ్చును. ఈ Self Satisfaction అనే Wall నిర్మించినప్పుడే Self Sacrifice అనే Roof చక్కగా వేయవచ్చును. ఈ Self Sacrifice అనే Roof వేసినప్పుడే Self Realisation అనే Life ను అక్కడ కాపురం పెట్టవచ్చును. Roof లేకుండా ఎవరూ నివసించరు గదా! Wall లేకుండా Roof వేయలేరుగదా! పునాది లేకుండా Wall కట్టరుగదా! వీటన్నింటికి పునాది అవసరం. అదియే Self Confidence. ఈ నమ్మకమనేది ఉండాలి. ఎన్నివుండి ప్రయోజనం ఏమిటి?

"సౌఖ్యమనుభవించు చాలని నరులకు
ఎంత వుండి ఏమి ఫలము?
నీటి గతుకు కుక్క కేరెంతపారినా
ప్రీతి కలుగబోదు పిసినిగొట్టు."

ఈనాడు మానవుడు చాలా పిసినారిగా ఉంటున్నాడు కించిత్ అయినా త్యాగం కనిపించటంలేదు. ప్రేమ ఉన్నట్లు నటిస్తున్నారు. మన వైస్‌ఛాన్సలర్ చెప్పారు. స్వామిది వేయి తల్లుల ప్రేమ అని. ఒక్క తల్లి ప్రేమనే గుర్తించుకోలేనివారు వేయి తల్లుల ప్రేమను ఏవిధంగా గుర్తించగలరు? కనీసం ఒక తల్లి ప్రేమను గుర్తించండి, అనుభవించండి. అదే నవరాత్రుల ఉత్సవమునకు మాతృమూర్తి అయిన దివ్యత్వం. మాతృదేవి యొక్క ప్రభావం ఏమిటంటే ప్రేమయే ఆమె ప్రాణం. ఈ ప్రేమ [illegible] ప్రభావమే ఈ జగత్ యొక్క పాండిత్యము. ఈ జగత్తుయొక్క పాండిత్యమే మానవుని యొక్క హృదయ సంస్కారము. ఈ హృదయ సంస్కారమే జీవితముయొక్క ప్రమాణము. కనుక మొట్టమొదట జీవితముయొక్క సంస్కారమును గుర్తించటానికి ప్రయత్నించాలి.

ఏమిటి ఈ సంస్కారం? సంస్కారమనగా మన అభ్యాసములని అనుకుంటున్నాం. ఇవి అభ్యాసములు కావు. హృదయమునుండి ఆవిర్భవించేటటువంటి దివ్య స్వభావములు. ఈ ప్రపంచంలో ఎన్ని పదార్థములున్నవో, ఎంతటి చైతన్యశక్తి ఉన్నదో, అంతయూ ఒక్క హృదయమునందే ఉంటున్నది. ప్రమాణములు వేరు వేరుగా కనిపించవచ్చునుగాని ప్రధానమైనటువంటి సంస్కారం మాత్రం ఒక్కటే.

"అహం వైశ్వానరో భూత్వా
ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః
పచామ్యన్నం చతుర్విధం"

భోజనం చేసేముందు పిల్లలు ఈ మంత్రం చదువుతారు. నేనే వైశ్వానర రూపంలో నీలో ఉంటున్నాను. నీ కడుపులోనికిపోయిన అన్నము ఎవరు జీర్ణం చేస్తున్నారు? నీ దేహంలో సంచరించే రక్తానికి బాధ్యులు ఎవరు? ఏ మిషను పనిచేస్తున్నది? 24 గంటలూ గుండె ఆడటానికి మిషను ఎవరు ఏర్పాటు చేశారు? ఇదంతా భగవత్ సృష్టియే. ఇది అగమ్య గోచరమైనటువంటిది. ఎవరూ అర్థం చేసుకోవటానికి వీలుకానటువంటిది. ఇలాంటి సృష్టిని అంతా భగవంతుడు సృష్టించి, ఈ సృష్టిలో ప్రత్యేకంగా మానవుడ్ని సృష్టించి, మానవత్వానికి తగినటువంటి తెలివితేటలను కూడా అందించి, ఒక ప్రత్యేకమైన జ్ఞానమును కూడా ప్రసాదించాడు. దీనినే 'ప్రజ్ఞానం బ్రహ్మ' అన్నది వేదం.

అన్నింటికన్నా ప్రధానమైనటువంటిది ప్రేమ తత్త్వము. ఈ ప్రేమనే 'ఆత్మ' అన్నారు. ఈ ప్రేమ ఎక్కడ వుంటే అక్కడ ప్రశాంతత వుంటుంది, అరాచకం వుండదు, అశాంతి వుండదు. ఎక్కడ ప్రేమతత్త్వముంటుందో అక్కడ అసత్యం చేరదు. ప్రేమలోనే సర్వం లీనమైపోతాయి. కనుక అన్నింటికి ప్రాణ సమానమైనటువంటిది ప్రేమతత్త్వము. ఇలాంటి ప్రేమస్వరూపాన్ని ఈనాడు మరచిపోయి లౌకిక మైన ప్రేమను పెంచుకొని జీవితాన్ని భ్రష్టు పట్టించు కుంటున్నారు. ఇవన్నీ ప్రాకృతమైన ప్రేమలు. తల్లిప్రేమను వాత్సల్యమంటున్నారు. భార్య ప్రేమను మోహమంటు న్నారు. బంధుప్రేమను అనురాగమంటున్నారు. పదార్థ ప్రేమను ఇచ్ఛ అంటున్నారు. ఒక్క దైవ ప్రేమను మాత్రమే 'ప్రేమ' అని అంటున్నారు. ఇంకా దేనికీ ప్రేమ అనే పదమును ఉపయోగించటం లేదు. తల్లి బిడ్డను ప్రేమిస్తుంటే, అది తల్లి యొక్క వాత్సల్యం అంటారు. బంధువులు ప్రేమిస్తుంటే, అబ్బ! అతనికి ఎంత అనురాగం అంటారు. ఒక వస్తువును తాను ప్రేమిస్తుంటే దానిపైన అతనికి ఎంత 'ఇచ్ఛ' అంటారు. అక్కడ 'ప్రేమ' అనే పదము ఒక్క దైవత్వమునకు తప్ప మరొక దానికి ఉపయోగించటానికి అధికారమేలేదు. ఈ ప్రేమ అనే పదము రెండు అక్షరముల పదమే. ఈ రెండు అక్షరములే సర్వత్రా వ్యాపించి ఉంటున్నాయి. ఈ రెండు అక్షరములే రామ, కృష్ణ, శివ, హరి, హర, సాయి, బాబా - ఇవన్నీ రెండు అక్షరములే. కనుక అన్నింటికీ మూలాధారమైన తత్త్వము రెండే. అదియే ఆత్మతో కూడినటువంటి ప్రేమ. ప్రేమతో కూడినటువంటి ఆత్మ. ఇది ఒక్కటే ప్రతి హృదయమునందు శాశ్వతంగా ఉండేటటువంటిది. మిగతావన్నీ ఏమాత్రమైన మార్పు చెందేటటువంటివే. ఈ ప్రేమచేత మనం జగత్తును ప్రకాశింపజేయాలి. ఈ ప్రేమచేతనే జగత్తును శాంతిపరచాలి. ఈ ప్రేమచేతనే విశ్వాన్ని మనం ధర్మంగా మార్చాలి. ఈ ప్రేమనే అహింసగా మార్చాలి. 'అహింసా పరమో ధర్మః' అన్నాడు బుద్ధుడు.

మనం సత్కర్మలను ఆచరించాలి. ఆ సత్కర్మలయందే సద్భావనలు వుంటున్నాయి? ఈ సద్భావనల యందే సత్ ప్రేమలు వుంటున్నాయి. ఈ సత్ ప్రేమలయందే సత్ దృష్టి కూడా వుంటుండాలి. దానినే సమ్యక్‌దృష్టి, సమ్యక్ భావన, సమ్యక్ కర్మ, సమ్యక్ వాక్కు, సమ్యక్ సాధన - ఈ అయిదింటిని మనం పంచ భూతములుగా తీసుకోవాలి. కర్మాచరణ నిమిత్తమై ఈ దేహం ఏర్పడింది. సాత్వికమైన ఆహారం తీసుకోవాలి. సాత్వికమైన కర్మలనాచరించాలి. సాత్వికమైన సంగములో చేరాలి. సాత్వికమైన సాధనలు చేయాలి. ఎవరు ఏవిధమైన పరిస్థితులలోనున్నా పది మందిలో నీవు ప్రవేశించు. సాధ్యమైనంతవరకు ఈ సమాజమునకు మేలు చేయుటానికి పూనుకో. సత్కర్మల నాచరించు, సదాచారములలో మునుగు, సచ్చింతన చేయి. సత్కర్మలు దేహము ద్వారా, సదాచారములు హృదయంద్వారా, సచ్చింతనలు నోటిద్వారా - అదియే త్రికరణ శుద్ధి. హృదయము, చేయి, నోరు - ఈ మూడింటియొక్క ఏకత్వమే 'త్రికరణ శుద్ధి' అన్నారు. హృదయము, వాక్కు, చేయి - ఈ మూడింటియొక్క ఏకత్వం కూడా కావాలి. ఏ పని అయినా చేయి. 'సర్వకర్మ భగవత్ ప్రీత్యర్థం' అని భావించి చేయి. ఇవన్నీ భగవంతుని కర్మలే. భగవంతుని ఆజ్ఞ లేకుండా ఏమీ జరగటానికి వీలుకాదు. భగవంతుడు యిచ్చిన ఈ దేహమును, బుద్ధిని, మనస్సును, ప్రాణమును సద్వినియోగపరచాలి.

సాధన...సాధన... అంటున్నారు. ఏమిటి ఈ సాధన? సేవయే సాధన. సమాజ సేవలకు మనం పూనుకోవాలి. ఈ విధమైన సేవలలో పాల్గొనినప్పుడే జన్మసార్థకమవుతుంది. సాధనలు చేయటానికి చేతకాకపోతే సేవలు చేయండి. ఎవరికి సేవ చేసినా భగవత్ సేవగానే భావించుకొని చేయి. దురదృష్టవశాత్తు ఈనాడు ఏపని చేసినా ఏసేవ చేసినా ఎంతవస్తుంది... ఎంత వస్తుంది.... ధనాశ ఈనాడు చాలా పెరిగిపోయింది. "ధనమెచ్చిన మదమెచ్చును మదమెచ్చిన దుర్గుణంబు మానక హెచ్చును" ధనము పెరిగిన కొద్దీ దుర్గుణాలు కూడా పెరిగిపోతున్నాయి. వాంఛలు పెరిగినకొద్దీ దుఃఖములు కూడా పెరిగిపోతున్నాయి. కోరికలు ఎంత పెరుగుతాయో, దుఃఖం కూడా అంత పెరుగుతుంది. ఉన్నదానితో తృప్తిపడు. ఎంత వరకో అంతవరకు సంతృప్తిగావుండు. ఆనందాన్ని అనుభవించు, పదిమందికి

పంచు. నీకు లేకపోతే భగవంతుడే నీకు అందిస్తాడు. అంతటి భక్తే నీలోనే ఉంటే తానే వచ్చి బాధ్యతలు కల్పిస్తాడు. భక్తి ప్రపత్తులు తానే కలిపిస్తాడు.

మన వైస్ ఛాన్సలర్ చెప్పాడు. హనుమంతుడ్ని లంకకు వెళ్లమని రాముడు చెప్పాడు. సుగ్రీవుడు, జాంబవంతుడు వగయిరాలు హనుమంతుని దగ్గరకు వచ్చి "హనుమా! నీవు కోతివి! నీకు ఏమాత్రం తెలివిలేదు. రాముడు చెప్పిన తక్షణమే లంకకు వెళ్లడానికి ఒప్పుకున్నావు. ఇంత పెద్ద సముద్రమును నీవు ఏరీతిగా దాటగలవు?" అన్నారు. అప్పుడు నవ్వుతూ చెప్పాడు హనుమంతుడు "భగవంతుడు చెప్పాడంటే, చెప్పిన భగవంతుడే ఆ శక్తినిగూడా యిస్తాడు. ఆజ్ఞను యిచ్చాడు గనుక ఆజ్ఞను యిచ్చిన ఆయనే ఆ శక్తిని కూడా యిస్తాడు. నేను వెళ్లుతున్నాను." అని చెప్పి రామా! అని ఒక్కతూరి ఎగిరాడు. ఆ రామ నామ మహాత్మ్యము వలననే హనుమంతుడు లంకలో చేరుకోగలిగాడు. భగవంతుడు ఏదైనా ఆజ్ఞ యిచ్చాడంటే, ఇంత పెద్ద పనిని నేను చేయగలనా? లేదా? అని ఏమాత్రం సందేహానికి అవకాశం యివ్వకూడదు. ఆజ్ఞను యిచ్చినవాడు వెంటనే శక్తిని కూడా అందిస్తాడు. ఆ నమ్మకం నీలో లేకపోవడంచేతనే నీవు వెనుకంజ వేస్తున్నావు. నిజముగా చెప్పినట్లుగా చేసిచూడు. నీవు తప్పక విజయాన్ని సాధించితీరగలవు. ఏమాత్రం అనుమానానికి అవకాశం యివ్వవద్దు.

ఈనాడు సైన్సు పెరిగిపోతున్నది. ఎంత పెరిగి పోతున్నదో, మానవునికి అంత సందేహాలు కూడా పెరుగుతున్నాయి. మేధావులకు జనరల్‌నాలెడ్జి జీరో, వారికి ఏమాత్రం నమ్మకం అనేది ఉండదు. అన్నీ అనుమానాలతో పరిశోధనలు చేస్తుంటారు. ఈ పరిశోధనలన్నీ అనుమానాలతోనే మునిగిపోతున్నాయి. తెలివితేటలు అభివృద్ధి అయ్యే కొలది నమ్మకం క్షీణించిపోతున్నది. కనుక నేను పిల్లలకు చెబుతుంటాను. Less Luggage more Comfort make Travel a Pleasure. కోరికలు తగ్గించు కోండి. ఎంత కోరికలు తగ్గించుకుంటే అంత హాయిగా మీరు జీవించవచ్చు. ఎంత కోరికలు తగ్గించుకుంటే అంత జ్ఞాపకశక్తి కూడా మీలో అభివృద్ధి చెందుతుంది, అంత తెలివి తేటలు పెరుగుతాయి. కేవలం మేధాశక్తి కావాలని ఆశించకండి. ఉన్న మేధస్సు సద్వినియోగం చేసుకుంటే చాలు. అప్పుడే నీవు ఆనందాన్ని పొందగలుగుతావు. **"అసంతృప్తో ద్విజో నష్టః"** అసంతృప్తిని మాత్రం పొందగూడదు. ఎప్పుడూ తృప్తిగానే ఉంటుండాలి.

ఆత్మను నమ్మండి. ఆత్మవిశ్వాసమును పెంచుకోండి. దైవాన్ని ఆరాధించండి. దైవత్వమునే పొందండి. ఈ జగత్తుకు అంతా ఒక ఆదర్శమును నిరూపించండి. అదియే మీ చదువులలో నున్న నిజమైన సారము.

**"చదువు చదివి చదివి చావంగ నేటికి**
**చావులేని చదువు చదవ వలయు**
**ఎంత చదువు చదివి ఏరీతినున్నను**
**హీనుడవగుణంబు మానలేడు**
**తరచి చదువు చదవ తర్కవాదమె కాని**
**పూర్ణ జ్ఞానమెపుడు పొందలేడు."**

ఈనాడు అంతా తర్కం మీద పోతున్నారు. ఇదంతా కాలం వ్యర్థం చేయటమే. ఇది కేవలం తెలివితేటల ప్రభావం. అజ్ఞానమునకు చిహ్నం. ఇలాంటి వాదనలలో మీరు ప్రవేశించకండి. "వాదే వాదే వచతే వైరం" వాదం వైరాన్ని పెంచుతుంది. శత్రుత్వాన్ని (Enemity) పెంచుతుంది. ఈనాడు మనకు కావల్సింది Enemity కాదు Purity కావాలి. Divinity ని పొందాలి. Unity, Purity, Divinity - ఈ మూడింటిని సాధించాలి. ఏకత్వాన్ని పొందాలి.

ప్రేమస్వరూపులారా!

ఈ ఏడు దినములనుండి యజ్ఞం జరుగు తున్నది. ఈ యజ్ఞం దేని కోసం? లోక క్షేమం కోసం. భగవన్నామం సర్వత్రా వ్యాపించాలి. ఈ గాలి ఎక్కడికి పోతున్నది. ప్రపంచమంతా తిరుగుతున్నది. చిన్న ఉదాహరణ. ఎక్కడో ఢిల్లీ రేడియో స్టేషన్‌లో ఒక వ్యక్తి పాటపాడుతుంటే శబ్దతరంగముల ద్వారా సర్వత్రా అది వ్యాపిస్తుంది. రేడియోలో ఢిల్లీ స్టేషన్‌ను పెడితే ఆ పాట అక్కడ వినిపిస్తుంది. ఇది ఎట్లా వచ్చింది. ఇది విద్యుత్ తరంగముల ద్వారా వచ్చింది. ప్రపంచమంతా విద్యుత్ తరంగములే, అయస్కాంత తరంగములే, సోలార్

తరంగములే. ఈనాడు యిక్కడ మనం చేసిన మంత్రముల ప్రభావం అంతా ప్రపంచమంతా వ్యాపించి పోతాయి. దుశ్శబ్దములు అణిగిపోతాయి. సుశబ్దములు పోషించబడుతాయి. ఈ గాలిలో సుశబ్దములు చేరటం వలన పీల్చుకొనే గాలిలో కూడా పవిత్రమైన భావాలు చేరి పోతాయి. ఎందుకనగా లోపల కూడా మనకు ఒక మంత్రం ఉన్నది. ఈ రెండు మంత్రాలు చేరేటప్పటికి ఏకత్వం అయిపోతుంది. దేహము ఒక యంత్రము. హృదయము తంత్రము. శ్వాసయే మంత్రం. సో2హం... సో2హం... అదే మంత్రం నేనే అది... నేనే అది... అనగా I am God....I am God... ఇంత కన్నా మంత్రం వేరొకటిలేదు. ఈనాడు ఉన్న మంత్రము లన్నీ దీని Reflection, Reaction, Resound లే. ఇదియే యదార్థ మంత్రం. అదియే దైవత్వము యొక్క స్వభావము. 'అహం బ్రహ్మాస్మి' అన్నారు. కనుక ఈ పవిత్రమైన మంత్రాన్ని స్మరిస్తూ, పవిత్రమైన జీవితాన్ని గడుపుతూ, పవిత్రమైన ఆదర్శాన్ని అందించి, లోకానికి శాంతిని చేకూర్చండి.

'తన సంతోషమే స్వర్గము, తన దుఃఖమే నరకము'. మీరందరూ సంతోషంగా సేవలలో ప్రవేశించి, అతి శీఘ్రకాలంలో దేశము యొక్క సుశాంతిని మీరు సంరక్షించాలి. ఒక్క భారతదేశమే నాదేశమని భావించ కండి. అన్ని దేశముల వారూ మనవారే. అందరూ సోదర సోదరీమణులే. అన్ని దేశములు సుక్షేమంగా ఉండాలి. ఆ విధంగా మీరు విశాల భావాన్ని పెంచుకోండి. మీ భావం సముద్రమంత విశాలంగా మారాలి. ఈ ప్రపంచమంతా శాంతి సుఖాలను పొందాలి. అందరూ 'దైవనామాన్ని స్మరించాలి, దైవత్వాన్ని వరించాలి, దివ్యత్వాన్ని పొందాలి' అనేటటువంటి సత్సంకల్పాన్ని మీరు అభివృద్ధి పరచుకోండి. ఈ విధంగా ఉన్నప్పుడు 'లోకా స్సమస్తా సుఖినో భవంతు' అనేది తప్పక మీరు వినగలరు, చూడగలరు, ఆనందించగలరు.

*(ది.30-9-1998న ప్రశాంతినిలయంలో నవరాత్రుల సందర్భమున భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి)*

ఆధ్యాత్మిక రంగంలో విద్య ఒకటే చాలదు. తపస్సు కూడా కావాలి. ఈనాడు ప్రాపంచిక విషయాలైన తిండి, గుడ్డ, పదవి, ధనం కోసం ఉపయోగపడుతున్న విద్య నిజంగా అజ్ఞానమే అవుతుంది. ఆధ్యాత్మిక విద్య అట్లుకాదు. ఇహంలో, పరంలో కూడా ఆనందాన్నిస్తుంది.

**- శ్రీ సత్యసాయిబాబా**

## కులమతోన్మాదములేని కోవెల

కులమతోన్మాదసర్పులే లేని మ
హోన్నతమగు సాయి యుద్యమంబు
మనసునిండుగ దివ్యమంగళాకారుడా
సాయినే నింపిన సాధుజనుల
పరమార్థ తత్త్వాల బలమైన మేధస్సు
పొందిన వైద్యసిబ్బంది వెలసె
పుణ్యసంస్కారాల పుణ్యాత్ములైన సం
శుద్ధమనస్కులం చూడగలము

మానవాకారమొందిన మాధవుండు
జటిల భవరోగముల్ బాపు సాయివిభుడు
కులమును రపించుకోవెలన్ వెలయజేసె
మహితవైద్యాలయముపేర మనకొసంగె

సాయివైద్యాలయ విశిష్ట సౌధమదియె
ధైర్యమిచ్చివైద్యమొసగు ధర్మశాల
దివ్యభావాలు కలిగించు దేవళంబు
ప్రవిమలానందమందించు ప్రాంగణంబు
పైసలడుగక రక్షించు వైద్య సంస్థ.

**- పంచాంగము శ్రీనివాసశాస్త్రి**

# శ్రీ సాయికృష్ణుని దివ్యసన్నిధిలో.....

సాయిప్రియ

దినయామిన్యౌ సాయంప్రాత శ్శిశిరవసన్తౌ పునరాయాతః
కాలఃక్రీడతి గచ్ఛత్యాయు స్తదపినముఞ్చత్యాశావాయుః

రాత్రిపవలు, ఉదయసంధ్యలు, శిశిరవసంతములు ఋతువులు ఒకదానివెంట ఒకటి వస్తూపోతూనే ఉంటాయి. ఆయువు క్షీణిస్తున్నది. అయినను ఆశ వదలకున్నది అన్నారు ఆదిశంకరులు.

మనిషి జీవితంకూడా ఒక పుస్తకంలాంటిది. కాలము గడచినకొలది పుస్తకంలోని ఒక్కొక్కపుట (పేజి) వెనక్కు వెళ్ళిపోతున్నది. కాలము ఎవ్వరికోసము ఆగదు. కాలాను గుణముగా మనిషి నడుచుకున్నప్పటికి దేశకాల పాత్రలనెరిగి చేసిన సత్కార్యములు అనంతమైన సత్ఫలితాలను ఇస్తాయని పురాణములు చెబుతున్నాయి. అదే ధర్మసూక్ష్మం అంటే అందుకోసమే మనవారు తీర్థములని, క్షేత్రములని, పండుగలని, పర్వదినములని ఏర్పరిచారు. వాటిని మనం గుర్తించి వర్తించాలి. పెద్దపండుగలలో దీపావళి ఒకటి. ఈ దివ్యదీపావళిని మాపూర్వజన్మ సుకృతం వలన సాయికృష్ణుని దివ్యసన్నిధిలో జరుపుకున్నాము. నరకాసురుని సంహరించి ప్రజలను కాపాడాడు శ్రీ కృష్ణపరమాత్మ ద్వాపరయుగంలో. మనలోని అసురగుణములను పోగొట్టి, మానవుడిలోని మాధవత్వాన్ని గుర్తింపజేయటానికి కలియుగములో అవతరించాడు శ్రీ సాయికృష్ణ పరమాత్మ. ఆరోజు ఎంతో శుభదినం. అక్టోబర్ 19. తెలతెలవారు తుండగానే, ఓంకారప్రణవనాదంతో, పక్షుల కిలకిలా రావాలతో, వేదమంత్రాలతో పర్తీశ్వరునికి మేలుకొలుపు జరిగినాయి. క్రమం తప్పకుండా స్వామి తమదివ్య దర్శనాన్ని భక్తులకు అందిస్తూ ఆనందింపజేస్తూ, కొందరికి 'పాదనమస్కారం'తో పునీతులను గావిస్తూ, మరికొంత మందికి 'విభూతి' ప్రసాదాన్ని అందిస్తూ, అందరిని చిరునవ్వుల పలకరింపుతో అలరిస్తూ ముందుకు సాగారు. ఎవరేమి కోరుకున్నా ఎప్పుడు ఎవరికి ఏది ఇవ్వాలో ఆస్వామికే తెలుసు. పండుగరోజున పరమాత్మ దర్శనం కలగటం ఎంతసుకృతమో! అనుకున్నాను. పిల్లలందరికి బొప్పాయి పండ్లను ఇచ్చారు. అక్కడచేరిన ఆబాల గోపాలమునకు స్వీట్లు పంచిపెట్టారు. విసుగు, అలసట లేకుండా అందరికీ అన్నీ అందినాయోలేదో అని కనుక్కొంటున్నారు స్వామి. చెరగని చిరునవ్వు స్వామికి పెట్టని ఆభరణం. భజన అనంతరం సాయంకాలం స్వామి ప్రసంగంవున్నదని ప్రకటించారు. ఒంటిగంటకల్లా సాయి కుల్వంత్ భక్తులతో నిండిపోయింది. స్వామి తమ దివ్యప్రసంగంలో నరకాసురుడు, క్రోధం వలన బలహీనుడై ఎలా సంహరించబడ్డాడో చెప్పి, ఎవరికి క్రోధం ఉండ కూడదు, అని చెప్తూ క్రోధం వలన వచ్చే నష్టాన్ని సోదాహరణంగా వివరించారు. స్వామిమాటలు వింటున్నంతసేపూ మనకూ నిజమే అనిపిస్తుంది. ఆచరించటమే కష్టం. ఎంతలాగినా కుక్కతోక వంకర అన్నట్లుంది మనపని అనుకున్నాను. తరువాత భజన హారతి అయిన తరువాత స్వామి అందరికి తీపిని తినిపించారు. మధురమైన మాటలు మనసుకు మధురమైన తీపిపదార్థములు నోటికి అందించారు స్వామి.

అది అయిన తరువాత సర్వధర్మ స్థూపంవద్ద దీపాలను వెలిగించారు పిల్లలు. స్వామి దగ్గరుండి పిల్లలతో బాణాసంచా కాల్పించారు. బాణాసంచావారికిచ్చి కాల్చుకోండి, పేల్చుకోండి అనకుండా తల్లి చిన్నపిల్లలనుదగ్గర కూచోబెట్టుకొని జాగ్రత్తగా ఎలాకాల్పిస్తుందో అలాగ కన్పించింది నాకు ఆ దృశ్యం. అందుకే సాయిమాత ప్రేమ కోటితల్లుల ప్రేమ అన్నారు. రంగు రంగుల రాకెట్లు కిచకిచలాడే పిచ్చుకలు ఆకాశంలో దూసుకొనిపోతూ వెలుగుల వెన్నెలలు విరజిమ్ముతూఉంటే, స్వామియొక్క ఔనత్యాన్ని ప్రపంచనలుమూలలా చాటిచెప్పు తున్నట్లుగా ఉన్నది. సింహాసనంపై కూర్చున్న చిన్మయమూర్తి చుట్టూ పిల్లలుచేరి ఆనందిస్తూఉంటే పూర్వజన్మలో వారెంత పుణ్యం చేసుకున్నారో అనుకున్నాను. పనులు ఎలాచేయాలో చెప్పేటప్పుడు స్వామి తండ్రిగాను, మనలోని దుర్గణములను పోగొట్టి, సద్గుణములను పెంచుకోమని ప్రసంగించేటప్పుడు గురువుగాను, ప్రేమలో తీపిని (స్వీటు) తినిపించి, టపాకాయలను కాల్పించేటప్పుడు మాతగాను నాకు కనిపించారుస్వామి. అందుకే మాతపితా గురు,దైవము మరిఅంతయుమీరే అనుకున్నాను. సాక్షాత్ శ్రీ సాయికృష్ణుని దివ్యసన్నిధిలో ఈదివ్య దీపావళిని దర్శించే భాగ్యం నాకు కలిగింది అనుకుంటూ, స్వామి మాటలుపదేపదే మననం చేసుకుంటూ, స్వామి చెప్పిన విషయాలను కొన్నింటినయినా ఆచరించి స్వామికి దగ్గర కావాలని, ఆశక్తి సామర్థ్యములను స్వామివారు ప్రసాదించాలని అనుకుంటూ క్యాంటిన్‌వైపు అడుగువేశాను.



విజయదశమి సందేశం -7

# సచ్చింతనలతోనే సర్వేశ్వరుని చేరగలరు

భగవాన్ సాయి సుబోధ

"దైవాధీనం జగత్సర్వం, సత్యాధీనం తుదైవతం
తత్ సత్యం ఉత్తమాధీనం, ఉత్తమో పరదేవతా"

ప్రేమస్వరూపులారా!

మన భారతదేశం తరతరాల నుంచి ప్రపంచంలో ప్రతి దేశమునకు అనంతమైన ఆధ్యాత్మిక తత్త్వమును ప్రబోధిస్తూ వచ్చింది. సుస్థిరమైన శాంతి భద్రతలను చేకూర్చటానికి ఆధ్యాత్మిక తత్త్వమొక్కటే ప్రధానమైనదని విశ్వసిస్తూ వచ్చింది. కానీ కాల ప్రభావంచేత ఈనాటి మానవత్వం ఆత్మవిశ్వాసం లేక, అన్యవిశ్వాసములను అభివృద్ధిపరచుకొని, అనిత్యము అశాశ్వతము, అసత్యమైన జగత్ వ్యాప్తికై అనేక విధములుగా ప్రాకులాడుతున్నారు. పశు పక్ష్యాదులకు ఉన్న విశ్వాసం, ఈనాడు మానవులకు లేకుండా పోతుంది. పక్షి తన రెక్కలను విశ్వసించి, వాటి నాధారం చేసుకొని పైకి ఎగురుతున్నది. కాని ఈనాటి మానవుడు మాత్రం తన హృదయాన్ని, తన ఆత్మతత్త్వాన్ని విశ్వసించక అనేక యిక్కట్లకు గురిఅవుతున్నాడు.

మానవుడు అనేక ఉపన్యాసాలు వింటున్నాడు, అనేక గ్రంథాలు చదువుతున్నాడు. కాని ఆత్మవిశ్వాసాన్ని మాత్రం కోల్పోతున్నాడు. ఎన్ని విన్నా, ఎన్ని చదివినా వాటిని విశ్వసించి ఆచరణలో పెట్టే వ్యక్తి ఒక్కడైనా కనిపించటం లేదు. ఆత్మవిశ్వాసం కల్గిన మానవునకు ఎట్టి సందేహ ములకు అవకాశం వుండదు. ఎట్టి భయభ్రాంతులకు లోనుకాకుండా, అన్నింటినీ ఎదుర్కొంటూ, ధైర్యసాహసము లతో ముందంజ వేస్తుంటాడు. అనాది కాలం నుంచి భారతీయ సంస్కృతి పవిత్రమైన ఆత్మవిశ్వాసమును ఆధారంచేసుకొని జీవిస్తూవస్తున్నది. అయితే ఈ ఆధునిక యుగం ప్రారంభమైనప్పటి నుంచి ఈ ఆత్మవిశ్వాసం దినదినమునకు తరిగిపోతూ వస్తున్నది. ప్రతి మానవునికి విశ్వాసం అత్యవసరం. ఈ ఆనందం కేవలం విశ్వాసం ద్వారానే మనకు లభ్యమవుతున్నది. కనుక ఆత్మ విశ్వాసమును ఆధారం చేసుకొని మనం జీవించటానికి ప్రయత్నించాలి.

ఈనాడు విజయదశమి. ఇది పవిత్రమైన పర్వదినముల యొక్క సమాప్తి. 'సమాప్తి' అనగా సర్వప్రాప్తులను చేకూర్చునది. షిరిడీ సాయి దేహమును వదిలిన దినమే ఈ దినము. ఈ విజయదశమి పర్వదినాన షిరిడి తన దేహమును వదిలి, తన ఆత్మస్వరూపాన్ని అనేక విధముల సంచారం సలిపి, తదుపరి ఎనిమిది సంవత్సరము లకు ఇక్కడ ప్రవేశించెను. మానవత్వములోని దివ్యత్వాన్ని గుర్తించుకోవలెననిన ఈ ఒక్కటి మాత్రమే చాలు.

ఈనాడు మానవుడు తెల్లవారి లేచిన తక్షణమే న్యూస్ పేపరు చదివి విచారణ చేస్తుంటాడు. దేశదేశముల యొక్క విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నిస్తుంటాడు. ఎవరిని చూచినా ఎవరు నీవు? ఎక్కడి నుంచి వచ్చావు? అని ప్రశ్నిస్తుంటాడు. కాని ఈనాడు మానవుడు తనను తాను గుర్తించుకోవటం లేదు, తనను తాను తెలుసుకోవటం లేదు. తనను తాను ప్రశ్నించు కోవటం లేదు. నేను ఎవరు? నేను ఎక్కడనుంచి వచ్చాను? అనే సత్యమును ఏమాత్రం గుర్తించటంలేదు. తనను తాను గుర్తించుకోలేని మానవుడు ఎన్ని గుర్తించి ప్రయోజనం ఏమిటి?

విజయం సాధించిన తరువాత అంపశయ్య మీద పడుకొనివున్న భీష్ముని చూడటానికి పాండవులు ద్రౌపదితో సహా వెళ్లుతారు. భీష్ముడు వీరిరాకకు ఎంతో ఆనందిస్తాడు. అందరూ చేతులు జోడించి నిశ్శబ్దంగా చుట్టూ నిలబడుతారు. భీష్ముడు అనేక విధముల నీతులు బోధిస్తుంటాడు. ప్రశాంతంగా అందరూ వింటున్న సమయంలో ద్రౌపది ఫక్కున నవ్వుతుంది. ఈ చర్యను అవమానంగా భావించి తలవంచుకుంటాడు ధర్మరాజు. భీమార్జునులకు కోపం వస్తుంది. ఈ స్థితిని గమనించిన భీష్ముడు ద్రౌపదిని పిలచి "బిడ్డా! నీ నవ్వునకు లోకులు అనేక విధములైన అర్థములు తీస్తుంటారు. లోకులు కాకులు కాన సత్యాన్ని గుర్తించుకొనలేక మానవులు

ఈ విధమైన చర్యలకు పూనుకుంటుంటారు. నీ నవ్వునకు కారణమేమిటో వారికి చక్కగా చెప్పి సందేహమును నివారించుము" అని అడుగుతాడు. అప్పుడు ద్రౌపది "తాతగారు! మీరు ఇప్పుడు బోధించిన బోధలు దుర్మార్గులు, దుష్టులు అయిన కౌరవులకు బోధించవలసినవి. కాని నాపతులు ధర్మాత్ములు, పవిత్ర హృదయులు. అలాంటివారికి ఈ బుద్ధులు బోధించనవసరం లేదు. ఇంతకాలం మీరు కౌరవులకు అధిపతిగా ఉంటున్నారు. కౌరవులకు సైన్యాధిపతిగా కూడా ఉన్నారు. ఈ బోధలు కౌరవులకు ఎందుకు బోధించలేదు. మీ సర్వ బోధలూ ఆచరణలో పెట్టిన పాండవులకే మరల బోధించడంలోగల అంతరార్థం ఏమిటి? అని నాకు నవ్వువచ్చింది"అన్నది. అప్పుడు భీష్ముడు "అమ్మా! నీవు నవ్వటంలో కారణము, యదార్థము ఉన్నది. ఇంతకాలం కౌరవుల దుస్సంగంలో వుండటంచేత, వారి అన్యాయ, అక్రమ, ఆర్జనలతో కూడిన ఆహారం భుజించడం చేత నా రక్తం కలుషితమైపోయింది. కనుక ఈమాలిన్య రక్త ప్రభావంచేత నా మనసు కూడా మాలిన్యమైపోయింది. అందువలన కౌరవులు చేసేది తప్పు అని తెలిసి కూడా వారిని ఏమాత్రం మందలించ లేక పోయాను. కానీ అదృష్టవశాత్తు అర్జునుడు వేసిన ధనుర్బాణములు నా శరీరములోనికి పోయి నా దేహములో నున్న మాలిన్యమైన రక్తం కారిపోయింది. పవిత్రమైన రక్తం మాత్రం మిగిలింది. కనుక ఇప్పుడు నాలోనున్న సద్భావనలు వెలుపలకు వస్తున్నవి. ఇంతకాలం నేను సత్యవాక్కులను పలుకలేకపోవటానికి మూలకారణం ఆ చెడ్డ ఆహారఫలితమే, అన్న దోషమే". అని చెప్పాడు. మనం ఎలాంటివారితో స్నేహం చేస్తామో, అలాంటి వారి భావాలు మనలో ప్రవేశిస్తాయి. కనుక దుస్సంగమునకు దూరంగా, సత్సంగమునకు దగ్గరగా ఉండాలి.

ప్రతిదానికి ఒక నియమం ఉండాలి. అందరిని మనం కలువకూడదు, అందరితోనూ సంభాషించకూడదు. అందరితోనూ స్నేహం చేయకూడదు. నిత్యానిత్య విషయపరిశీలన చేసి ఎవరు మంచివారు, ఎవరు చెడ్డవారు అనే సత్యాన్ని గుర్తించి వర్తించాలి. అయితే ఎవరినీ నీవు ద్వేషించవద్దు. 'అద్వేష్టాసర్వభూతానాం' ఎవరి యందు ద్వేషభావమును పెంచుకోవద్దు. ఏవిషయంలో హద్దుమీరి ప్రవర్తించకూడదు. పరిమితమైన సంభాషణ, పరిమితమైన స్నేహం, పరిమితమైన పరిచయం - అంతా పరిమితంగానే ఉండాలి. మితిమీరితే హద్దు మీరిపోతుంది. తిరిగి కంట్రోల్ చేయటం చాలా కష్టమైపోతుంది.

ఈనాడు ఆకారములో మానవుడుగా కనిపిస్తున్నాడుగానీ, మానవతా గుణములు మాత్రం ఆచరణలో లేకుండా పోతున్నాయి. **ఆకారంలో మానవుడు, ఆచరణలో రాక్షసుడుగా ఉంటున్నాడు.** మానవాకారంలో ఉన్నప్పుడు మానవతా గుణములను సంరక్షించుకోవాలి. అయితే ఈనాటి మానవునియందు మానవతా గుణములు ఏమాత్రం కనిపించటంలేదు. ఈ మానవతా గుణములు సంరక్షించుకోవటానికి మొట్టమొదట ఆహారవిహారములు అత్యవసరం. కనుక సరియైన ఆహారం తీసుకోవాలి. Food ఎలాంటిదో Head అలాంటిది. Head ఎలాంటిదో God అలాంటిది. కాబట్టి Food, Head, God - ఈ మూడింటి Connection మనం చక్కగా గుర్తించుకోవాలి.

భారతీయ సంస్కృతి ఎంత పవిత్రమైనదో గుర్తించినప్పుడు దానియొక్క మహత్తరమైన శక్తి మనకు అర్థమవుతుంది. ఈనాడు జాతీయ భావములు ఏమాత్రం మానవునియందు కనిపించటంలేదు. జాతీయ భావాలను మనం పెంచుకోవాలి. ఇది నా దేహం, నా మాతృభూమి, నా భాష అనే భావం మానవునిలో ఆవిర్భవించాలి.

"ఇది నాదు మాతృదేశము
ఇది నా ప్రియ మాతృభాష ఇది నా మతమం
చెదగొట్టి నుడవనేరని
బ్రతికిన జీవి యొకండీ వసుధను గలదా"!

మన దేశంలో ప్రవహించే ప్రతి రక్తకణమందు భారతీయ సంస్కృతి ఉంటున్నది. ఒక్కొక్క కణము ఒక్కొక్క రూపంగా ధరించి ఉంటున్నది. కాబట్టి నీరూపము ఒకటి కాదు. "సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష సహ స్రపాత్". అనేకత్వంలో కూడిన ఏకత్వమే భారతీయ సంస్కృతి. ఈ Unityని మనం కాపాడుకోవాలి.

ప్రేమస్వరూపులారా!

ఈనాడు విజయదశమి. మీరు ఈనాడు ఒక ప్రతిజ్ఞ చేయాలి. ఏమిటా ప్రతిజ్ఞ. ధూమపానం, మద్యపానం, మాంసభక్షణ - ఈ మూడింటిని త్యజించటం. ఈ మూడింటిని త్యజిస్తే మనలో పవిత్ర భావాలు ప్రవేశిస్తాయి. ధూమపానంవలన కాన్సర్ వంటి అనేక దుష్టరోగములు ప్రారంభమవుతున్నాయి. ఆరోగ్యం చెడిపోతుంది, మానసిక పవిత్రత కూడా పాడైపోతుంది. ఇంక మద్యపానం మహాపిశాచం. ఇది తనను తానే మరిపింపజేస్తుంది. ఉన్మత్తుని చేస్తుంది. మదోన్మత్తుని గావిస్తుంది. ఇకపోతే మాంసభక్షణ. తుచ్ఛమైన పశు మాంసం తింటే వాటి బుద్ధులే మనకు దాపురిస్తాయి. చెడ్డ ఆలోచనలు కలుగజేస్తాయి. తిండిని బట్టే మన ఆలోచనలుంటాయి. కనుక మనం సాత్వికమైన శాకాహారం మితంగా భుజించాలి. సదాలోచనలు, సద్భావనలకు శాకాహారం ముఖ్యం. పవిత్రమైన భావాల వల్లనే పవిత్రమైన దృష్టి అభివృద్ధి అవుతుంది. అప్పుడు ఎవరినీ చెడ్డ దృష్టితో చూడడు. చెడ్డమాటలు మాట్లాడడు. చెడ్డ పనులు చేయడు. అసలు చెడ్డ తలంపులే తలువడు. కనుక తుచ్ఛమైన మాంసాహార భక్షణను విడనాడాలి.

ఈ రోజు పవిత్రమైన విజయదశమి. ఈ రోజుతో సప్తాహం ముగిసింది. ఈ సప్తాహంలో సప్త స్వరములు పవిత్రం కావాలి. సప్త లోకములు పవిత్రం కావాలి. మన జీవితాలను పవిత్రం గావించుకొనే నిమిత్తమై యీ విధమైన యజ్ఞములు నిర్వహిస్తుంటారు. ఇవి స్వార్థం, స్వప్రయోజనం కోసం చేసేవి కావు. లోక కళ్యాణం కోసం ఆచరించేవి, సర్వులూ సుక్షేమంగా ఉండాలని, సర్వులూ ఆనందంగా జీవించాలని వీటి పరమావధి. మనం ఎవరినీ బాధించకూడదు, దేనినీ హింసించకూడదు. ఎందుకంటే అన్ని జీవరాసులయందు దేవుడున్నాడు. ఈ వాస్తవాన్ని ఏనాడో వ్యాసుడు రెండు వాక్యాలలో బోధించాడు.

**"అష్టాదశ పురాణేషు వ్యాసస్య వచనం ద్వయం**
**పరోపకారాయ పుణ్యాయ పాపాయ పర పీడనమ్"**

దీని సారాంశమే Help Ever, Hurt Never.

ప్రేమస్వరూపులారా!

ముఖ్యంగా మీరు పోషించుకోవలసింది ప్రేమతత్త్వం ఒక్కటే. ఆ ప్రేమయందే సత్యము, ధర్మము, శాంతి సర్వమూ యిమిడి ఉంటున్నాయి. ఏపని చేసినా నీవు ప్రేమతో చేయి. ఏ పలుకు పలికినా సత్యముగా పలుకు. ఈ సత్యమును ప్రేమలో యిముడ్చు. అదియే నీ జీవితము యొక్క విలువ. మన హృదయం ఒక గొప్ప Water Tank. ఈ Water Tankను ప్రేమ అనే జలముతో నింపు. శబ్ద స్పర్శ రూప రసగంధాదులు Taps. ఈ Tankలో ప్రేమ జలము నింపుకుంటే ప్రతి Tap లో ప్రేమ జలమే వస్తుంది. నీ హృదయం అనే Tankలో దుర్భావనలు, దురాలోచనలు అనే మాలిన్య జలం నింపుకుంటే, అదే రకమైన మాలిన్యజలం Tap ల లోనికి వస్తుంది. అదే **'యద్భావం తద్భవతి'** అన్నారు. కనుక మన భావాలను ఉత్తమమైన భావాలుగా తీర్చిదిద్దుకోవాలి. మన సంకల్పములు ఉత్తమ సంకల్పాలుగా అభివృద్ధి పరచుకోవాలి. మన కర్మలు ఉత్తమ కర్మలుగా ఆచరించాలి. అయితే ఈనాడు మానవతా విలువలను గురించి చెబుతున్నాం. కానీ చెప్పే మనమే ఆచరించటం లేదు. పదిమందికి బోధించే బదులు, ప్రచారం చేసే బదులు, వాటిని ముందు నీవు ఆచరించు. ఆచరణ లేని ప్రచారం వలన ప్రయోజనం ఉండదు.

దివ్యాత్మస్వరూపులారా!

హృదయమే మనకు ప్రధానమైన క్షేత్రం. అట్టి హృదయ క్షేత్రము మాలిన్యం కాకుండా చూచుకోండి.

పవిత్రంగా, పరిశుభ్రంగా, నిర్మలంగా ఉంచుకోండి. దుర్భావనలను దూరం చేసుకోండి. ఆ స్థానంలో పవిత్రమైన ప్రేమతత్త్వాన్ని నింపుకోండి. ఎన్ని ఉపన్యాసములు చెప్పి ఏమి ప్రయోజనం? ఎన్ని వేదములు చదివి ఏమి ప్రయోజనం? ఎన్ని శాస్త్రములు పఠించి ఏమి ప్రయోజనం? అన్నీ నాకు తెలుసు అనుకుంటారు చాలామంది. తెలిసి ప్రయోజనం ఏమిటి? ఒక్కటైనా ఆచరణలో పెడుతున్నామా? ఆచరణలో లేని విద్యలన్నీ నిరర్థకమైనవే.

ఒక పర్యాయం విభీషణుడు "హనుమా! రాముడు నిన్ను దగ్గర జేర్చుకున్నాడు. కానీ, ఎంతో కాలం నుంచి రామనామం చేస్తున్న నన్ను ఎందుకు దగ్గరకు చేర్చుకోలేదు?" అని అడిగాడు. అప్పుడు హనుమంతుడు "విభీషణా! నీవు రామనామస్మరణ చేస్తున్నావు గాని, రామ కార్యమును ఆచరిస్తున్నావా? కేవలం మానసికంగా రామనామాన్ని చింతిస్తున్నావు, స్మరిస్తున్నావు. కానీ రామ కార్యంలో పాల్గొనటం లేదు గదా! స్మరించటం, చింతించటంతోనే తృప్తి పడక రామచర్యలను పాటించు అని చెప్పాడు. ఈసత్యమును వినిన తక్షణమే తన సోదరులైన రావణ కుంభకర్ణులను త్యజించి, పరుగెత్తుకొని పోయి రామా! రామా! అంటూ సముద్రం దాటి వెళ్లి, రాముని పాదములపై పడ్డాడు విభీషణుడు. "భీష్ముడు కంటె విభీషణుడు చాలా గొప్పవాడు'' అన్నారు. ఎందుకంటే, కౌరవులు చేసేది తప్పు అని భీష్ముడికి బాగా తెలుసు కాని వారిని వదలలేదు, మందలించలేదు, మంచిని బోధించలేదు, సరియైన మార్గంలోనికి తెప్పించటానికి ప్రయత్నించలేదు భీష్ముడు. కానీ విభీషణుడు నీవు చేసేది తప్పు అని ధైర్యంగా రావణునికి చెప్పాడు. వినకపోవటంతో అతనిని వదలిపెట్టాడు, రాముని శరణుజొచ్చాడు. రాముని పాదాలపై పడి "నేను నీవాడను! నేను నీవాడను" అని చెప్పాడు. దీనిని చూచిన లక్ష్మణుడు, జాంబవంతుడు, సుగ్రీవుడు మొదలగువారు స్వామీ! "వీడు రాక్షసుడు. రాక్షసులను నమ్మవద్దు. సోదరుడైన రావణుని వదిలి నీ వద్దకు రావటానికి ఏదో స్వార్థం ఉండి ఉండాలి. కనుక ఇతనిని తక్షణమే వెనుకకు పంపించి వేయండి!" అని రాముని వేడుకున్నారు. అప్పుడు రాముడు "నీ వాడని ఒక పరి ఐన ఏవాడైన నేమి ఏలుదు వానిన్" అన్నాడు. "ఎవరేమైనా చెప్పండి. వాడు నావాడు అని వచ్చాడు. కాబట్టి వాడిని నేను వదలను'' అన్నాడు. ఇదియే భగవంతుని కృపారసము యొక్క ప్రభావం. నేను నీ వాడను అని ఒక్క తూరి అంటిమా నీ వాడుగా నీవు బ్రతుకు. భగవంతుడు ఎప్పుడూ నీ వెంటనే, జంటనే, ఇంటనే, కంటనే ఉంటుండి కాపాడుతుంటాడు. కానీ ఆ విశ్వాసము ఈనాడు మీలో దృఢంగా లేదు. నమ్మకమనే టటువంటిది చాలా ప్రధానమైనటువంటిది.

"నమ్మకమను రెండు నయనంబులే లేని
అంధులైరి నేడు అవనియందు"

మనం అంధులం కాకూడదు. నమ్మి ఆచరించి ఆనందించాలి. అప్పుడు అన్ని విధాలా ఆయనే చూచుకుంటాడు. కనుక ఆ నమ్మకమును మనం బలపరచుకొని, దురభ్యాసములను దూరం చేసుకుని, సత్సంగంలో చేరి, సద్భావనలు పెంచుకొని, సచ్చింతనలో నిలిచి, సర్వేశ్వరుని చేరాలని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని ముగిస్తున్నాను.

*(ది.1-10-98న ప్రశాంతి నిలయంలో విజయదశమి సందర్భమున భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి)*

## ఆనందమే నా ఆహారం

'నేను వచ్చినది మీకు ఆనందం అనే పెన్నిధిని ఎలా పొందాలో తెలియజేయుటకే! మీరు ఆనందాన్ని పొందే రహస్యాన్ని మర్చిపోయారు. సుఖాన్ని గానీ, దుఃఖాన్ని గానీ నేను ప్రాప్తింపజేయును. సుఖదుఃఖాలు రెండూ బంధహేతువులే! నేను ఆనంద స్వరూపుణ్ణి, రండి నా నుండి ఆనందాన్ని పొందండి. ఆనందంలో జీవిస్తూ పూర్ణశాంతిని పొందండి. నేను మీ నుండి ఆశించేది మీ ప్రేమను, భక్తిని మాత్రమే. నేను ఆనందస్వరూపుణ్ణి, నా నుండి మీరు పొందే ఆనందం, మీరు అనుభవించే ఆనందం నా ఆహారం.'

– బాబా

-- నీతిబోధలు --

# బాలబాలికలలో నైతిక విలువలను పెంపొందించాలి!

కొమురగిరి కృష్ణమోహనరావు

నవంబర్ 1వ తేదీ నుండి ప్రతిపాఠశాలలో నీతిని గురించి బాలబాలికలకు బోధించాలని, విధిగా Moral Classes నిర్వహించాలని, బాలబాలికలలో నైతిక విలువలను పెంపొందించే ప్రయత్నం పాఠశాలలో జరగాలని, మన రాష్ట్ర ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ నారా చంద్రబాబునాయుడుగారు ఈ మధ్య ప్రకటించారు. ఇటువంటి అమూల్యమైన నిర్ణయమును గైకొనినందులకు గౌ॥ ముఖ్యమంత్రి గారిని అభినందిస్తున్నాను. పాఠశాలలలో Moral Classes కు అవసరమైన సమాచారమును శ్రీవాణి ద్వారా ప్రతినెలా అందించ సంకల్పించినాను. ప్రతి పాఠశాల వారు ఈ సమాచారమును సహృదయంతో స్వీకరించి, సముచితమైన రీతిలో బాలబాలికలకు నీతిబోధను గావించి, వారిని ఉత్తమపౌరులుగా తీర్చిదిద్దే ప్రయత్నం ఉపాధ్యాయులు చేస్తారని ఆశిస్తున్నాను. - సం.

"ధనము వచ్చును పోవును ధరణియందు
నీతి ధర్మాలు నిలుచును నిజముగాను
నీతి ధర్మాలు హృదయాన నింపుకొన్న
సార్ధకంబగు మానవజన్మ భువిని"

అన్నారు బాబా. ధనం శాశ్వతంకాదు. అది ఎప్పుడు వస్తుందో, ఎవరి వద్దకు వస్తుందో, ఎంతకాలం ఉంటుందో ఎవరూ చెప్పలేరు. నీతి ధర్మాలు మాత్రమే శాశ్వతం. ఒక పర్యాయం మనిషిలో నీతి గనుక ప్రవేశిస్తే, అనగా నీతివంతుడైతే అతనికి ఎనలేని కీర్తి ప్రతిష్ఠలు వస్తాయి. జీవితం సార్ధకమవుతుంది.

"Money comes and goes, But morality comes and Grows" డబ్బు వస్తుంది, పోతుంది. కాని నీతి వస్తుంది, పెరుగుతుంది. నీతి గలవాడే నిజమైన మనిషి. నీతికి మించిన ధనం వేరొకటి లేదు. నీతి లేని వాడు కోతి కంటే హీనం. శీలం లేని వాడు చిల్లికుండతో సమానం. హృదయం లేనివాడు పశువుకన్న హీనం. నీతిగల మానవునియందే వ్యక్తిత్వం వికసిస్తుంది. నీతి మానవుని ఉన్న స్థాయి నుండి ఉన్నత స్థాయికి గొనిపోయే రాజమార్గం. మానవునికి ఎన్ని రకములైన భౌతిక సంపదలు ఉండినప్పటికీ, నైతిక బలం లేకపోతే అతను ఏమాత్రం రాణించడు, శోభించడు. ఈనాడు మానవునిలో నీతి లోపించటం చేతనే పతనమైపోతున్నాడు. నీతి నిజాయతీలు రెండూ, రెండు నేత్రముల వంటివి. కనుక నీతినిజాయితీలను పెంపొందించుకొని, వాటిని హృదయంలో నింపుకొని, ధర్మబద్ధంగా నడిచే మానవుని జన్మయే సార్ధకమవుతుంది.

"జాతి గౌరవంబు నీతిపై నిలుచును
నీతి లేకయున్న జాతి చెడును
నీతి గల్గుజాతి నిజమైన జాతిరా
వినుము భారతీయ వీరసుతుడా!"

అన్నారుబాబా! ఒక జాతి యొక్క విలువ ఆ జాతి యొక్క సంపద మీదనే ఆధారపడి వుండదు. ఒక దేశం యొక్క గొప్పతనం ఆ దేశము యొక్క సైనిక శక్తి మీదనే ఆధారపడి ఉండదు. ఒక జాతి యొక్క ప్రతిష్ఠ ఆ జాతియొక్క జనాభా మీద గాని, ఆ దేశం యొక్క విశాల భూభాగం మీద గాని ఆధారపడి ఉండదు. జాతి గౌరవం ఆ దేశ ప్రజల నైతిక ప్రవర్తన మీద, ఆ దేశ పాలకుల నీతి నిజాయితీల మీద ఆధారపడి ఉంటుంది.

'ప్రాణమునకు నీతిసారము. జీవితమునకు ఆదర్శము నీతి. నీతి లేకున్న జాతి చెడును. నీతియే నీ జాతి. అది వదిలితివో నీవు కోతి కంటే హీనుడవవుతావు' అంటారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు. ఈనాడు నీతిలోపించడం చేతనే మానవుడు క్షీణించుచున్నాడు. నీతి లేనివాడు ఎంత గొప్ప మేధావి అయినా, ఎంత గొప్ప సైంటిస్టు అయినా, ఎంత గొప్ప రాజకీయ నాయకుడైనా ప్రయోజనం లేదు. అటువంటివారి వలన ఆ దేశమునకు

ఏమాత్రం మంచి చేకూరకపోగా, అప్రదిష్ఠ కూడా వచ్చి తీరుతుంది. కనుక ప్రతి ఒక్కరూ నీతి నిజాయితీలను పెంపొందించుకొని జీవితమును సార్ధకం చేసుకోవటంతో పాటు, జాతి గౌరవమును కూడా ఇనుమడింపజేయాలి.

"నీతి నియమాలు నరునకు ఖ్యాతి గూర్చు
బాల్యదశయందె యియ్యవి పట్టుబడును
ఇట్టి రీతుల తెలిపెడునట్టి జనుల
నేరి అధ్యాపకుల నొనరించరయ్య."

అనిచెప్పారు బాబా. నీతినియమాలు (Morals & Principles) వ్యక్తి కీర్తి ప్రతిష్ఠలను పెంచి వేస్తాయి, ఖ్యాతిని చేకూరుస్తాయి. ఇవి అంత తేలికగా ఎప్పుడు పడితే అప్పుడు అబ్బేవికావు. వెలయిస్తే బజారులో లభ్యమయ్యే వస్తువులు అంతకన్నా కావు. దీనికి సమయం సందర్భం అంటూ ఉన్నాయి. "శైశవే2భ్యస్త విద్యానాం" బాల్యదశ యందే ఇవి పట్టుబడుతాయి. అప్పుడే వీటిని అభ్యసించాలి. అప్పుడు నేర్చుకున్నవి, అలవర్చుకున్నవి మాత్రమే జీవితాంతం బాగా గుర్తుంటాయి, మనతో ఉంటాయి, మనల్ని సరియైన మార్గాన నడిపిస్తూంటాయి. మధ్యలో నేర్చుకున్నవి, అలవర్చుకున్నవి మధ్యలోనే పోతాయి. కనుక అటువంటి అమూల్యమైన బాల్యదశను సద్వినియోగం చేయాలి. లౌకిక విద్యలతోపాటు ప్రతి విద్యార్థి నీతి నియమాలను కూడా అలవరచుకుంటే "విద్యా వినయ శోభితుడు" అవుతాడు. సమాజంలో ఉత్తమ పౌరునిగా జీవించటానికి తగిన అర్హత, యోగ్యతలను సంపాదించిన వాడవుతాడు. ఉన్నత పదవులను అధిష్టించి పేరు ప్రఖ్యాతులను అందుకుంటాడు.

**అయితే ఇటువంటి అమూల్యమైన నీతులు ఎవరు బోధించాలి? ఇంటివద్ద తల్లిదండ్రులు, విద్యాలయాలలో అధ్యాపకులు ఇంతకు పూర్వ విద్యాలయాలలో Moral Classes నిర్వహించేవారు. కాని ఈనాడు అవి ఎక్కడా కనిపించటం లేదు.** ప్రతి **విద్యాలయంలో విధిగా మోరల్ క్లాసులు నిర్వహించబడాలి.** నీతి కథలు బాలబాలికలకు బోధించాలి. నైతిక విలువలు పెంపొందించే ప్రయత్నం జరగాలి. దేశభక్తి భావాలను బాల బాలికలకు రంగరించిపోయాలి. అప్పుడే నేటి బాల బాలికలు సత్ప్రవర్తన గల భావిభారత పౌరులుగా రూపొందుతారు.

## కోతియే మేలు

నీతిలేని వాడు కోతి కంటే హీనుడే. ఇది అనుభవంతో చెప్పిన సామెత. కోతి కూడా కొన్ని కొన్ని సమయాలలో చక్కటి ఆదర్శమును చూపుతున్నది. కోతి మనోభావాలను ఒక పర్యాయం చక్కగా విపులీకరించారు బాబా. "ఓ మానవా! నేను లేక నీవు లేవు. ఆకారం ధరించిన నీ మనస్సే కోతినైన నేను. కానీ నీ కంటే నేను ఎంతో ఉత్తముణ్ణి. నేను రామసేవ చేశాను. నీవు కామ సేవ చేసినావు. నేను రామదాసుడను. నీవు కామదాసుడవు. నేను రామదాసుడనగుట చేత, రాముడు నాకు దాసుడు. కాముడు రాక్షసుడు, రాముడు భగవంతుడు. చెట్టు, ఉడత, పిట్ట - మేమంతా రామసేవ చేశాం. కాని మానవుడు చేసినదేమిటి? సీతను కష్టాలుపాలుచేసి, రాముని అవస్థల పాలు చేసింది నీవే. నాకైనా క్షణం స్థిరముందేమోగాని నీకు అదీ లేదు". అని కోతి తన మనోభావాలను వివరిస్తుందట. కనుక మానవుని కంటే కోతి మేలు కదా?

**"నేటి విద్య తెలివి తేటలనే పెంచు**
**కొంచమైన గుణము పెంచబోదు**
**కోటి విద్యలుండి గుణము లేకున్నచో**
**అట్టి విద్యకన్న మట్టి మిన్న"**

అని చెప్పారు ఒక పర్యాయం బాబా. ఈనాటి తరం విద్యార్థులు పూర్వం వారికన్నా తెలివి తేటలు గలవారే అనటంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. గోల్డు మెడల్సు సంపాదిస్తున్నారు. ర్యాంకులు కూడా సంపాదిస్తున్నారు. కాని వారిలో వుండవలసిన గుణం మాత్రం ఉండటం లేదు. **ఒక పర్యాయం బాబా చమత్కారంగా "మార్కులు చూస్తే ర్యాంకులు వస్తున్నాయి, గుణం మాత్రం బ్లాంకులు, జీరోలు" అన్నారు. ఇది పైకి చమత్కారంగా అనిపించినా దీనిలో ఎంతో వాస్తవం ఉన్నది. విద్య అంటే కేవలం** చదవటం, వ్రాయటం మాత్రమే కాదు. విద్య యొక్క లక్ష్యం డిగ్రీలు సంపాదించటం మాత్రమే కాదు. మార్కులు, ర్యాంకులు మాత్రమే తెచ్చుకోవటం కాదు. "మార్కులతోపాటు రిమార్కులు కూడా రాకుండా

చూచుకోవాలి'' అంటారు బాబా. విద్యతోపాటు వినయమును అలవరచుకోవాలి, చదువుతోపాటు సంస్కారమును కూడా పెంపొందించుకోవాలి. అయితే ఈనాటి అధునాతన విద్యలు తెలివితేటలను మాత్రమే పెంచుతున్నాయిగాని, ఏమాత్రం గుణమును పెంచటం లేదు. గుణం ప్రధానం, దనం కాదు.

"గుణం లేని జీవితం దీపంలేని గుడి వంటిది. గుణం లేని జీవితం చెల్లని నాణెం వంటిది. గుణం కంటే మించిన బలం వేరొకటి లేదు. గుణం ప్రధానం, ధనం ప్రధానం కాదు'' అన్నారు బాబా. కనుక గుణం లేని కోటి విద్యల కన్నా మట్టి మిన్న. మట్టిలో మణి మాణిక్యాలు దొరుకుతాయి. మానవునికి అవసరమైన ఆహారపదార్థాలు పండుతాయి. భూమిలో ఎంతో ఖనిజ సంపద లభిస్తుంది. మానవుని మనుగడ భూమాత మీద ఆధారపడి ఉన్నది. కనుక గుణహీనుడు ఎన్ని విద్యలు నేర్చినా ఏమి ప్రయోజనం?

"గుణము కొంచమున్న చాలు గొప్ప చదువులున్న
ఫలమదేమి వాని విలువదేమి
పంటపండని భూమి పది ఎకరములేల?
కొంచమైన చాలు మంచి భూమి."

భగవాన్ బాబా వారు గుణము (Character) నకు అత్యంత ప్రాధాన్యత యిస్తారు. Education is for life and not for living. కేవలం జీవించడానికే విద్య కాదు, జీవితానికే విద్య కావాలి. విద్య జీవనోపాధికి మాత్రమే కాదు. ఉత్తమ పౌరునిగా తయారు చేయటానికి విద్య ఒక ఉత్తమ సాధన అని బాబా వారి విశ్వాసం. కనుక ప్రతి విద్యార్థికి తెలివితేటలు ఎంత ముఖ్యమో, గుణం అంత కంటే ఎక్కువ ముఖ్యం. కనుక ప్రతి విద్యార్థి సద్గుణ సంపన్నుడు కావాలి.

గుణం అంటే శీలం (Character). సద్గుణం అంటే సచ్ఛీలం (Good Character). జీవితంలో ఎంతటి ఉన్నత పదవులనైనా పొందవచ్చును. సకల అష్టైశ్వర్య సంపదలను సంపాదించవచ్చును. సమస్త భోగ భాగ్యము లను అనుభవించవచ్చును. సమస్త అధికారములను అరచేతిలో ఇరికించుకొనవచ్చును. కాని అతి ముఖ్యమైన శీలమే గనుక లేకపోతే, వాటన్నింటిని తృటిలో కోల్పోతాడు.

## సచ్ఛీలము

సచ్ఛీలము అనగా "మంచి గుణం, మంచి సంస్కారం, మంచి నడత'' అని చెప్పుకుంటే సరిపోతుంది. ఎన్ని చదువులు చదివినప్పటికినీ, సచ్ఛీలం లేని యెడల ఆ వ్యక్తి ఎందుకూ పనికి రాడు. ప్రాపంచిక విభవము లెన్ని ఉన్నప్పటికినీ, శీలము లేని మనుజునకు ఈషన్మాత్రం విలువ ఉండదు. శీలములేనివాడు పశువుతో సమానం. శీలమే జీవునికి అలంకారం. సామాన్యులు బాహ్య సౌందర్యములకు విలువయిస్తుంటారు. భగవంతుడు మాత్రం సచ్ఛీలతకు ప్రాధాన్యతయిస్తాడు. భగవంతుని దృష్టిలో సచ్ఛీలమే ధనము, సదాచారమే సంపద. మానవుని విలువ బాహ్యసౌందర్యమునందులేదు. ఆస్తిపాస్తులయందు అంతకన్నాలేదు. సచ్ఛీలమునందు మాత్రమే ఉన్నది. శీలంలేనివాడు ఏరంగంలోను రాణించడు, శోభించడు. కనుక ప్రతిఒక్కరూ 'సచ్ఛీలసంపన్నులు' కావాలి.

"Character is Three fourth Religion". 'సచ్ఛీలమే మూడు పాళ్ళు మతం' అన్నారు స్వామి వివేకానంద. "The End of education is Character" 'విద్యాఫలం శీలం' అన్నారు శ్రీ సత్యసాయిబాబావారు. "Character is Nine Points in Education" "విద్యలో తొమ్మిది భాగాలు శీలం'' అన్నారు డా॥ సర్వేపల్లి రాధాకృష్ణపండితులవారు. కనుక ఎన్ని భౌతిక శక్తులు సంపాదించినప్పటికీ శీలం లేని శక్తి నిష్ప్రయోజనమై పోతుంది. ప్రతి జీవికి శీలం ప్రాణాధారం. మనలో సచ్ఛీలం గనుక ఉంటే మనం దేనినైనా సంపాదించవచ్చును. అతి ముఖ్యమైన శీలమే గనుక లేకపోతే వాటన్నింటినీ తృటిలో కోల్పోతాం. శీలం యొక్క ప్రాముఖ్యతను వివరించే ఒక చక్కటి నీతి కథను వివరిస్తాను.

## ప్రహ్లాదుడు

దానవుడైన ప్రహ్లాదుడు అకళంక దైవభక్తుడు. నిష్కామ బుద్ధితో అనేక పుణ్యకర్మల నాచరించి, అత్యున్నతమైన ఇంద్రపదవిని కూడా సంపాదించాడు. అసలు ఇంద్రుడు పదవిని కోల్పోయినాడు. పద భ్రష్టుడైన

ఇంద్రుడు విచారంతో దేవతల గురువైన బృహస్పతి వద్దకు వెళ్ళి, తన గోడును చెప్పుకొని, తరుణోపాయాన్ని అర్ధిస్తాడు, తిరిగి సింహాసనమును పొందడానికి ఉపాయం చెప్పమని వేడుకుంటాడు. అప్పుడు బృహస్పతి ఒక చక్కటి సలహాను యిస్తాడు. ప్రహ్లాదుడు దానం యిచ్చే సమయంలో, బిక్షక రూపంలో అతని కొలువు వద్దకు, అతని శీలాన్ని దానం అడుగమని చెబుతాడు. బృహస్పతి సలహా ప్రకారం అసలు ఇంద్రుడు బిక్షక రూపమును ధరించి, ప్రహ్లాదుని వద్దకు వెళ్ళి శీలాన్ని దానం యివ్వమని అర్ధిస్తాడు. అప్పుడు ప్రహ్లాదుడు ఆశ్చర్యపోయి "వట్టి శీలం వల్ల ప్రయోజనం ఏమిటి? దానితోనే సంతృప్తి చెందుతావా?" అని అడుగుతాడు. యాచక రూపంలో నున్న ఇంద్రుడు 'అది ఒకటి చాలు' అని అంటాడు. ప్రహ్లాదుడు నిస్సంకోచంగా తీసుకో అనీ అనటంతోనే ఒక తేజస్సు అతని దేహం నుండి బయటకు వచ్చి బిక్షక రూపంలో వున్న ఇంద్రునిలో ప్రవేశిస్తుండగా "నీవెవ్వరవు" అని ప్రహ్లాదుడు ప్రశ్నిస్తాడు. "నేను నీ శీలాన్ని, నీవు నన్ను అతనికి దానం చేశావు గనుక, నిన్ను వదలి అతనిలో ప్రవేశిస్తున్నాను" అని తేజస్సు బదులు చెప్పి ఆ యాచకుని ప్రవేశిస్తుంది. మరల కొంత సేపటికి మరొక తేజస్సు ప్రహ్లాదుని శరీరం నుండి బయటకు రాగా "నీవెవ్వరవు" అని ప్రహ్లాదుడు ప్రశ్నిస్తాడు. అప్పుడు ఆ తేజస్సు "నేను నీ శౌర్యమును. శీలము యొక్క సేవకుణ్ణి, నీలో శీలం వున్నంతకాలం నిన్ను సేవించాను. ఇప్పుడు శీలం నీ నుండి వెళ్లిపోయింది గదా! కనుక నేను కూడా శీలం వెంబడే పోతున్నాను" అని ఆ తేజస్సు జవాబు చెప్పి, యాచకుని రూపంలో నున్న ఇంద్రునిలో ప్రవేశిస్తుంది. చివరకు స్త్రీ ఆకారంలో ఒక తేజస్సు ప్రహ్లాదుని శరీరము నుండి బయటకు వచ్చి "నేను నీ యొక్క రాజ్యలక్ష్మిని, నేను కూడా శీలం సేవకురాలినే. శీలాన్ని వెంబడించి నేను కూడా పోతున్నాను" అని చెప్పి ఆ తేజస్సు కూడా బిచ్చగానిలో ప్రవేశిస్తుంది.

ప్రహ్లాదుడు తన శీలాన్ని దానం యివ్వడం వలన తన శౌర్యాన్ని, తన రాజ్యలక్ష్మిని కోల్పోయినాడు. తన అధికారాన్ని, వైభవాన్ని కూడా కోల్పోయినాడు. అసలు ఇంద్రుడు తిరిగి సింహాసనాన్ని పొందాడు. ఇక్కడ నేర్చుకోవలసిన నీతి ఒకటి ఉన్నది. మనలో శీలం గనుక వుంటే మనం దేనినైనా సంపాదించవచ్చును. శీలమే గనుక లేకపోతే ప్రతి దానిని మనం కోల్పోతాం. ఇది వ్యక్తి విషయంలో ఎంత వాస్తవమో, జాతి విషయంలో కూడా అంతే. కనుక జాతీయ జీవనరంగంలో శీలానికి అత్యంతమైన ప్రముఖ స్థానం ఉంది.

## శీలత్రయము

మనుజుడు ఏరంగంలోనయినా సరే విజయమును సాధించవలెననిన 'శీలత్రయము' తప్పని సరిగా కలిగియుండవలెను. 1. పవిత్రత (Purity) 2. సహనం (Patience) 3. పట్టుదల (Perseverance) గల వ్యక్తులనే మన ప్రాచీన సమాజం గౌరవించింది. దీనినే 'శీలత్రయము' అన్నారు. ఇంగ్లీషులో P3 అన్నారు. ఎవరి యందు ఈ శీలత్రయం తిష్టవేసుకొని కూర్చుంటుందో, విజయమును గురించి అతడు ఏ మాత్రం సంకోచించ నవసరం లేదు. అటువంటి వారు లక్ష్యమును నిరాటంకంగా చేరుకోగలరు. కనుక ప్రతి ఒక్కరు పవిత్రమైన ఆలోచనలు చేయాలి, పవిత్రమైన భావములు కలిగి ఉండాలి, పవిత్రమైన కర్మలనాచరించాలి. ఎటువంటి కష్టతరమైన పనులనైనా ఓర్పుతో సాధించ వచ్చును. ఓర్మిని ప్రదర్శించి, అసాధ్యమైన విషయాలనైనా పరిష్కరించవచ్చును. సహనంతో ఎటువంటి విపత్కర పరిస్థితులనైనా సునాయాసంగా దాటవచ్చును. పట్టుదలతో సాధించ లేనిదంటూ ఏమీ లేదు. ప్రగతి పథమును చేరుకోవాలంటే పట్టుదల అత్యవసరం. పట్టుదలతో విద్యార్ధి దేనినైనా సాధించవచ్చును. వ్యక్తి ఏ రంగంలో విజయమును సాధించ వలెనన్నా పవిత్రత, సహనం, పట్టుదల అత్యావశ్యకములు. కనుక ఈ "శీలత్రయము"ను సంపాదించి జీవితమును సార్ధకం చేసుకోవాలి.

శీలం రెండు రకములు. 1. వ్యక్తిగత శీలం (Personal Character) 2. జాతీయ శీలం (National Character). ప్రతి వ్యక్తిలో ఈ రెండు శీలాలు సరి సమానంగా వున్నప్పుడే వ్యష్టి, సమిష్టుల ప్రగతి సాధ్యమవు తుంది. దీనిలో ఏ ఒక్కటి లోపించినా వ్యక్తి ప్రయత్నం

నిష్ప్రయోజనమవుతుంది. ఈ రెండూ ఒకే నాణెమునకు బొమ్మ, బొరుసులాంటివి. ఒక ప్రక్క జాతీయ చిహ్నం, రెండవ ప్రక్క నాణెం విలువ వుంటుంది. ఈ రెంటిలో ఏది అరిగిపోయినా, ఆ నాణెం చెల్లదు. అదే విధముగా ఈ రెండు శీలాలు ప్రతి వ్యక్తికి తప్పని సరిగా ఉండి తీరాలి. ఏ ఒక్క శీలం లోపించినా అతను చెలామణి కాలేడు.

## వ్యక్తిగత శీలము (Personal Character)

మన భారతీయ సంస్కృతిలో 'వ్యక్తిగత శీలము' నకు అత్యున్నతమైన, గౌరవప్రదమైన ప్రముఖ స్థానం ఇవ్వబడింది. వ్యక్తిగత శీలం గల వ్యక్తులనే తత్త్వవేత్తలుగా మన సమాజం గుర్తించింది. Spotless Character గల వారినే గౌరవించింది. మచ్చలేని మనుషులకే మన సమాజంలో విశిష్టమైన స్థానం యివ్వబడింది. త్రాగుబోతులను, కాంతా కాంచనములకు దాసులైన వారిని, సంస్కార విహీనులను, వినయవిధేయతలు లేని వారిని, మనప్రాచీన సమాజం ఎప్పుడూ తత్త్వవేత్తలుగా పరిగణించలేదు. అట్టి దురాచారులను ఆచార్యులుగా భావించి పూజించలేదు. కాని దురదృష్టవశాత్తు రాను రాను ఉన్నత భావములకు, ఈ ఆచారములకు తిలోదకాలివ్వడం జరుగుతున్నది. వ్యక్తిగత శీలమునకు యివ్వవలసినంత ప్రాధాన్యత నేటి సమాజంలో ఎవ్వరూ యివ్వటం లేదు. సామాజిక, రాజకీయ రంగములలో పనిచేసే కార్యకర్తల "వ్యక్తిగత శీలము" (Personal Character) ను గురించి ఎవ్వరూ పట్టించుకోవటం లేదు. అధికారంలో వున్న వ్యక్తి యొక్క శీలం ఎంత హీనమైనవ్వటికీ, జోక్యం చేసుకొని మందలించటం జరగటం లేదు. నేడు మహోపన్యాసాలకు, ప్రసంగాలకు, ప్రవచనాలకు మాత్రమే ప్రాధాన్యత యిస్తున్నారు. ఆచరణకు ఇవ్వటంలేదు. నాయకుల వ్యక్తిగత శీలమును గురించి పట్టించుకోవటంలేదు. అందువలననే నేడు మన సమాజం అనేక యిక్కట్లను ఎదుర్కొనవలసి వస్తున్నది, అనర్థాలకు లోనవుతున్నది.

మనకు శ్రీరాముడు, వీరశివాజీ ఆదర్శం. వారి జీవితాలు మనకు స్ఫూర్తిని యిస్తున్నాయి, శక్తిని ప్రసాదిస్తున్నాయి. వారు నడచిన బాట పరమోత్కృష్టమైనది. ఆదర్శప్రాయమైనది. వారు నీతి నిజాయితీలతో ఆదర్శ వంతమైన పరిపాలన చేశారు. ఒక్క పరిపాలన విషయం లోనే గాక వ్యక్తిగత వ్యవహారాలలో కూడా వారిని వేలెత్తి చూపలేం.

## శ్రీరాముని శీలం

శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడు. శ్రీరాముని సచ్ఛీలము యెడల శత్రువులకు కూడా అత్యున్నతమైన వి[illegible] వుండేది. యుద్ధభూమిలో రావణుని కు[illegible] (ఇంద్రజిత్) లక్ష్మణుడు చంపుతాడు. భా[illegible]లోచన సహగమనము చేయ సంకల్పించుకుంటుంది. [illegible] శవం యుద్ధభూమిలో వుంటుంది గదా! అప్పుడు రావణుడు తన కోడలిని పిలిచి శ్రీరాముని శిబిరానికి వెళ్ళి అడిగి భర్త శవాన్ని తెచ్చుకోమంటాడు. శత్రు శిబిరానికి వంటరిగా వెళ్ళడానికి సులోచన సంకోచిస్తుంది, సంశయిస్తుంది. అప్పుడు రావణుడు "బాల బ్రహ్మచారి అయిన హనుమంతుడు, జితేంద్రియుడు అయిన లక్ష్మణుడు, ఏకపత్నీవ్రతుడు అయిన శ్రీరామచంద్రుడు వున్నచోటుకి, నీవు నిర్భయంగా వెళ్లవచ్చును, అమ్మా!" అని ఎంతో విశ్వాసంతో చెబుతాడు. అప్పుడు "మీరు రాముని భార్యను తెచ్చారే! అలాంటి రాముని దగ్గరకు మీ కోడలిని పంపటం ఉచితమా?" అని మంత్రులు సందేహాన్ని వెలిబుచ్చుతారు. అప్పుడు రావణుడు "పరస్త్రీని అపహరించడం రావణుని పని, రాముని పని కాదు" అని అంటాడు. శత్రువులకు కూడా శ్రీరాముని యెడల ఎంతటి సద్భావం, విశ్వాసం ఉండేదో ఈ సంఘటన వలన, మనకు బాగా అర్థమవుతున్నది. పరస్త్రీలను తన స్వంత సోదరీమణులలా చూచుకొనేటటువంటి శీలసంపత్తిని సంపాదించిన ఉత్తమ పురుషుడు శ్రీరాముడు.

## లక్ష్మణుని సచ్ఛీల చరిత్ర

రామ లక్ష్మణులు సీతాన్వేషణ నిమిత్తమై అడవులలో సంచరిస్తుంటారు. ఆ సమయంలో హనుమంతుడు ఎదురౌతాడు. ఋష్యమూక పర్వతం పై నున్న సుగ్రీవుని చెంతకు రామలక్ష్మణులను తీసుకొని

వెళ్లుతాడు. సీతాదేవి ఋష్యమూక పర్వతం పై వదిలిన నగలమూటను శ్రీరామునికి సుగ్రీవుడు యిస్తాడు. తాను చూడకుండా ఆ మూటను లక్ష్మణునికి యిచ్చి "ఆ నగలు మీ వదినవేమో చూడుము!" అని ఆదేశిస్తాడు. అప్పుడు లక్ష్మణుడు ప్రత్యుత్తరమిస్తూ....

"నా2హం జానామి కే యూరే
నా2హం జానామి కుండలే
నూ పురే త్వభి జానామి
నిత్యం పాదాభివందనాత్"

అని అంటాడు. అనగా "నేను సీతాదేవి యొక్క బాహువుల పైగల దండ కడియములను ఎఱుగను. ఆమె చెవులకు ధరించు కుండలములను ఎఱుగను. నేను ప్రతి నిత్యం ఆమె పాదములకే నమస్కరించే వాడినిగాన ఆమె పాదములపై గల అందెలను మాత్రమే ఎఱుగుదును." అని సమాధానం యిస్తాడు. ఈ సంఘటన లక్ష్మణుని నిర్మల సచ్ఛీల చరిత్రను ఋజువు చేస్తున్నది. వదినె గారి యెడల లక్ష్మణుని మాతృభక్తి ఎంతటి పవిత్రమైనదో తేట తెల్లమవుతున్నది. శీలము వుండవలసినది ఒక్క స్త్రీలకు మాత్రమే కాదని పురుషులు కూడా సౌశీల్యవంతులైనప్పుడే సత్సంప్రదాయాలు గల సమాజం రూపొందగలుగుతుందని మన పూర్వీకుల దృఢ నిశ్చయం. లక్ష్మణుడు ఉత్తమ శీల సంపన్నుడు. శీలం లేని శక్తి నిష్ప్రయోజనం. అంతేకాదు శీలం లేని వ్యక్తి అప్రదిష్టపాలవుతాడు. శీలరహితుడు సమాజం పాలిటి చీడపురుగు. శీలంపైననే సమస్తమూ ఆధారపడి ఉంటుంది.

## శీలం లేని శక్తి నిష్ప్రయోజనం

రావణాసురుడు భౌతిక శక్తులనన్నింటిని తన అరచేతిలో అష్టదిగ్బంధన చేయగలిగాడు. సమస్త అధికారాలు సంపాదించాడు: సకల భోగభాగ్యాలు సమకూర్చుకోగలిగాడు. అతనికి ఎదురుగా నిలిచి ఎదిరించగల శక్తి ఈ ముల్లోకములలో ఎక్కడా కనిపించ లేదు. అతని మహత్తర శక్తి ముందు అనంతమగు ప్రకృతియే మోకరిల్లింది. అతని తేజము ముందు దేవేంద్రాది దిక్పాలకులే నిస్తేజులై పోయినారు. అతని పేరు స్మరించినంత మాత్రముననే సకల చరాచర కోటి హడలి పోయేది. అయినప్పటికి అతనికి పతనం తప్పలేదు. అంతేకాదు అతనితోపాటు అతని వంశమే (విభీషణుడు తప్ప) సర్వ నాశనం అయిపోయింది. కారణం? అన్ని శక్తులనూ సంపాదించినప్పటికినీ 'శీలం' అనే శక్తిని మాత్రం అతను సంపాదించలేక పోయాడు. హనుమంతుడు అంతటివాడు అతని శక్తిని చూచి నివ్వెర పోయి "పరస్త్రీ వ్యామోహం అతనిలో లేకుండినచో, అతనిని ఓడించగల శక్తివంతుడు త్రిలోకములలో వుండేవాడే కాదు" అని రావణుని శక్తి సామర్ధ్యములను చూచి ఆశ్చర్యచకితుడై చెబుతాడు హనుమంతుడు. శీలం లేని శక్తి నిష్ప్రయోజనమని రావణాసురుని విషయంలో ఋజువైంది.

## శివాజీ ఆదర్శం

శివాజీ పరాయి స్త్రీలను తల్లులతో సమానంగా భావించి, గౌరవించేవాడు. యుద్ధంలో పట్టుబడిన ముస్లిం స్త్రీలను అవమానపరచకుండా, సురక్షితంగా వాళ్ళ బంధువుల దగ్గరకు పంపించినట్లుగా చరిత్రలో ఎన్నో ఉదంతాలున్నాయి. శివాజీ కుమారుడు శంభాజీ. శివాజీ కన్నా అతి పరాక్రమసంపన్నుడు. యుద్ధనీతి దురంధరుడు. అయినప్పటికీ శివాజీకి వచ్చిన పేరు ప్రతిష్ఠలు శంభాజీకి రాలేదు. చాలామంది విద్యావంతులకు అతని పేరు కూడా తెలియదు. కారణం? వ్యక్తి శీలం లేకపోవటం వలన శంభాజీ రాణించలేకపోయాడు. కాలగర్భంలో కలిసి పోయాడు, చరిత్ర హీనుడయ్యాడు. సచ్ఛీల రహితుల వలన దేశానికి, జాతికి తీరని హాని కలుగుతుంది, ప్రమాదం సంభవిస్తుంది. మనలోని బలహీనతలను శత్రువులు చక్కగా ఉపయోగించుకుంటారు. ముఖ్యంగా రాజ్యాధిపతులు విషయలోలురైతే మరీ ప్రమాదం. వారి బలహీనతలను పసికట్టి, మాయోపాయంతో శత్రువులు రాజ్యాలను సహితం మ్రింగివేసినట్లుగా చరిత్ర పుటలను తిరుగవేస్తే మనకు అవగతమవుతుంది. స్త్రీలోలురైన రాజ్యాధిపతుల వద్దకు, సైన్యాధిపతుల వద్దకు అందమైన స్త్రీ గూఢచారులను పంపి, వలలో వేసుకొని, వారి రహస్యములను సేకరించి, సామ్రాజ్యములను స్వాహా చేసిన ఉదంతాలు ప్రపంచ

చరిత్రలో కోకొల్లలు.

అలనాడు కాంతా వ్యామోహపరులై, రాజులు తమ రాజ్యాలను పోగొట్టుకున్నారు. ఈనాడు ఉన్నత పదవులలోనున్న కొందరు కాంచన వ్యామోహపరులు కావటం వలన ఈనాడు ఈదేశంలో అవినీతి వికటాట్టహాసం చేస్తున్నది. ఎక్కడ చూచినా స్కాములు, కుంభకోణాలు విశృంఖలంగా విలయతాండవం చేస్తున్నాయి. మన ఆర్థిక వ్యవస్థ నానాటికి దిగజారి పోతున్నది. ఆర్థిక పురోభివృద్ధి కుంటుపడుతున్నది. ఆశించిన రీతిలో దేశం సర్వతోముఖాభివృద్ధి గాంచటం లేదు. కనుక కాంతా కాంచనములకు దూరంగా ఉండాలి. వాటికి దాసులు కారాదు. వాటికి దాసులు కావటం వలన తాత్కాలిక ఆనందం, సుఖం చేకూరవచ్చు. కాని అవి శాశ్వతమైన కీర్తి ప్రతిష్ఠలకు భంగం చేకూరుస్తాయి, అప్రదిష్టపాలు చేస్తాయి. కనుక ప్రతి వ్యక్తీ సచ్ఛీలతను పెంపొందించుకోవాలి. మంచి సంస్కారములను అలవరచుకోవాలి. సభ్యత, సంప్రదాయములను నేర్చుకోవాలి. ఎవరిచేతా వేలెత్తి చూపడానికి వీలు లేనటు వంటి సత్ప్రవర్తనను పెంపొందించుకోవాలి. మచ్చలేని శీలము (Spotless Character) ను కలిగి ఉండాలి. అటు వంటి ఉత్కృష్టమైన, ఆదర్శవంతమైన, పవిత్రమైన, సచ్ఛీల సంపదను కలిగియున్న వ్యక్తినే "పరిపూర్ణుడు" అని అంటారు. కనుక అట్టి పరిపూర్ణుడు అయిన వాడు మాత్రమే పరిపాలనకు అర్హుడు. అటువంటి పరిపూర్ణత్వమును ప్రతివ్యక్తీ తన జీవితకాలంలో సంపాదించి, దేశ కళ్యాణమునకు ఆ అనుభవమును వినియోగించి, తరించాలి.

## జాతీయ శీలము (National Character)

'జాతీయ శీలము' అనగా 'దేశభక్తి' అని కూడా చెప్పవచ్చును. మన దేశంలో పూర్వం వ్యక్తిగత శీలం (Personal Character) గల పవిత్రులు ఎంతోమంది వుండేవారు. అతి బలపరాక్రమ సంపన్నులైన శౌర్య సాహసములు గల వీరాధివీరులు ఎందరో ఉండేవారు. సమర్థులైన రాజాధిరాజులు, శక్తివంతమైన సైన్యంతోపాటు అభేద్యమైన కోటలు, బురుజులు ఉండేవి. ఇన్ని ఉన్నప్పటికినీ మన దేశం విదేశీ దురాక్రమణలకు గురి అయింది. మన రాజాధిరాజులు ఓడించబడ్డారు. మన సిరిసంపదలు కొల్లగొట్టబడ్డాయి. మన సంస్కృతీ చిహ్నములు చిందరవందర చేయబడ్డాయి. మన నాగరికత నాశనం చేయబడింది. మన పవిత్ర దేవాలయాలు నేలమట్టం చేయబడ్డాయి. మన ప్రాచీన శిల్పకళ సర్వనాశనం చేయబడింది. దీనికి కారణం? మన వారిలో శక్తి సామర్థ్యములు లేకపోవడం వలన మనం ఓడిపోలేదు. స్వార్థపరులు పెచ్చు పెరిగి పోవటం వలన మనం పతనమైనాం. వ్యక్తి శీలం (Personal Character) తో పాటు జాతీయ శీలం (National Character) లోపించడం వలన మనం ఓడిపోయినాం. కొంతమంది రాజ్యాధినేత లలో దేశభక్తి భావం లుప్తం కావడం వలన మనకు పరాజయం లభించింది. 'ఈ విశాల భారతదేశం' నాది అనే విశాలభావం తరిగిపోయి, ఎవరికి వారు తమ తమ సంస్థానపు సరిహద్దుల వరకే పరిమితమై, సంకుచితత్వంతో ఆలోచన చేయటం వలన ఎవరికి వారు బలహీనులు అయినారు. దీనిని ఆసరాగా తీసుకొని శత్రువులు మన దేశమును తేలికగా ఆక్రమించగలిగారు.

## జాతీయ దృక్పథం లోపించడమే కారణం

జాతీయ దృక్పథం లోపించడం వలన విదేశీయుడైన అక్బర్‌కు దాసుడై, తన సోదర భారతీయ వీరుడైన రాణాప్రతాప్‌కు తీరని ద్రోహం చేశాడు మాన్‌సింగ్. వీరాధివీరుడైన జయసింహుడు స్వార్థంతో ఔరంగజేబుకు పాదాక్రాంతుడై, దేశభక్తుడైన శివాజీపై దండెత్తాడు. జయచంద్రుడు స్వలాభాపేక్షతో ఘోరీమహ్మాద్‌కు సహాయం చేసి వీరాధివీరుడైన పృథ్వీరాజ్‌ను ఓడించడానికి కారణభూతుడైనాడు. శివభక్తి పరాయణులమని చెప్పుకొనే కొంతమంది పూజారులు స్వార్థంతో విదేశీయుడైన గజనీ మహమ్మద్‌కు సహాయంచేసి, పవిత్రమైన సోమనాథ దేవాలయ పతనానికి దోహదం చేశారు. వీరందరూ వ్యక్తిగతంగా చాలా మంచివారు, గొప్ప వారు, వ్యక్తిగత శీలం (Personal Character) ఉన్నవారు. కాని వీరిలో జాతీయ దృక్పథం లేకపోవటం వలన, దేశభక్తి లుప్తం కావటం వలన, జాతీయ శీలం (National Character)

లేకపోవటం వలన, సమగ్ర సమాజ భావన మృగ్యం కావటం వలన, స్వార్థం పెచ్చు పెరిగి పోవటం వలన, విశాలభావం నశించడం వలన, స్వలాభాపేక్షతో, శత్రువులకు సహాయం చేసి. మన దేశ విచ్ఛిత్తికి కారణభూతులయ్యారు.

## పవిత్ర శీల సంపదను స్వంతం చేసుకోవాలి

ప్రతి వ్యక్తికి దైవభక్తి వుండటం ఎంత అవసరమో, దేశభక్తి కూడా అంతే అవసరం. వ్యక్తి భవిష్యత్తుకు నిజాయితీ ఎంత అవసరమో సమాజ శ్రేయస్సుకు జాతీయ శీలం కూడా అంతే అవసరం. వ్యక్తిగత శీలం, జాతీయ శీలం - ఈ రెండూ ఒకే వ్యక్తిలో మూర్తీభవించినప్పుడే వ్యష్టికి, సమిష్టికి ప్రయోజనం ఉంటుంది. పై రెండు శీలములలో ఏ ఒక్క శీలం లోపించినా, అతను సమాజంలో గౌరవ ప్రతిష్ఠలు కోల్పోతాడు, సమాజాభివృద్ధికి ఏమాత్రం ఉపయోగపడడు. కనుక ప్రతి ఒక్కరూ ఈ పవిత్ర శీల సంపదను స్వంతం చేసుకొని సమాజాభివృద్ధికి తోడ్పడాలి. ప్రతిఫలాన్ని కోరకుండా, కీర్తి ప్రతిష్టలను ఆశించకుండా ప్రతి ఒక్కరూ తన శక్తి సామర్థ్యములను దేశ కళ్యాణము నకు వినియోగించాలి. అహంకారం, అహంభావములను దరికి చేరనీయరాదు. స్వార్థ సంకుచితత్వాలను విడనాడాలి. తన సర్వస్వాన్ని భరతమాత పాదపద్మములకు అర్పించి, లోకోపకారమే కర్తవ్యంగా భావించి, పరోపకారమే పరమావధిగా నెంచి, జాతీయ సమైక్యతను సంరక్షించడానికి, మాతృభూమి సమగ్రతను పరిరక్షించడానికి కార్యోన్ముఖు లవ్వాలి. మాతృదేశం యెడల ఎనలేని భక్తి ప్రపత్తులు కలిగి ఉండాలి.

## ఇదే మన కర్తవ్యం

ఈ మాతృభూమి మనకు అత్యంత పవిత్రమైనది. ఈ పుణ్యభూమి మనకు ప్రాణప్రదమైనది. ఈ తపోభూమిలో ప్రతి అణువు మనకు పూజనీయమైనది. ఈ వీరభూమి పట్ల మన హృదయాంతరాళములలో సతతమూ వీరోచిత భక్తిభావం ప్రజ్వరిల్లుతూ ఉండాలి. ఈ పవిత్రభూమి గౌరవ ప్రపత్తులను యినుమడింప జేసేందుకు శక్తి వంచన లేకుండా కృషి చేయాలి. ఈ దేశ సంస్కృతీ సంప్రదాయములను గౌరవించాలి. ఈ దేశ ధర్మ పరంపరలను ప్రపంచానికి చాటాలి. మన దేశ స్వాతంత్ర్యమును పరిరక్షించుకుంటూ, ప్రపంచంలో మన దేశం ఒక అగ్రరాజ్యంగా రూపొందటానికి అవసరమైన శక్తిని సముపార్జించడానికి ప్రతి పౌరుడూ కృషి చేయాలి. స్వాతంత్ర్య సంగ్రామంలో సర్వస్వాన్ని సమర్పించిన త్యాగధనులను ఆదర్శంగా గైకొని అమరవీరుల స్ఫూర్తిని పొంది, కార్యోన్ముఖులై నవభారత నిర్మాణానికి శక్తి వంచన లేకుండా శ్రమించాలి. అధికార వ్యామోహానికి తిలోదకాలు ఇవ్వాలి. బంధుపక్షపాతం, ఆశ్రిత పక్షపాతములను దరికి చేరనీయరాదు. ప్రాంతీయ దురభిమానాన్ని విడనాడాలి. కులతత్వానికి చోటివ్వరాదు. అవినీతిని పారద్రోలాలి. కష్టించి పనిచేయాలనే భావం ప్రతి వ్యక్తిలో జనించాలి. భారతదేశ భవిష్యత్తు మనమీద ఆధారపడి ఉన్నది. భరత మాత మన కోసం ఎదురుతెన్నులు చూస్తున్నది. ఆ తల్లిని సేవించడం, పూజించడం, సంతృప్తి పరచడం కుమారులుగా మన కర్తవ్యం. ఈ దేశ పౌరులుగా మన విద్యుక్త ధర్మం. ఈ దేశమాత సౌభాగ్యమును మనం కళ్ళారా చూడాలి. ఈ పవిత్ర ఆశయం కోసం మనం జీవించాలి. ఇదే మన ధర్మం. ఇదే మన కర్తవ్యం.

కనుక ప్రతి ఒక్కరూ వ్యక్తిగతశీలంతోపాటు జాతీయ శీలం కూడా కలిగి ఉండాలి. కేవలం వ్యక్తి మంచి తనం మాత్రమే జాతిని ఉద్ధరించలేదు. మంచితనంతో పాటు దేశభక్తిని కూడా కలిగి ఉండాలి. ఆ మంచితనాన్ని సంరక్షించుకోవడానికి అవసరమైన శక్తిని కూడా సముపార్జించుకోవాలి. ముఖ్యంగా రాజ్యాధినేతలలో ఏ ఒక్క శీలం లోపించినా ఆ రాజ్యం పతనమైపోతుంది.

## భీభత్సానికి కారణం?

పూర్వం గుజరాత్‌లో "కర్ణుడు" అనే రాజు ఉండేవాడు. అతని ప్రధాని గొప్ప వేదపండితుడు, వివిధ శాస్త్రాలలో దిట్ట. ఆ రాజుకు వ్యక్తిగత శీలం లేకపోవటం వలన అతని రాజ్యంలో ఉన్న ఒక సర్దార్ భార్యను వ్యామోహంతో అపహరిస్తాడు. ఈ చర్యకు ప్రధానమంత్రి కోపోద్రిక్తుడై, ఆ రాజును శిక్షించి తీరుతానని ప్రతిజ్ఞ చేస్తాడు. అయితే ఆ శక్తివంతుడైన రాజును శిక్షించడం

మంత్రికి అంత తేలికైన విషయం కాదు. అదే సమయంలో గుజరాత్ ఉత్తర సరిహద్దులలో ముస్లిం సైన్యాలు పొంచి ఉన్నాయి. గుజరాత్‌ను స్వాధీన పరచుకోవటానికి వారు అనేక పర్యాయములు ప్రయత్నించి విఫలురయ్యారు. అట్టి సమయంలో ఆ ప్రధాని సరాసరి ఢిల్లీకి వెళ్లి, తన రాజును శిక్షించడానికి సహకరించుమని సుల్తాన్‌ను కోరుతాడు. అదే మంచి అవకాశము సుల్తాన్ భావించి, ఆ దేశ రహస్యాలను, ఆ ప్రధానమంత్రి ద్వారా తెలుసుకొని గుజరాత్ పై దాడి సలిపి హిందూ సైనిక స్థావరాలను నేలమట్టం చేస్తాడు. కర్ణావతి, సుల్తాన్‌కు వశమవుతుంది. గుజరాత్ సర్వనాశన మవుతుంది. ఆ రాజుతోపాటు ప్రధానమంత్రి బంధుగణం కూడా ముస్లిం కరకు కత్తులకు బలియై పోతారు. అతని కళ్ళముందరే అనేకమంది హిందూ స్త్రీలు మానభంగాలకు గురి అవుతారు. దేవాలయాలు నేలమట్టం చేయబడు తాయి. చిట్టచివరకి తాను నిత్యం వేద పారాయణం చేసే స్వగృహం కూడా నేలమట్టం చేయబడుతుంది. ఈ భీభ త్సానికి కారణభూతులెవరు? కారణం ఏమిటి? జాతీయ శీలం (దేశభక్తి) లేని ప్రధాన మంత్రి, వ్యక్తిగత శీలం లోపించిన రాజు - ఈ ఇరువురూ బాధ్యులే. కనుక ప్రతి ఒక్కరిలో వ్యక్తిగత శీలం , జాతీయ శీలం - ఈ రెండూ విధిగా ఉండాలి.

## శ్రీరాముని మాతృదేశభక్తి

రావణుడు శ్రీరాముని చేతిలో మరణిస్తాడు. యుద్ధం ముగుస్తుంది. లంకాపురి శ్రీరామునికి వశమవు తుంది. సువర్ణమయమైన లంకాపురిని చూచి లక్ష్మణుడు మోహపడతాడు. లంకాపురిని వదలి అయోధ్యకు వెళ్ళడానికి మనస్కరించక "అన్నయ్యా! సువర్ణమయమైన యీ లంకాపురిని వదలి, నిరుపేదదైన అయోధ్యకు వెళ్ళటం దేనికి? ఇక్కడనే వుండి, సకలసంపదలను హాయిగా అనుభవిస్తూ కాలం గడుపుదాం!" అని అంటాడు. అప్పుడు ఎంతో బాధతో, కోపంతో శ్రీరాముడు, లక్ష్మణునికి ప్రత్యుత్తరం యిస్తాడు.

**"అపిస్వర్ణమయీ లంకా, నమే లక్ష్మణ రోచతే**
**జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసి"**

" ఓ లక్ష్మణా! లంక బంగారుమయమైనను, నాకు ఇష్టం లేదు. తల్లియు, జన్మించిన దేశము స్వర్గము కంటే శ్రేష్ఠమైనవి" అని అంటాడు శ్రీరాముడు. ఈ ఉదంతం ద్వారా ఒక విషయం తేటతెల్లమవుతున్నది. శ్రీరామునికి మాతృపితృ భక్తులతో పాటు, మాతృదేశభక్తి ఎంత గాఢంగా ఉండేదో స్పష్టమవుతున్నది. ఒకవేళ తల్లి కురూపి కావచ్చు, గుడ్డిది కావచ్చు, కుంటిది కావచ్చు, ముదుసలి కావచ్చు. అయినప్పటికీ నవమాసాలు మోసి, కని, పెంచిన తల్లే తల్లే. ఆమె మాతృమూర్తే. అదేవిధంగా జన్మించిన దేశం పేదది కావచ్చు, బీదది కావచ్చు. అయినప్పటికి జన్మ యిచ్చిన తల్లి లాంటిదే, జన్మించిన దేశం. అట్టి మాతృదేశం కోసం, ప్రతి ఒక్కరూ తన సర్వస్వాన్ని ధారపోసి, విజ్ఞానాన్ని సముపార్జించి, దేశాభివృద్ధికి తోడ్పడటం పౌరుని కర్తవ్యం, ధర్మం. ఇదే భావాన్ని శ్రీరాముడు ప్రపంచానికి చాటి ఆదర్శప్రాయుడైనాడు.

## మెకాలే విద్యా విధానం

విద్య పరమార్థం శీల నిర్మాణం. గుణశీలురు కాలేని వారు విద్యావంతులు కాలేరు. శీల నిర్మాణానికి తోడ్పడే నీతి విద్య (Moral Education) నేడు కరువైపోయింది. నేడు మన సమాజంలో విద్యనభ్యసించడం ఉద్యోగం కోసమేనని, ధన సంపాదనకేననే అభిప్రాయం చాలా మందిలో పాతుకొని పోయింది. మనల్ని గుమాస్తాలుగా తయారు చేయాలనే సంకల్పంతోనే ఆంగ్ల విద్యను మనదేశంలో ప్రవేశపెడుతూ మెకాలె "ఇంగ్లీషు విద్య భారతీయుణ్ణి, ఇంగ్లీషు వానిగా మార్చి వేస్తుంది. రంగులో, రక్తంలో, ఊహలో ఈ విద్య భారతీయుణ్ణి, ఇంగ్లీషు వానిగా చేస్తుంది" అని ఆనాడే చెప్పాడు. ది. 12-10-1836న ఇండియానుంచి తన తల్లికి వ్రాసిన లేఖలో మెకాలె "It is my firm belief that if our plan of education is followed up, there would not be a single Idolator in Bengal 30 years hence". నేను ప్రవేశపెట్టిన విద్యా విధానం కొనసాగుతే 30 సంవత్సరాలయ్యే సరికి బెంగాలులో విగ్రహారాధకులు ఒక్కరూ ఉండరని నా దృఢ సంకల్పం" అని ఆ లేఖలో వ్రాస్తాడు. .......ఈ

(సశేషం)

# శ్రీవాణి జీవిత సభ్యులు



**Smt. D. Krishna Veni**
W/o Sri D. Rama Rao
Sunabeda, Orissa



**Sri G.V. Ramana Murthy**
**Smt. G. Krishna Veni**
Jamshedpur, Bihar



**Sri Juluru Venkateswara Rao**
**Smt. Juluru Satya Kumari**
Bhimavaram, W.G. Dt.



**Sri Paruchuri SriRanganayakulu**
Bhimavaram, W.G. Dt.



**Sri P. Raghu Rama Raju**
Bhimavaram
W.G. Dt.



**Sri Sunkara Venkata Subba Rao**
Bhimavaram, W.G. Dt.



**Sri A. Radhakrishnaiah**
Dharma Sevak,
Chennai - 6



**Dr. K. Ramakrishna Rao**
Chodavaram
Vizag Dist,



**Sri Talagadadivi Panduranga Vithal**
Ganapeswaram,
Krishna Dt.

## కృతజ్ఞతలు

శ్రీవాణికి జీవితసభ్యత్వం పంపి ప్రోత్సహించిన ఉదారవదాన్యులకు కృతజ్ఞతాభి వందనలు.

రు. 1,116/- లు విరాళముగా పంపి శ్రీవాణి మాసపత్రిక మరియు శ్రీవాణి ప్రచురించిన పుస్తకములను ఉచితంగా పొంద ప్రార్థన.

శ్రీవాణిని ప్రోత్సహించి, ఉత్తమ విలువలను సమాజానికి అందించడానికి తోడ్పడండి.

ధన్యవాదములు.

- సం.